# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 18 సంచిక : 8 హైదరాబాద్ 226 ఆగస్ట్ 2020 పేజీలు : 68 రు. 25

- సెక్రటేరియట్ కూల్చివేత - మూఢనమ్మకాలు
- జగన్ పాలనలో దళితులపై దాడులు
- రాజస్థాన్ రాజకీయంలో ప్రజా తీర్పేది?
- ఆధిపత్య వ్యవస్థ సృష్టి వికాస్ దుబే
- సాయిబాబాకు అరుంధతీ రాయ్ లేఖ
- సిలబస్ కుదింపు కుటిల యత్నాలు
- ఇజ్రాయిల్ దురాక్రమణ కొనసాగింపు

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్ | కాచిగూడ, హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ హైదరాబాద్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ హైదరాబాద్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్‌షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ హైదరాబాద్ | 9848672831 |
| సుధాకర్ బుక్‌స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక హైదరాబాద్ | 9949337605 |
| వెంకటేశ్వర బుక్‌స్టాల్ | రామ్‌నగర్ గుండు హైదరాబాద్ | 9502964995 |
| భవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ హైదరాబాద్ | 9849836996 |
| శ్రీభవాని బుక్‌స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) హైదరాబాద్ | 9640712555 |
| ఓరియన్ బుక్‌స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) హైదరాబాద్ | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) హైదరాబాద్ | 8977995537 |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలయబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీ లక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| మల్లిఖార్జున బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజారెడ్డి బుక్‌స్టాల్ | చందానగర్ బిఎచ్‌ఇఎల్ | 93466 07648 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 94900 99373 |
| నవ తెలంగాణ బుక్ హౌస్ | బాగ్‌లింగంపల్లి-సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్ | 94900 99378 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| అక్షర బుక్ వరల్డ్, ఎటిసి మార్కెటింగ్ | న్యూ టౌన్, మహబూబ్‌నగర్ | 90102 10464 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్‌స్టాల్, కూల్‌డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | 79890 81728 |
| రాజన్న బుక్ స్టాల్ | హనుమకొండ చౌరస్తా | 93955 07773 |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్‌స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దటూరు | 81210 02112 |
| క్రిసెంట్ న్యూస్ ఏజెన్సీ | కడప | 98852 35846 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రీ బుక్‌హౌస్ | మజీద్ వీథి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్‌సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |
| శ్రీదేవి సాయి కూల్‌డ్రింక్స్, కమ్యూనికేషన్స్ | దేవి చౌక్, రాజమండ్రి | 98489 84394 |
| త్రినాథ్ పాన్ షాప్ | మరిడి మహాలక్ష్మి టెంపుల్, రాజమండ్రి | 99519 76044 |

226 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఆగస్టు 2020
సంపుటి : 18
సంచిక : 8







**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన సత్తిబాబు, కాట్రావులపల్లి, తూర్పుగోదావరి - రు. 1,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

**అనివార్య కారణాల వల్ల ఈ సంచికలో అసహజ మరణాల సూచి, ఈనెల, ఇరుగు పొరుగు, భూగోళం శీర్షికలు ప్రచురించలేకపోతున్నందుకు విచారిస్తున్నాం. - సం.**

వీక్షణం ఏప్రిల్–జూలై సంచికలో కరోనాపై 9 వ్యాసాలు అచ్చువేసి కరోనా వివరించారు. వైరస్‌లు ఎందుకు వస్తాయో, వాటి పట్ల ప్రజలు ఎలా మెలగాలో, వాటిని కట్టడి చేయడంలో ప్రభుత్వాలు చేపట్టిన చర్యలను, వైఫల్యాలను తెలియజేసే విశ్లేషణతో కూడిన వ్యాసాలు ఉన్నాయి. ఈ విపత్కర పరిస్థితిలో పాలకుల అనాలోచిత నిర్ణయాల వల్ల 16 కోట్ల మంది వలస కార్మికులు ఎదుర్కొన్న సమస్యలు వారు బతికినంతకాలం మరిచిపోతారని అనుకోలేని పరిస్థితిని కల్పించారు. వేల కోట్ల డబ్బు, లక్షల సైన్యం, రోడ్డు, రైల్వే, విమాన సౌకర్యాలు ఉన్నప్పటికీ పాలకులకు వలస కార్మికులు ఈ సౌకర్యాలు పొందడానికి అర్హులుగా కనబడలేదు. అందుకే ఎలాంటి రవాణ సౌకర్యం లేక ఎర్రటెండలో వేల కిలోమీటర్లు చంకన పిల్ల, నెత్తిన ముల్లెలతో కాలినడకన నడిపించిన తీరు దేశం మొత్తం చూసింది. ప్రజలు ఎండకు పిట్టల్లా రాలిపోతుంటే పట్టించుకోని పాలకులు పెట్టుబడుల కోసం ఎలా సాగిలపడుతున్నారో చెప్పారు. పనిదొరకక కార్మికులు ఇబ్బంది పడుతుంటే పాలకులు కార్మిక చట్టాలను సవరించి 8 గంటల పని దినాన్ని 12 గంటలకు మార్చిన దుర్మార్గపు విధానాలను అమలు చేస్తున్నారు. ఇపుడు దేశంలో ఎటువంటి హక్కులు లేని అప్రకటిత బానిసత్వం కొనసాగుతున్నది. తాము ఈ దేశ పౌరులమేనని సిఎఎ, ఎన్‌ఆర్‌సిని వ్యతిరేకిస్తూ నిరసన తెలిపిన ముస్లిం సమూహాన్ని ఢిల్లీలో టార్గెట్ చేసి చంపారు. వారి ఆస్తులను ధ్వంసం చేశారు. వారిపై అక్రమ కేసులను నమోదు చేసి నిర్బంధించారు. ఈ సంఘటనల ద్వారా ఈ దేశంలో అప్రకటిత ఫాసిస్ట్ పాలన సాగుతుందనడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ప్రభుత్వం హరిస్తున్న ప్రజల హక్కుల కోసం మాట్లాడుతున్న మేధావులను నిర్బంధానికి గురిచేసి దేశంలో అప్రకటిత ఎమర్జెన్సీని అమలు చేస్తున్నారు. ఇదే సంచికలో 'కోపంలేని మనుషులపై కనికరం లేని దేశం' వ్యాసంలో కరోనా కాలమంతా వివిధ దశల్లో ప్రభుత్వం వ్యవహరించిన తీరు దాని వైఫల్యం, వలస కార్మికులు ఎదుర్కొన్న ఇబ్బందులు, మనుషులుగా వలస కార్మికుల పట్ల తమ సహకారాన్ని అందించిన వారి గురించి చాలా విషయాలను ప్రత్యక్ష అనుభవంతో రాసిన ఈ వ్యాసం ఒక చిన్న పుస్తకం వేయదగ్గదిగా అనిపించింది. ఇదే వ్యాసంలో ఎటువంటి సౌకర్యాలు లేని ప్రాంతంలో ప్రజల పట్ల బాధ్యతతో జరుగుతున్న ప్రత్యామ్నాయ ప్రక్రియలను వివరిస్తూ, ప్రజలు ముందు ముందు వైరస్‌లను ఎలా ఎదుర్కోవాలో రచయిత కొన్ని విలువైన సూచనలు చేశారు.

**– యాదగిరి**
కరీంనగర్

కరోనా ప్రభావం వల్ల వీక్షణం ఏప్రిల్–మే సంచికను ఆన్‌లైన్‌లో తీసుకువచ్చారు. జూలై సంచిక కూడా ఆన్‌లైన్‌లో వస్తుంది అనుకున్నాను. కానీ ఏప్రిల్–జూలై పత్రికను 84 పేజీలతో అచ్చు ద్వారా తీసుకువచ్చినందుకు ధన్యవాదాలు. పత్రిక అందిన వెంటనే అన్ని వ్యాసాలు చదివాను. పత్రికలో వచ్చే అన్ని వ్యాసాలు చదవదగినవిగానే ఉన్నాయి. కరోనా కాలంలో ప్రజలు ఎదుర్కొంటున్న ఇబ్బందుల గురించి మిగతా పత్రికల కన్నా వీక్షణంలో వచ్చే వ్యాసాలు చాలా లోతుగా ఉన్నాయి. కరోనా సమయంలో పేద ప్రజలు, వలస కార్మికులకు సహాయం చేసే కార్యక్రమాల్లో పాల్గొని, వారు పడుతున్న ఇబ్బందుల గురించి, వారి దయనీయ పరిస్థితి గురించి వనజ తన వ్యాసంలో ఎంతో చక్కగా వివరించారు. లాక్‌డౌన్ సమయంలో మధ్యతరగతి ప్రజానీకం ఇంట్లో ఉండి వండుకుని తింటూ, టైం గడవడానికి ఆటలు పాటలతో, సోషల్ మీడియాలో సరదాలు చేసుకుంటుంటే, కోట్ల మంది పేద ప్రజలు, వలస కార్మికులు తిండిలేక ఎంత దయనీయ స్థితిలో ఉన్నారో వారి సహాయ కార్యక్రమాల్లో పాల్గొని చూసిన పరిస్థితులను కళ్లకు కట్టినట్లుగా వివరించారు. కరోనా వల్ల ఆర్థిక స్థితి బాగాలేక సామాన్య జనం తిండిలేక చనిపోతుంటే, అదే సమయంలో విశాఖపట్నంలోని ఎల్‌జి పాలిమర్స్ కంపెనీ నుండి వెలువడిన విషవాయువు వల్ల అక్కడి పరిసర గ్రామాల ప్రజలు కంపెనీ యాజమాన్యం, పాలకుల నిర్లక్ష్యం వల్ల తమ ప్రాణాలు విడిచారు. దేశంలో ఎలాంటి సంఘటనలు జరిగినా ఆ విషయాలకు సంబంధించిన వ్యాసాలు వీక్షణంలో అచ్చువేస్తున్నందుకు సంపాదకులకు కృతజ్ఞతలు.

**– కృష్ణహరి**
మహబూబ్‌నగర్

వీక్షణం జూలై సంచికలో వ్యాసాలు బాగున్నాయి. ముఖ్యంగా కోవిడ్‌పై వచ్చిన ప్రత్యేక వ్యాసాలు ఎంతో విలువైన సమాచారాన్ని అందించాయి. వలస జీవుల దీనగాథలపై సి. వనజ రాసిన వ్యాసం ప్రస్తుత పరిస్థితులకు అద్దం పట్టింది. సంతోష్ వ్యాసంలో కరోనా పేరిట కార్పొరేట్ కంపెనీల వ్యాపారం గురించి బాగా రాశారు. అయితే ఈ సంచికలో ఈ నెల, ఇరుగు పొరుగు, భూగోళం పేజీలు కనపడలేదు. సంపాదకీయం తెలంగాణ యాసలో రాయడం బాగుంది. తెలంగాణ ప్రభుత్వం కరోనా కట్టడిలో పూర్తిగా నిర్లక్ష్యం వహిస్తోంది. రోజు రోజుకూ కరోనా కేసులు, మరణాలు సంభవిస్తున్నాయి. వీటిపై వివరంగా, విశ్లేషణలతో కూడిన వ్యాసం రాయాలని వీక్షణంను కోరుతున్నాను. పత్రికల్లో వచ్చే వార్తల్లో ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో అర్థం కావడం లేదు. అందుకైనా వీక్షణం బృందం ఈ పనికి పూనుకోవాలి.

**– కె. నరేందర్**
సిరిసిల్ల

నాలుగు నెలల తర్వాత వీక్షణంను అందుకున్నాను. సంతోషంగా అనిపించింది. వీక్షణం పాఠక కుటుంబంలో ఉన్న అనుబంధంతో పత్రికను చేతుల్లోకి తీసుకొని చదవడం ఆత్మీయ పలకరింపు ఉంటుంది. ఈ సంచికలో పేజీలు కూడా ఎక్కువగానే ఉన్నాయి. ప్రతి నెలా పత్రికను కచ్చితంగా అందించాలనే పట్టుదల వల్లనే ఇది సాధ్యమవుతుందనుకుంటాను. వీక్షణం టీంకు అభినందనలు. ఈ కృషి ఎల్లకాలం కొనసాగాలని ఆశిస్తున్నాను.

**– బి. నాగరాజు**
నల్గొండ

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# ప్రజలకు సంక్షోభం, పాలకులకు అవకాశం!



దొంగతనాలకు, దొంగపనులకు చీకటి అవసరమంటారు గాని, నరేంద్ర మోడీ ప్రభుత్వం కొవిడ్ కల్పించిన పట్టపగటి చీకటిలో లెక్కలేనన్ని దొంగతనాలు, దొంగపనులు చేస్తున్నది. కొవిడ్ మహావిపత్తు ప్రారంభమై, ప్రభుత్వం లాక్ డౌన్ విధించిన తర్వాత దేశప్రజలను ఉద్దేశించి చేసిన ఒక ప్రసంగంలో ప్రధానమంత్రి నరేంద్ర మోడీ "సంక్షోభాలను అవకాశాలుగా మార్చుకోవాలి" అని అన్నారు. నిజానికి ఇది రాజకీయాల్లో, సామాజిక శాస్త్రాలలో, యుద్ధతంత్రంలో సుప్రసిద్ధమైన మాట. ఏదైనా ఒక విపత్తు వచ్చినప్పుడు దాని నుంచి గట్టెక్కడం ఎట్లా, గట్టెక్కడానికి దానిలో నుంచే ఒక అవకాశాన్ని కనిపెట్టడం ఎట్లా అనే అర్థంలో అది ఇంతవరకూ వాడకంలో ఉంది. పెట్టుబడిదారీ విధానం దాని అంతర్గత వైరుధ్యాలవల్ల నిరంతరం సంక్షోభంలో ఉంటుందని, ఆ సంక్షోభాన్ని ప్రజాశక్తులు అవకాశంగా తీసుకోవాలని (బ్రేక్ డౌన్ నుంచి బ్రేక్ థ్రూ) అని సైద్ధాంతీకరించిన మార్క్సిస్టు మేధావులు ఉన్నారు. జారిస్ట్ పాలకవర్గాలకు వచ్చిన యుద్ధ సంక్షోభాన్ని ప్రజల తరఫు నుంచి అంతర్యుద్ధ అవకాశంగా మార్చిన లెనిన్ బోల్షివిక్ విప్లవ విజయమే సాధించాడు. కనుక సంక్షోభాన్ని అవకాశంగా మార్చుకోవడం అనేది ప్రపంచ చరిత్రలో కొత్త విషయమేమీ కాదు. కాని ఇవాళ దేశంలో సంఘ పరివారం ఆ మాటను వాడుకుంటున్న తీరు చరిత్రలో కొత్త పోకడకు నిదర్శనంగా నిలుస్తున్నది. ఇది సంక్షోభం నుంచి గట్టెక్కే ప్రయత్నం కాదు. సంక్షోభాన్ని మరింత పెంచే చర్యలకు అవకాశం తీసుకోవడం, సంక్షోభాన్ని ప్రజల మీదికి నెట్టి, పాలకవర్గాలకు మరిన్ని అవకాశాలను కల్పించడం.

అంతకు ముందే భయంకరమైన ప్రజా వ్యతిరేక విధానాలు ప్రకటిస్తున్న, అమలు చేస్తున్న సంఘ పరివార్ ప్రభుత్వం మార్చ్ 24 న మొదటి లాక్ డౌన్ ప్రకటించినప్పటి నుంచి ఇది రాస్తున్న జూలై చివరి వారం దాకా నాలుగు నెలల కాలంలో ఎన్నెన్ని దుర్మార్గమైన విధానాలు, చర్యలు ప్రకటించిందో, అమలు చేసిందో కేవలం జాబితా రాసినా ఒక పేజీ సరిపోదు. ఈ నిర్ణయాలు, చర్యలు సమాజంలోని సమస్త రంగాల మీద ప్రభావం వేయగలిగినంత విశాలమైనవి, ఎన్నో దశాబ్దాల పాటు సమాజాన్ని అతలాకుతలం చేయగలిగినంత లోతైనవి. అవి ఆర్థిక రంగంలో, రాజకీయ రంగంలో, ప్రభుత్వ పాలనా రంగంలో, విద్యా రంగంలో, వైద్య, ఆరోగ్య రంగంలో, చట్టబద్ధ పాలన రంగంలో, ప్రచార సాధనాల రంగంలో అన్ని చోట్లా అమలులోకి వస్తున్నాయి. వాస్తవంగా ఈ చర్యలకూ కొవిడ్ మహావిపత్తును ఎదుర్కోవడానికీ ఏమీ సంబంధం లేదు. బహిరంగ ప్రజాభిప్రాయం వ్యక్తం కావడానికి అవకాశం లేని స్థితిలో, ఆ మహావిపత్తు పేరు చెప్పి తమ పబ్బం గడుపుకోవడానికి, తమ రహస్య, బహిరంగ ఎజెండాలను అమలులోకి తేవడానికి పాలకవర్గాలు ప్రయత్నిస్తున్నాయనడానికి నిదర్శనమే ఈ చర్యలు. కొవిడ్ వల్ల దెబ్బతిన్న ఆర్థిక వ్యవస్థ సమస్యలను పరిష్కరించడానికి సంస్కరణలు అవసరమనే పేరుతో, ఏ మాత్రం సంబంధం లేని ప్రభుత్వ రంగ సంస్థలను తెగనమ్మే కార్యక్రమం ప్రారంభమయింది. దేశ వనరులను పిడికెడు మంది తమ ఆశ్రితులకూ, తాము దళారీలుగా ఉన్న దేశదేశాల సంపన్నులకూ అప్పగించడానికి పెద్ద ఎత్తున ప్రయత్నాలు మొదలయ్యాయి. ఎన్నికల రాజకీయాలను విమర్శించేవారిని ప్రజాస్వామ్యం మీద నమ్మకం లేనివారుగా భావించేవారు, ఎన్నికల రాజకీయాల పవిత్రత గురించి మాట్లాడేవారు, కొవిడ్ చీకట్లో భారతీయ జనతా పార్టీ మధ్య ప్రదేశ్, రాజస్తాన్ లలో ఎన్నికైన ప్రభుత్వాలను కూలగొట్టి తన ప్రభుత్వాలను స్థాపించుకోవడానికి ఎన్ని కుట్రలకూ కుతంత్రాలకూ పాల్పడిందో చూడవచ్చు. సమాఖ్యతత్వం, శాసనసభ, గవర్నర్ వంటి విలువలను, నిర్మాణాలను భాజపా ఎట్లా తుత్తునియలు చేసిందో స్పష్టంగా అందరి కళ్లముందూ ఉంది. పర్యావరణ విధ్వంసక పథకాలు ప్రారంభించేటప్పుడు తప్పనిసరిగా జరపవలసిన బహిరంగ ప్రజా విచారణను రద్దు చేయడం, పాఠశాల పాఠ్యాంశాల లోంచి ఎంపిక చేసి ప్రగతిశీల అంశాలను తొలగించడం, చైనాతో యుద్ధం రాబోతున్నదని బూచి తయారు చేసి ప్రజల్లో భావోద్వేగాలు రెచ్చగొట్టి, అసలు సమస్యల నుంచి దారి మళ్లించడం, నూతన విద్యావిధానం, వివాదాస్పద, భారీ అవినీతికి నిలయమైన రఫేల్ విమానాల దిగుమతి వంటి చర్యలన్నీ శరవేగంగా జరిగిపోతున్నాయి. ప్రగతిశీల, ప్రజాస్వామిక, ఉదారవాద మేధావులను, కార్యకర్తలను, విద్యార్థులను వేధించడం, తప్పుడు కేసుల్లో ఇరికించి నిర్బంధించడం పెద్ద ఎత్తున సాగిపోతున్నది. సాధారణ సందర్భంలో ఇటువంటి ప్రజావ్యతిరేక చర్యలను నిరసిస్తూ సాగే ప్రజాందోళనలకు ఇవాళ కొవిడ్ సందర్భంగా అవకాశం లేదు. ఈ నాలుగు నెలల్లో కుప్పకూలిన, తమ పని తాము చేయడంలో విఫలమైన, ప్రజా వ్యతిరేక నిర్ణయాలకు పాల్పడిన నిర్మాణాల వరుస చూస్తే కనీసం 1947 నుంచి 2020 వరకు పాలకవర్గాలకు అనుకూలంగా పనిచేస్తూనే ఎక్కడో ఒకచోట ప్రదర్శన కోసమైనా ప్రజానుకూలమైన పనులు ఒకటో అరో చేసిన నిర్మాణాలు ఏవైనా మిగిలి ఉన్నాయా అని అనుమానం కలుగుతున్నది. చట్టసభలు, అధికార యంత్రాంగం, న్యాయవ్యవస్థ, విద్యా, వైద్య, ఆరోగ్య వ్యవస్థలు, ప్రచారసాధనాలు... దాదాపుగా ప్రభుత్వ అధీనంలో, ప్రజా ధనంతో నడిచే, ప్రజలకు జవాబుదారీగా ఉండవలసిన అన్ని నిర్మాణాలూ సంఘ్ పరివార్‌కు, పాలకవర్గాలకు, ఆధిపత్య శక్తులకు అడుగులకు మడుగులొత్తుతూ నడిచే దుస్థితి దాపురించింది. ఇదేదో హఠాత్తుగా తలెత్తినది కూడ కాదు, ఏడు దశాబ్దాలుగా కొనసాగుతున్న ప్రజా వ్యతిరేక పరిణామాలు, సంఘ పరివార్ అధికారానికి రావడంతో విషమించి, కొవిడ్ చీకటి మాటున జడలు విప్పి నగ్నంగా నాట్యమాడుతున్నాయి.

ఈ చర్యలన్నిటి సారాంశం ఒకటే, భారత సమాజపు బహుళత్వాన్ని విధ్వంసం చేసి, ఒకే మార్కెట్, ఒకే మతం, ఒకే భాష, ఒకే జీవనవిధానం, ఒకే పాలనగా ఏకసూత్రంతలోకి కుదించి మరింతగా సామ్రాజ్యవాద – భూస్వామ్య రథచక్రాలకు కట్టెయ్యడం. వలస పాలనలో, వలసానంతర కాలంలో భారత సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక వ్యవస్థలలో ఏర్పడిన నిర్మాణాలన్నిటినీ లోలోపలి నుంచి ధ్వంసం చేసి, భూస్వామ్య, వర్ణాశ్రమ ధర్మ, మనుధర్మ ఆధారిత నిర్మాణాలను రూపొందించడం, అచారిత్రకమైన భూస్వామ్య పునరుద్ధరణ కోసం ప్రయత్నించడం, మరొకవైపు సామ్రాజ్యవాద శక్తులకు ఊడిగం చేస్తూ, వారి రాజకీయార్థిక ప్రయోజనాలను కాపాడడం, ఈ పరిణామాలను వ్యతిరేకించేవారి, భారత సమాజపు బహుళత్వాన్ని, ప్రజాస్వామ్యాన్ని, లౌకికతత్వాన్ని, సమానత్వాన్ని సమర్థించేవారందరి స్వరాలు వినబడకుండా చేయడం. ఈ సంఘ పరివార్ ప్రభుత్వం చేయదలచుకుంటున్న పనులు. భారత సమాజ భవిష్యత్తు గురించి తీవ్రమైన నిరాశా నిస్పృహల కాలం చుట్టుముడుతున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# నిజాన్ని కూల్చుడు, అబద్ధాన్ని కట్టుడు, ఎంత మజా!

**సీ**న్మలు, సెల్‌ఫోన్లు వచ్చి పోరలంత సంబురాలే లేకుంట పాడై పోయింద్రుగని, మా శిన్నతనంల ఎన్ని ఆటలుండేటియి, పాటలుండేటియి, మాటలుండేటియి, ఎన్ని గమ్మతులుండేటియి. ఇప్పుడు యాడ్నున్న కోటికొక్కడు గుడ కనబడ్తలేడు గని, మా శిన్నతనంల పెద్ద సంబురం టుపాకి రాముడంట ఉండెటోడు. ఒగ చెక్క టుపాకి ఏస్కోని ఊళ్లె జొచ్చి, కచ్చీరు కాడనో, వాడలల్లనో, మోతుబరుల ఇంట్లముంగల్నో నిలబడి కొండొక్క రాగం దీసెటోడు. ఆ ముచ్చెట పురాగ ఇంకోపారి జెప్త గని, ఇప్పటికైతె ఒక్క సంగతి జెప్త. మన దొర జేశె యవ్వారం జూత్తాంటె గది యాదికొచ్చింది. తుపాకి ఎంకట్రామడు జేశే అస్సలు పనేందంటె నిజాన్ని కూలగొట్టుడు, అబద్ధాన్ని కట్టుడు. తూముల మంట బెట్టుడంటే ఏంది, చెరువుల బియ్యం పోసుడంటే ఏంది, చింతాకు ఇస్తరి ఏసుడంటె ఏంది, ఒక్క మెతుకు దిని ఇరగ దిన్నమనుకునుడంటె ఏంది. నిజం అర్గీజు ఉండొద్దు. అబద్ధం రాజ్జెమేలాలె. గంతే గద. యాడ్నున్న నిజం ఉన్నదంటె కూలగొట్టు. ఇల్లు పీకి పందిరెయ్యి. ఉశికెల బంగ్లలు గట్టు. టుపాకి ఎంకట్రామడు పెగ్గెలు జెప్తాంటె సుట్టూరుగ నిలుసుండి మేం పక్కడ పక్కడ నవ్వెటోల్లం. ఇయాల తెలంగాణ కత గట్లయిపాయె. మంచిగున్నది కూలగొట్టుడు, కడ్తనని ఆస పెట్టుడు. ఆ కూలగొట్టుడుల, కట్టుడుల గుడ పైస ఆమ్దని ఉన్నదంటె చేసుడు. ఏమి పడ్తల్ లేదంటె ఉల్లెక్కాల మాట అనుడు. ఆరేండ్లల్ల ఎన్ని జూస్తిమి. గిప్పుడు దొర పెద్ద దఫ్తర్ కూలగొట్టిండట గద. నా శిన్నప్పుడు ఒక్కపారి బోతి. అబ్బో ఎంత బంగుల, ఏమి కత. ఏమైంది నాయినా దానికి? ఏదన్న కూలగొట్టాల్నంటే అది పనికిరాకుండ గావాలె గద. మల్ల కొత్తది గట్టుడంటె మాటలా, మస్తు పైస గావాలె గద. సర్కారుకు ఆ పైసలు యాడ్నించొస్తయ్ బాంచెన్. నువ్వూ నేనూ నెత్తురు శెమట జేస్కోని పైస పుట్టిస్తె, దాంట్ల సర్కారు తన ఇస్సా దీస్కుంటది గద. గా పైసలు గిట్ల పప్పులు పుట్నాలు జేస్తె ఎట్ల బాంచెన్. మారె, పాత బంగుల పనికి రాకుంటయింది, కూలగొట్టి కొత్తది గట్టకపోతె పని నడుస్తలేదు అంటె పోనీ తియి అనుకోవచ్చు. కని పెద్ద దఫ్తర్‌ల ఏడో ఎనిమిదో బంగులలు ఉన్నయట గద. వాట్లల్ల ఒక్క బంగులకే శాన వైసయిందట గద. అయినా ఆ బంగుల గుడ పని జేస్తనే ఉన్నదట గద. మరమ్మతులు జేస్తె కాదా బాంచెన్. ఇగ ఓ రెండు బంగులలయితె కట్టి పదేండ్లు గుడ కాలేదట గద. గవాట్ని కూలగొట్టుడు ఎందుకు నాయినా? అచ్చా, కొత్త గుత్తెదార్లకు పైసలు దోశి పెట్టుటానికా. గది నివద్దె బాంచెన్. ఏదైన పనికొస్తదా, పనికి రాదా అని సూడొద్దు. మన గుత్తెదారుకు ఆమ్దని ఉన్నదా లేదా అని సూడాలె. మల్ల గీ బంగులలు గిట్లెందుకు కూలగొడ్తాంద్రయా అని ఎవడన్న అడిగిండనుకో, అగ్గో ఆంద్రోల్లు గట్టిన బంగ్లాలు ఉంచమంటవా, ఆంద్రోని అంటు సొంటు లేకుండా జేయాల్నని గద తెలంగాణ దెచ్చుకున్నది అని ఎదురు సవాల్ జేయొచ్చు. కని, బాంచెన్ నాకొక్కటి సమజ్ గాలె, ఈ ఆరేండ్లల్ల తెలంగాణల బలిసిన పెద్ద పెద్ద గుత్తెదార్లందరు ఆంద్రోల్లేనట గద. ఇంతకు, గీ దఫ్తర్ బంగ్లలు కూలగొట్టుడుల ఆంద్ర లేదు, తెలంగాణ లేదు, పనికొచ్చుడు లేదు, పనికి రాకపోవుడు లేదు. ఒక్కటే ముచ్చెట ఉన్నదట. ఆ బంగ్లలు దొరకు అచ్చిరావని ఎవలో సోది జెప్పింద్రట. అయ్యా, తెలంగాణ సోది మీదనే నడుస్తాందా, నేనిన్నాళ్లు జనం మీదనో, కొట్లాట మీదనో, తెలంగాణ మీద పావురం మీదనో నడుస్తాందనుకుంటాన. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# దళితుల మీద దౌర్జన్యాలు చూపుతున్నదేమిటి?

**ఆం**ధ్రప్రదేశ్‌లో దళిత సమూహాల మీద, నాయకుల మీద, ఉద్యోగుల మీద ప్రభుత్వ, ఆధిపత్య శక్తుల దాడులు, దౌర్జన్యాలు పెరిగిపోతున్నాయనే విచారకరమైన వార్తలు నానాటికీ పెరుగుతున్నాయి. నిజానికి ఇవాళ అధికారంలో ఉన్న వైఎస్‌ఆర్‌సిపి ఆ స్థానానికి రావడానికి కారణమైన ప్రధానశక్తులలో దళిత సమూహం ఒకటి. అంతకు ముందరి తెలుగుదేశం పాలన స్పష్టంగానే ఒక ఆధిపత్య కులానికి వత్తాసు పలుకుతూ, వారి ప్రయోజనాలు కాపాడడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా పని చేసిన నేపథ్యంలో, ఆ ఐదు సంవత్సరాల పాలనలో దళితులలో ఆ పార్టీ పట్ల వ్యతిరేకత పెరిగింది. ఆ వ్యతిరేకత వల్ల కొంత, దళిత క్రైస్తవుల మొగ్గు వల్ల కొంత, ఎన్నికల రాజకీయాలలో మరొక ప్రత్యామ్నాయం లేక కొంత, జగన్ మోహన రెడ్డి వాగ్దానాల భ్రమల వల్ల కొంత దళితుల వోట్లు ఎక్కువ సంఖ్యలోనే వైఎస్‌ఆర్‌సిపికి పడ్డాయి. కాని ప్రస్తుత వ్యవస్థలో ఎవరు అధికారానికి వచ్చినా పీడిత ప్రజల పరిస్థితి, అందులోనూ మన కుల ప్రాధాన్య సమాజంలో అట్టడుగు కులాలుగా ఎంచబడే దళితుల స్థితి దారుణంగానే ఉంటుందని, ఏ పాలక పార్టీ కూడ పీడితుల్లోకెల్లా పీడితులైన దళితులకు ఒరగబెట్టేది ఏమీ లేదని కొత్త అధికారవర్గాలు త్వరలోనే రుజువు చేశాయి. అధికారంలోకి వచ్చి ఏడాదిన్నర కూడ కాకముందే రాష్ట్ర వ్యాప్తంగా అనేక చోట్ల దళితుల మీద దాడులు, దౌర్జన్యాలు, హత్యలు, అత్యాచారాలు పెరిగిపోయాయి. గ్రామీణ ప్రాంతాల్లోని దిక్కుమొక్కు లేని నిరుపేద దళితుల మీద మాత్రమే కాదు, విద్యావంతులైన, ఉన్నతోద్యోగాలలో ఉన్న దళితుల మీద కూడ ఈ దౌర్జన్యాలు సాగుతున్నాయి. దళితుల మీద దాడులు జరిగితే వెంటనే స్పందించవలసిన, బాధితులకు రక్షణ కల్పించవలసిన, దౌర్జన్యకారులను చట్టబద్ధంగా నిర్బంధంలోకి తీసుకుని, కేసులు నడపవలసిన అన్ని అధికార యంత్రాంగాలూ మౌన సాక్షులుగా మిగిలిపోతున్నాయి. దళితవర్గాల ఆందోళన తర్వాత తూతూ మంత్రంగా కేసులు నమోదు చేసినప్పటికీ, వాటి కొనసాగింపు, నేరస్తులకు శిక్షలు ఉండడం లేదు. ఇటీవలి కాలంలోనే తూర్పు గోదావరి, ప్రకాశం జిల్లాల్లో అత్యాచారం, దళితులను కులం పేరుతో దూషించడం, అవమానించడం, పోలీసు స్టేషన్‌లో చిత్రహింసలు పెట్టి హత్య చేయడం వంటి ఘటనలు వెలికివచ్చాయి. మరొకపక్క విశాఖపట్నం, చిత్తూరు జిల్లాల్లో దళిత వైద్యుల పైన, చిత్తూరు జిల్లాలో దళితుడైన మాజీ న్యాయమూర్తి మీద, నెల్లూరు జిల్లాలో దళిత ఎం ఆర్ వో మీద దాడులు జరిగాయి. ఇక గ్రామీణ ప్రాంతాల్లో రోజువారీ దౌర్జన్యాలు, అవమానాలకు లెక్క లేదు. తమ సమూహం మీద, సామాజిక న్యాయ భావన మీద ఇంత పెద్ద ఎత్తున దాడులు జరుగుతుంటే కొందరు దళిత నాయకులు తమ స్వార్థ రాజకీయాల్లో భాగంగా అధికారపార్టీకి అండగా ఉంటున్నారు గాని తమ సమూహం పక్షాన గొంతెత్తడం లేదు. పాదిరికుప్పం, కారంచేడు, నీరుకొండల నుంచి లక్షింపేట ల దాకా దళితుల మీద దౌర్జన్యాల, అత్యాచారాల గురించి గొంతెత్తి నినదించి, విస్తారమైన ఉద్యమాలు నిర్మించిన ఆంధ్రప్రదేశ్ సమాజం ఇవాళ మౌనంగా ఈ ఘోరాలను జరిగిపోనిస్తుండడం సామాజిక స్తబ్దతకు చిహ్నం. ఈ స్తబ్దతను బద్దలు కొట్టవలసి ఉంది. వీ

# అమెరికా అధ్యక్ష ఎన్నికలు వాయిదా పడతాయా?

**- సతీష్ బైరెడ్డి**

**కు**దేలవుతున్న ఆర్థికవ్యవస్థ, జార్జి ఫ్లాయిడ్ హత్యతో "బ్లాక్ లైవ్స్ మేటర్" ఉద్యమం ఊపందుకోవడం, కరోనాను కట్టడి చేయలేక అమెరికా ప్రజల ఆరోగ్యం ప్రమాదంలో పడడానికి కారకుడు అనే అపవాదు వెరసి అధ్యక్ష పీఠం మీద మరో నాలుగేళ్లు ఉండిపోవాలను కుంటున్న డోనాల్డ్ ట్రంప్ ఆశలపై నీళ్లు చల్లేలా ఉన్నాయి. అనేక సర్వేలలో తన డెమోక్రటిక్ ప్రత్యర్థి జో బైడెన్ కంటే వెనుకబడిపోవడంతో ట్రంప్‌లో అభద్రతా భావం చోటుచేసుకున్నది. గత ముగ్గురు అధ్యక్షులు రెండుసార్లు ఎన్నికయ్యారు. ఆ అవకాశం ట్రంప్‌కి ఉంటుందా? అమెరికా అధ్యక్ష చరిత్రలో చిత్ర విచిత్ర విన్యాసాలకు పాల్పడిన వారిలో మొదటి వరుసలో ఉంటాడు డోనాల్డ్ ట్రంప్! తనకు తోచిందే తడవు సంభవించే పరిణామాలతో సంబంధం లేకుండా నిర్ణయాలు తీసుకుంటాడు. క్షేత్రస్థాయి ప్రజానాడి బోధపడుతున్నదేమో కరోనా కారణంతో ఎన్నికల వాయిదా రాగం ఎత్తుకున్నాడు. మళ్లీ మరుక్షణమే మాటలు కూడా మారుస్తున్నాడు. నిజానికి రెండు వందల నలభై నాలుగు సంవత్సరాల అమెరికా అధ్యక్ష ఎన్నికల చరిత్రలో ఎన్నిక ఏనాడు వాయిదా పడలేదు. ఇప్పుడున్న నవంబర్ 3 ఎన్నికల తేదీ కూడా అమెరికా ఫెడరల్ చట్టం ప్రకారం 1845లో నిర్ణయించబడినది. 1861-65లో అమెరికా అంతర్యుద్ధం సమయంలో గాని, 1918లో కరోనా లాంటి భయంకరమైన స్పానిష్ ఫ్లూ వచ్చినప్పుడు గాని, రెండు ప్రపంచ యుద్ధాల సమయాల్లోనూ ఏనాడు ఆ తేదీ మారింది లేదు. మార్చే లేదా వాయిదా వేసే అధికారం అధ్యక్షునికి అంతకంటే లేదు. అమెరికా కాంగ్రెస్, అధ్యక్షుడు కలిసి మార్చినప్పటికీ అది కోర్టులో చెల్లుబాటు కాకపోవచ్చు. ఇప్పుడున్న పరిస్థితుల్లో కాంగ్రెస్‌లో డెమోక్రాట్లకే మెజారిటీ ఉండటంతో అది ఏ మాత్రం సాధ్యం కాకపోవచ్చు. అంత పటిష్టంగా ఉన్నది ఆ ఎన్నికల చట్టం. తన స్వంత రిపబ్లికన్ పార్టీ వారే ఈ ఆలోచనను అంగీకరించే పరిస్థితి లేదు. దేశవ్యాప్తంగా కూడా ఈ వాదనకు వ్యతిరేకత ఎదురవుతున్నది. కరోనా కారణంగా ఓటర్లు పోలింగ్ కేంద్రాలకు రానవసరం లేకుండా మెయిల్ ఇన్ పద్ధతిలో ఎన్నికలకు ముందే ఓటర్లకు బ్యాలెట్ పత్రాలను పంపించి ఓటు వేయించే పద్ధతిని తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాడు ట్రంప్. ఈ నేపథ్యంలోనే ఒకానొక దశలో నేను ఓడిపోతే ఎన్నికల్లో అక్రమాలు జరిగినట్టే అనే వరకు కూడా వెళ్లాడు. బహుశా రేపు ఓడిపోతే అక్రమాలే కాదు చైనా కుట్ర కూడా ఉందని తప్పకుండా చెబుతాడు. ఎవరి అభిప్రాయాలు, అంచనాలు ఎలా ఉన్నా అమెరికా అధ్యక్ష ఎన్నికల్లో గెలిచే పార్టీ వ్యక్తులను బట్టి ప్రపంచవ్యాప్తంగా అనేక పరిణామాలు సంభవిస్తాయి. ట్రంప్ తీసుకున్న వైఖరితో చైనాతో ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణం నెలకొన్నది. ఇరాన్‌తో కుదిరిన అణు ఒప్పందం నుంచి వైదొలగడంతో ఆదేశంతో యుద్ధం అంచుల వరకు వెళ్లింది. ఆ దేశంపై విధించిన విపరీత ఆంక్షల వల్ల చమురు ధరలు పెరగడంతో ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాల ప్రజలు తీవ్ర ఇక్కట్లను ఎదుర్కొన్నారు. ఎన్నికల నిర్వహణ అనేది అమెరికా అంతర్గత వ్యవహారమే కావచ్చు కానీ అక్కడ జరిగే ప్రతి పరిణామం ప్రపంచవ్యాప్త ప్రభావాన్ని చూపుతుంది. అన్ని దేశాల స్వతంత్రాన్ని, ఇతర దేశాలతో సంబంధాలు నెరిపే విషయంలో వాటి హక్కుల్ని, స్వేచ్ఛను అమెరికా గౌరవించకపోతే అనేక దుష్పరిణామాలు సంభవిస్తాయి. వీ




పోదాం
పోదాం
పైపైకి



❖ **నవోదయ రామమోహనరావు ప్రస్థానం** – 254 పేజీలు, 1/4 క్రౌన్, ప్రతులకు: అట్లూరి ఝాన్సీ లక్ష్మి, 60-3-26, జి.ఎఫ్-2, దివ్యసాయి ఎన్‌క్లేవ్, ఓల్డ్ ఐ.టి.ఐ. బస్టాప్, రోడ్ నెం. 5, అశోక్‌నగర్, ఎస్.బి.ఐ. కాలనీ-1, విజయవాడ – 500010
సెల్: 9246182977



❖ **సంగారెడ్డి జిల్లా సాహిత్య చరిత్ర** – అవుసుల భానుప్రకాశ్ – తెలంగాణ సాహిత్య అకాదమి ప్రచురణలు – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **ఆదిలాబాద్ జిల్లా సాహిత్య చరిత్ర** – ఉదారి నారాయణ – తెలంగాణ సాహిత్య అకాదమి ప్రచురణలు – 100 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **పోతన కవితాసుధ** – డా. పి. యశోదారెడ్డి – తెలంగాణ సాహిత్య అకాదమి ప్రచురణలు – 122 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **పరిసరాలు** – సంకలనం: పట్టికోట ఆళ్వారుస్వామి – తెలంగాణ సాహిత్య అకాదమి ప్రచురణలు – 258 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **కష్టజీవి** – ఆకెళ్ల సుబ్రహ్మణ్యకవి – తెలంగాణ సాహిత్య అకాదమి ప్రచురణలు – 52 పేజీలు, 1/8 డెమీ, రు.25

పై ఐదు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాదమి, కళాభవన్, రవీంద్రభారతి ప్రాంగణం, హైదరాబాద్ – 500004, ఫోన్ : 040-29703142



❖ **ప్రాణం వాసన** – కవిత్వం – రమాదేవి బాలబోయిన – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: రమాదేవి బాలబోయిన, ఇ.నెం.3-34/1/సి, బృందావన్ కాలని-1, గోపాల్‌పూర్, హన్మకొండ – 506 015, సెల్: 7893261262



❖ **కలల కన్నీటి పాట** – విభా కవితలు – అనువాదం: అజయ్ వర్మ అల్లూరి – రాణి ప్రచురణలు – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: అజయ్ వర్మ అల్లూరి, 106, 4వ క్రాస్, మారుతీ టెంపుల్ రోడ్, గంగోత్రి లే-అవుట్, మైసూరు-6, కర్నాటక.
సెల్: 9535576037



❖ **కోకిల-గులాబీ** – ప్రపంచ ప్రసిద్ధ కథకుల అనువాద కథల సంకలనం – అనుసృజన: రంగనాథ రామచంద్ర రావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 85



❖ **విచిత్ర ప్రకృతి** – వి.ఆర్. శాస్త్రి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 116 పేజీలు, 1/8 డెమీ, రు.90



❖ **సత్యశోధన** – మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ ఆత్మకథ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 392 పేజీలు, 1/8 డెమీ, రు. 180



❖ **ప్రాచీన భారతదేశంలో వైజ్ఞానిక ప్రగతి** – ముక్కామల నాగభూషణం – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 112 పేజీలు, 1/8 డెమీ, రు. 95



❖ **చౌబోలీ** – రాజస్థాన్ జానపద కథలు – విజయదాన్ దేథా, తెలుగు: టి. లలిత ప్రసాద్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 70 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **నైపుణ్య వికాసం** – ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి – డా. బుర్ర మధుసూదన్‌రెడ్డి – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 200 పేజీలు, 1/8 డెమీ, రు. 160
పై ఐదు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జి.ఎస్.ఐ. పోస్ట్, హైదరాబాద్ – 500068
ఫోన్ : 040 – 29884454



❖ **సముద్ర కెరటం** – కవిత్వం – సముద్రాల కుమారస్వామి – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సముద్రాల కుమారస్వామి, తెలుగు ఉపాధ్యాయులు, గ్రా. నల్లగుంట, మం. వెంకటాపూర్, ములుగు జిల్లా – 506 345; సెల్: 9705476138



❖ **పైసల చెట్టు** – కవిత్వం – డా. మడత భాస్కర్ – 130 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: శ్రీమతి మడత సంధ్య, ఎం.ఎ.(తెలుగు), వినాయక కాలని, నాయుడు పెట్రోల్ పంపు దగ్గర, వరంగల్
సెల్: 8919328582

# సెక్రటేరియట్ కూల్చివేత - మూఢ నమ్మకాలు

***రాష్ట్ర ప్రభుత్వ సచివాలయాన్ని మొత్తంగా కూల్చి, ఆ స్థానంలో కొత్త భవనాలు కట్టాలనే ప్రతిపాదన ఉచితానుచితాలు చర్చిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

మొదట ఇరవయో శతాబ్ది తొలిరోజుల నుంచీ నిజాం ప్రభుత్వ ప్రధాన కార్యాలయంగానూ, తర్వాత 1948-56 కాలంలో హైదరాబాద్ రాష్ట్రానికీ, 1956-2014 కాలంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికీ సచివాలయం గానూ, 2014 నుంచి ఆరు సంవత్సరాలుగా తెలంగాణ ప్రభుత్వ సచివాలయంగానూ ఎన్నో దశాబ్దాల పాటు ప్రభుత్వ ప్రధాన కార్యకలాపాలన్నిటికీ, ముఖ్యమంత్రుల, మంత్రుల అధికార నిర్వహణ అంతటికీ నిలయమైన సెక్రటేరియట్ కుప్పకూలిపోయింది. ఇరవై ఐదున్నర ఎకరాలలో గత 130 సంవత్సరాలలో నిర్మాణమైన ఎనిమిది భవనాలను తెలంగాణ ప్రభుత్వం 2020 జూలై7 నుంచి ప్రారంభించి మధ్యలో హైకోర్టు మధ్యంతర ఉత్తర్వుల వల్ల నాలుగైదు రోజులు ఆపి, హైకోర్టు ఆమోదం తర్వాత జూలై 17 నుంచి జూలై చివరి వరకు నేలమట్టం చేసేసింది.

దేన్నయినా విధ్వంసం చేయడం సులభమైన పని. కాని ఆ విధ్వంసం ఎందుకోసం అనేది ముఖ్యమైన ప్రశ్న. విధ్వంసం తర్వాత ఏమి నిర్మాణమవుతున్నది, ఎట్లా నిర్మాణమవుతున్నది, ఎందుకు నిర్మాణమవుతున్నది అనేవి అనుబంధ ప్రశ్నలు.

తెలంగాణ ప్రభుత్వం ఈ ప్రశ్నలకు వేటికీ జవాబు చెప్పదలచుకోలేదు. లేదా డొంక తిరుగుడు జవాబులు చెప్పదలచుకున్నది. అసత్యాలు, అర్ధసత్యాలు, అతిశయోక్తులు చెప్పదలచుకున్నది. కూలిన భవనాలు ఆయా కాలాల తెలంగాణ నెత్తుటితో, చెమటతో నిర్మాణమయ్యాయి గనుక, అవి తరతరాల తెలంగాణ ప్రజల చారిత్రక సంపద గనుక ఆ ఆస్తిని ఎందుకు విధ్వంసం చేయడం జరిగిందో తెలంగాణ ప్రజలకు జవాబు చెప్పడం ప్రభుత్వ బాధ్యత. ఇప్పుడు అధికార గర్వంతో, తానా తందానా బాజా భజంత్రీల మద్దతుతో జవాబు చెప్పకుండా తప్పించుకోవచ్చు, ఎదురు సవాళ్లు విసిరి విమర్శకుల నోళ్లు మూయించానని తృప్తి పడవచ్చు. కాని చరిత్ర అన్ని అక్రమాలనూ అందరి అక్రమాలనూ నమోదు చేస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు లెక్కలు తేలుస్తుంది. చరిత్ర కోసమైనా ఎప్పుడు ఎక్కడ ఏమి ఎట్లా జరిగిందో నమోదు చేయడం బుద్ధిజీవుల బాధ్యత.

ఒక భవనం, లేదా ఏడెనిమిది భవనాలు కట్టడమో కూల్చడమో పెద్ద సమస్య కాదు. కాని ప్రభుత్వం అటువంటి నిర్ణయం తీసుకున్నప్పుడు, ఆ నిర్ణయపు మంచి చెడుల చర్చ జరగాలి. ఆ పని అవసరమా కాదా అనే చర్చ జరగాలి. ఎంత ఖర్చవుతున్నది, ఎందుకు ఖర్చవుతున్నది అనే చర్చ జరగాలి. ఆ చర్చ బహిరంగంగా, పారదర్శకంగా చేయవలసిందీ, అంతిమ నిర్ణయం తీసుకోవలసిందీ ప్రజాస్వామిక పాలనలో ప్రజలు, ప్రజలు మాత్రమే. ఏ ఒక్క వ్యక్తికీ ఆ అధికారం లేదు. ప్రత్యేకించి ఆ పని చేయడానికి ఆ వ్యక్తి మూఢనమ్మకాలు మాత్రమే కారణమైనప్పుడు, అది రాచరిక, భూస్వామ్య పాలన అవుతుంది తప్ప, ఆధునిక ప్రజాస్వామిక పాలన కాజాలదు.

ప్రజాస్వామిక పాలనలో ఏ నిర్ణయమైనా, ఏ చర్య అయినా మొట్టమొదట దాని అవసరం ఏమిటి, అది అనివార్యమైనదా, ప్రత్యామ్నాయమైన మరొక నిర్ణయం, మరొక చర్యకు అవకాశం లేదా అనే ప్రశ్నలకు నిస్సందేహమైన, సకారణమైన, సర్వజనామోదమైనజవాబులు చెప్పుకోవాలి. ఈ సెక్రటేరియట్ కూల్చివేత నిర్ణయంలో కూల్చివేత అవసరం ఏమీ లేదు. ఉన్న ఎనిమిది భవనాలలో బహుశా 132 సంవత్సరాల వయసు ఉన్న భవనం ఒకటి నిరుపయోగకరంగా మారి ఉండవచ్చు. దాన్ని కూడ మరమ్మతులు చేసి ఉపయోగపెట్టుకోవచ్చు. లేదా చారిత్రక సంపదగా పరిరక్షించి ఉండవచ్చు. మిగిలిన భవనాల్లో ఎనిమిదేళ్ల భవనాలు రెండున్నాయి. కొన్ని దశాబ్దాల వయసున్న భవనాలు కొన్ని ఉన్నాయి. వాటిలో ఏ ఒక్కదాన్నీ కూల్చవలసిన అవసరం లేదు. సెక్రటేరియట్ కూల్చివేత అని మాటవరుసకు అంటున్నాం గాని, సెక్రటేరియట్ ను మొత్తంగా ఒకటిగా పరిగణించడానికి వీలులేదు. ఆ ప్రాంగణంలో1888లో నిర్మించిన ఒక భవనం నుంచి 2012లో నిర్మించిన రెండు భవనాల వరకు వేరు వేరు కాలాల్లో, ఆయా కాలపు అవసరాల కోసం నిర్మించిన ఎనిమిది భవనాలున్నాయి. వాటిలో కనీసం ఆరు భవనాలకు ఇంకా ముప్పై నుంచి అరవై సంవత్సరాల పాటు ఉపయోగకరంగా ఉండే సామర్థ్యం ఉంది.

ఇవాళ రెండు రాష్ట్రాలుగా మారిన మొత్తం ప్రాంతానికీ అవసరమైన పాలనా సేవలను 2014 జూన్ 2 వరకూ ఈ ఎనిమిది భవనాలే అందించాయి. వాటిలో దాదాపు సగభాగాన్ని ఆక్రమించి ఉండిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం2024 దాకా ఆ భవనాలను వాడుకునే చట్టబద్ధ హక్కు ఉన్నప్పటికీ కొద్ది కాలం కిందనే ఖాళీ చేసి వెళ్లిపోయింది. అంటే ఒక ఏడాదికి పైగా తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వానికి అవసరమైనదానికన్న ఎక్కువ స్థలమే అందుబాటులోకి వచ్చింది.

ఆ భవనాలలో కొన్ని శిథిలం అయ్యే స్థితిలో ఉన్న మాట నిజమే. వాటిని మరమ్మత్తు చేయడమో, వాటిని కూల్చి ఆ స్థానంలో కొత్తవి కట్టడమో అవసరమే కావచ్చు. కాని ఎనిమిది సంవత్సరాల కింద కట్టిన భవనాలతో సహా సమస్త భవనాలనూ కూలగొట్టవలసిన అవసరమేమిటి అనే ప్రశ్నకు ఇప్పటివరకూ సంతృప్తికరమైన జవాబు లేదు. బుకాయింపులు, దబాయింపులు మాత్రమే ఉన్నాయి.

రెండో ప్రశ్న ఆ నిర్ణయం మంచిదైనా కాకపోయినా, పద్ధతి ప్రకారం జరిగిందా లేదా అనేది. కొత్త భవన నిర్మాణ అవసరం లేకపోయినా ఆ నిర్ణయం తీసుకున్నారని విమర్శకులు అనవచ్చు, అవసరం కొద్దీ మాత్రమే ఈ నిర్ణయం తీసుకున్నామని ప్రభుత్వం అనవచ్చు. ఈ పరస్పర భిన్నాభిప్రాయాల మధ్య వాస్తవం తేలవలసిందిఆ నిర్ణయపు హేతుబద్ధత, అనివార్యత, బహిరంగ చర్చ ఆధారంగా మాత్రమే. ప్రభుత్వం తన నిర్ణయం వెనుక ఉన్న హేతుబద్ధతనూ అనివార్యతనూ ప్రజలతో

పారదర్శకంగాపంచుకోవలసి ఉంటుంది. ఆ నిర్ణయం తీసుకోవడానికి పాటించవలసిన ఆమోదయోగ్యమైన, గతం నుంచి వారసత్వంగా వస్తున్న పద్ధతిలోనే ఆ నిర్ణయం తీసుకోవలసి ఉంటుంది. ఆ నిర్ణయానికి ప్రజామోదం పొందవలసి ఉంటుంది. కాని తెలంగాణ ప్రభుత్వం ఆ పద్ధతులలో ఏ ఒక్కదాన్నీ పాటించలేదు.

2014 జూన్ 2న అధికారానికి వచ్చిన ఈ ప్రభుత్వం ఏడు నెలల్లోనే 2015 జనవరి 31న సెక్రటేరియట్ ను మార్చాలని, ఆ భవనాలను కూల్చాలని నిర్ణయం తీసుకుంది. కారణమేమిటో ప్రకటించలేదు గాని ముఖ్యమంత్రి కె చంద్రశేఖరరావుకు ఉన్న వాస్తు నమ్మకాలే అందుకు కారణమని అప్పుడే ఊహాగానాలు వెలువడ్డాయి. ఆ తర్వాత ఆయన సెక్రటేరియట్ ముఖం చూడకపోవడం ఆ ఊహాగానాలు బలపడడానికి దారితీసింది.

ఆ మొదటి నిర్ణయాన్ని సవాల్ చేస్తూ హైకోర్టులో దాఖలైన ప్రజా ప్రయోజన వ్యాజ్యాల మీద విచారణ జరుగుతుండగానే, 2019 జూన్ 18న రాష్ట్ర మంత్రివర్గం అదే నిర్ణయం మరొకసారి తీసుకుంది. 2015 నిర్ణయం మీద దాఖలైన మూడు ప్రజా ప్రయోజన వ్యాజ్యాలకు తోడు, కొత్త నిర్ణయం మీద మరొక రెండు ప్రజా ప్రయోజన వ్యాజ్యాలు దాఖలయ్యాయి.

మొదటి మంత్రివర్గ నిర్ణయానికీ, రెండో మంత్రివర్గ నిర్ణయానికీ మధ్య నాలుగున్నర సంవత్సరాల ఎడం ఉన్నప్పటికీ, మొదటి నిర్ణయం మీద అప్పటికే కోర్టు విచారణ జరుగుతున్నప్పటికీ, ఈ రెండు నిర్ణయాలూ కూడ వ్యవస్థీకృత పద్ధతి ప్రకారం జరగలేదు. ఆ నిర్ణయం తీసుకోవడానికి ఏ కారణాలు దారి తీశాయో, ఏ సమాచారం ఆధారంగా, ఏ నివేదికల ఆధారంగా, ఏ సిఫారసుల ఆధారంగా ఆ నిర్ణయం తీసుకున్నారో చర్చ జరగలేదు. చర్చ జరిగినట్టు మంత్రివర్గపు మినిట్స్ లో నమోదు లేదు. అసలు చర్చ జరిగిందో లేదో తెలియదు. రెండో నిర్ణయం జరిగిన తర్వాత రెండు నెలలకు మాత్రం ఆ నిర్ణయాన్ని సమర్థించే ఒక సాంకేతిక నిపుణుల కమిటీ సిఫారసులను, ఒక మంత్రివర్గ ఉపసంఘం సిఫారసులను తయారు చేశారు. అంటే హేతుబద్ధమైన, పారదర్శకమైన కారణాల ఆధారంగా నిర్ణయం జరగవలసి ఉండగా, నిర్ణయం జరిగిపోయిన తర్వాత కారణాలను వెతకడం మొదలు పెట్టారన్నమాట. గుర్రాన్ని బండి వెనుక కట్టారన్న మాట. అది కూడ హైకోర్టు విచారణలో వాదనల కోసమే ఈ నివేదికల తతంగం మొదలైందని స్పష్టంగా కనబడుతున్నది.

ఈ క్రమంలో ఉన్న సెక్రటేరియట్ లో లోపాల గురించి ఉన్నవీ లేనివీ నివేదికలు తయారు చేయించారు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఆ భవనాల నిర్మాణంలో భవన నిర్మాణ సెట్ ఆఫ్ (చుట్టూ చట్టబద్ధంగా ఉంచవలసిన ఖాళీలు) నిబంధనలు పాటించలేదని ఆ నివేదికలు చెప్పాయని కోర్టు ముందర వాదించారు. అసలు ప్రభుత్వమే తాను నిర్మించిన భవనంలో తన నిబంధనలను పాటించలేదని, ఇప్పుడు ప్రభుత్వమే కోర్టు ముందర చెప్పింది. సెట్ ఆఫ్ నిబంధనలు పాటించకపోవడం తప్పనిసరిగా చట్ట ఉల్లంఘనే, నేరమే. అయితే ఆ నేరానికి పరిష్కారంగాసాధారణంగా ఆ మేరకు కూల్చివేతలు జరుగుతాయి. లేదా జరిమానా వసూలు చేస్తారు. కాని సెట్ ఆఫ్ నిబంధనలు పాటించలేదనే కారణంతో మొత్తంగా భవనాలను కూలగొట్టడం ఎక్కడా జరగదు. రాష్ట్రంలో సెట్ ఆఫ్ నిబంధనలు పాటించని భవనాలు లక్షల సంఖ్యలో ఉన్నాయి. ఆ లక్షలాది భవనాలను కూడ ప్రభుత్వం నేలమట్టం చేయడానికి సిద్ధంగా ఉందా?

ఈ నిర్ణయం పాలనకు సంబంధించినదైనప్పుడు, దాని ఆర్థిక పర్యవసానాలు ఏమిటనేది మరొక ప్రశ్న. ఉపయోగకరంగా ఉన్న భవనాలను అవసరం లేకుండానే కూల్చడం, కొత్త భవనాలు నిర్మించడం ప్రజా సంపదకు, రాష్ట్ర ఖజానాకు ఎంత భారంగా మారనున్నదో, ఆ వ్యయం హేతుబద్ధత ఏమిటో కూడ ప్రభుత్వం ప్రజలకు వివరంగా చెప్పవలసి ఉంటుంది. కొత్త భవనాల నిర్మాణానికి ఐదు వందల కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని ఒక అంచనా వినబడుతున్నది. ప్రపంచంలో ఎక్కడా లేని నమూనా, అద్భుతమైన నమూనా అని వందిమాగధుల స్తోత్రాలతో అతి మామూలు నమూనా చిత్రాన్ని ఒకదాన్ని ప్రచారంలో పెట్టారు. ఆ కొత్త భవనంలో ఏమేమి ఉండబోతున్నాయో టక్కు టమార గజ కర్ణ గోకర్ణ విద్యలతో ప్రచారం చేస్తున్నారు. ఈ ప్రచారమంతా ఆ భవన నిర్మాణ వ్యయాన్ని ఇబ్బడి ముబ్బడిగా పెంచడానికి జరుగుతున్న కుటిల యత్నం. అసలు ప్రస్తుతం చెపుతున్న నిర్మాణ వ్యయం ఐదు వందల కోట్ల రూపాయల అంకె ఎలా వచ్చిందో ఎవరికీ తెలియదు. ఆ నిర్మాణ వ్యయానికైనా కట్టుబడి ఉంటారో లేదో ఎవరికీ తెలియదు. ముప్పై ఎనిమిది వేల కోట్ల రూపాయల వ్యయాన్ని రాత్రికి రాత్రి ఎనభై వేల కోట్ల రూపాయలకు, అక్కడి నుంచి ఒక లక్షా ముప్పై వేల కోట్ల రూపాయలకు పెంచిన ఘనచరిత్ర ఉన్న ప్రభుత్వమిది.

ప్రభుత్వ పథకాల వ్యయానికి ఇంజనీరింగ్ నిర్మాణ లెక్కలూ,సాధారణంగా అనుసరించే లెక్కలూ ఏమీ పాటించకపోవడమే తెలంగాణ ప్రభుత్వం సాధించిన ఘన విజయం. కాంట్రాక్టర్ల కోసమే నిర్మాణాలూ, వారి కోసమే ఇబ్బడి ముబ్బడిగా నిర్మాణ వ్యయ అంచనాల పెంపులూ, అందులో రాజకీయ నాయకత్వ వాటాలూ ముడుపులూ మాత్రమే ప్రస్తుతం రాష్ట్రంలో ప్రజాధన గణాంకాలను నిర్ణయిస్తున్నాయి. కనుక అనవసరమైనఈ కొత్త సెక్రటేరియట్ నిర్మాణం ఎప్పటికి పూర్తవుతుందో, ఆ ఐరావతం పూర్తయ్యే నాటికి తెలంగాణ ప్రజల మీద ఎంత భారంగా మారుతుందో భవిష్యత్తే చెప్పాలి.

ఈ వ్యవహారంలో ప్రజా ప్రయోజన వ్యాజ్యాలలో న్యాయస్థానం తీసుకున్న వైఖరి మరింత అన్యాయంగా ఉన్నది. ఐదు ప్రజా ప్రయోజన వ్యాజ్యాలు ఏడు కీలక అంశాలను లేవనెత్తాయి. ప్రభుత్వ నిర్ణయం చట్ట రీత్యానైనా, పాలనా పద్ధతుల రీత్యానైనా, ప్రభుత్వానికి ఉండవలసిన పారదర్శక విధానాల రీత్యానైనా, పాలకుల నిర్ణయానికి ప్రజలు చెల్లించవలసి వస్తున్న మూల్యం రీత్యానైనా అన్యాయమైనదని, అనవసరమైనదని, అనుచితమైనదని, అక్రమమైనదని న్యాయవాదులు వాదించారు. విచారణ జరుగుతున్న కాలంలో ఈ అనౌచిత్యాన్ని సరిగానే గుర్తించిన, కొన్నిసార్లు తీవ్రమైన ప్రభుత్వ వ్యతిరేక వ్యాఖ్యలు కూడ చేసిన న్యాయస్థానం ఆశ్చర్యకరంగా చివరికి వచ్చేసరికి ఆమోదించడానికి వీలులేని తీర్పు ప్రకటించింది.

రాజనీతి శాస్త్ర చరిత్రలో, ఆధునిక రాజ్య పరిణామంలో అధికారాల విభజన అనేది కీలక సూత్రం. రాజ్యంలో మూడు భాగాలైన చట్టసభ, అధికార వ్యవస్థ, న్యాయవ్యవస్థల మధ్య అధికారాల విభజన ఎలా జరిగిందో, ఏ వ్యవస్థ అధికారాలకు ఎన్ని పరిమితులు, ఎన్ని అవకాశాలు ఉంటాయో రాజనీతి శాస్త్రంలో చాల చర్చ జరిగింది. ఆ చర్చలో నికరంగా తేలిన అంశం న్యాయవ్యవస్థ స్వతంత్రంగా ఉండాలనీ, చట్టసభల, అధికార్యవ్యవస్థల నిర్ణయాలను సమీక్షించే అధికారం న్యాయవ్యవస్థకు ఉండాలనీ. అది కూడ నిరంకుశ అధికారమేమీ కాదు. దానికి కూడ పరిమితులు, ఆంక్షలు ఉన్నాయి. కాని ఇటీవల న్యాయవ్యవస్థ తన స్వాతంత్ర్యాన్ని కోల్పోతూ తన అధికారాన్ని తానే కత్తిరించుకుంటున్నది. రాజకీయ, అధికార యంత్రాంగాలకు అనుకూలమైన తీర్పులు ఇస్తూ తన సమీక్షాధికారాన్ని తానే వదులుకుంటున్నది. ఆ క్రమంలో కొన్ని ఆమోదించడానికి వీలులేని తీర్పులు వచ్చాయి. చట్టసభలు, అధికార

# జగన్ పాలనలో దళితులపై దాడులు

***ప్రభుత్వాలు మారినా దళితులపై అగ్రకులాల అణచివేత, దాడులు ఆగలేదనీ, వైఎస్ఆర్‌సిపి ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక దళిత అధికారులు, ఉద్యోగులపై ఈ దాడులు మరింత తీవ్రమయ్యాయనీ అంటున్నారు* దుడ్డు ప్రభాకర్**

**ఆం**ధ్రప్రదేశ్‌లో జగన్మోహన్‌రెడ్డి అధికారంలోకి వచ్చిన తర్వాత ఈ పద్నాలుగు నెలల్లో రాష్ట్ర నలుమూలలా అట్టడుగు స్థాయి నిరుపేదలైన దళితుల మీదనే కాక దళిత అధికారులు, ఉద్యోగులపై కూడా దాడులు, అణచివేత, వేధింపులు అనేక రూపాలలో జరుగుతున్నాయి. కంచికచర్ల నుండి కారంచేడు, చుండూరు, వేంపెంట, లక్షింపేట దాకా జరిగిన సామూహిక హత్యాకాండలకు అందరు పాలకులు, రెవెన్యూ, పోలీసు, న్యాయ వ్యవస్థలు హంతక మూకలకు పరోక్షంగా సహకరించారు. చుండూరులో కొమ్మెర్ల అనిల్‌కుమార్‌ను నిరాహారదీక్ష శిబిరంలో కాల్చిచంపిన పోలీసులు 'శాంతిభద్రత'లను కాపాడే క్రమంలో ప్రాణ రక్షణ కోసం కాల్పులు జరపాల్సి వచ్చిందని కట్టుకథ అల్లారు. కానీ జగన్ పాలనలో దాడికి పాల్పడ్డ వారితో సహా పోలీసులు, రాజకీయ నాయకులు దళితులపై దాడుల్ని బహిరంగంగా సమర్థించుకుంటున్నారు. ఆ సమర్థించుకునే క్రమంలో బాధితులైన దళితులపై అనేక తప్పుడు ఆరోపణలకు పాల్పడుతున్నారు. అత్యంత ఆందోళనకరమైన విషయమేమంటే ఆ దాడుల్ని దళిత రాజకీయ నాయకులు, కొందరు స్వయం ప్రకటిత దళిత ఉద్యమకారులు, వివిధ రాజకీయ పార్టీలు పెంచి పోషించి ఉద్యమకారులుగా చెలామణీ అవుతున్నవారు బహిరంగంగా సమర్థించడమే కాకుండా జగన్మోహన్‌రెడ్డిని అభినవ అంబేద్కర్‌గా, అవతార పురుషుడిగా కీర్తిస్తున్నారు.

**చిన్నాభిన్నమైన దళితుల సామూహిక చైతన్యం**

కారంచేడు మారణకాండ సందర్భంగా అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు బాధితుల్ని పరామర్శించడానికి వస్తే కారంచేడు దళితులు 'మీ వియ్యంకుడి ఆధ్వర్యంలో మీ కులానికి చెందినవారు మా బిడ్డల్ని చెరిచారు. మా వాళ్లను ఆరుగుర్ని చంపారు. వాళ్లను అరెస్టు చేసిన తర్వాత మమ్మల్ని పరామర్శించడానికి రా' అని నిలేశారు. చుండూరు

---

వ్యవస్థలు, ప్రభుత్వాలు తీసుకునే విధాన నిర్ణయాలలో తాము జోక్యం చేసుకోలేమని, చేసుకోబోమని అంటూ ప్రభుత్వాల నిరంకుశ, నిర్హేతుక, ప్రజావ్యతిరేక విధానాలకు న్యాయస్థానాలు పచ్చజెండా ఊపుతున్నాయి. ఇప్పుడు ఈ ఉదంతంలో కూడ న్యాయస్థానం అటువంటి అన్యాయమైన, అచారిత్రకమైన, చట్టవ్యతిరేకమైన వైఖరి తీసుకుని ప్రభుత్వ అనుచిత నిర్ణయాన్ని సమర్థించింది.

'మంత్రివర్గ నిర్ణయం అంతిమం కాదు, మధ్యంతరమే, మూడు అంచెల నిర్ణయ ప్రక్రియలోఅది మొదటి దశ మాత్రమే' అని ప్రభుత్వ న్యాయవాది వాదనను కోర్టు అంగీకరించింది గాని, ఆ తీర్పు వెలువడిన కొద్ది రోజుల్లోనే ఆ నిర్ణయ ప్రక్రియలో మూడో దశ అయిన నిర్ణయం అమలు – కూల్చివేత హడావిడిగా ప్రారంభమయిందంటే కనీసం తీర్పులోచెప్పిన సమర్థనకైనా ప్రభుత్వం కట్టుబడలేదన్నమాట. ఆ కూల్చివేత రహస్యంగా సాగింది. కోర్టు తాత్కాలిక నిలిపివేత ఉత్తర్వులు ఇచ్చి ఆ తర్వాత ఉపసంహరించుకుంది. ప్రభుత్వం ఆగమేఘాల మీద కూల్చివేత పని చేసేసింది. ఇదంతా ఆంధ్ర వలసవాదుల చిహ్నాలను రద్దు చేసే కార్యక్రమం అని దొంగ సాకులతో సమర్థించుకుంటున్నారు. కాని తెలంగాణ ప్రభుత్వం నిండా నిండిపోయి ఉన్నవారు, తెలంగాణ ప్రభుత్వ కార్యక్రమాలతో వేల కోట్ల రూపాయల ప్రయోజనాలు పొందుతున్నవారు ఆ "వలసవాదులే" అయినప్పుడు ఆ మాట అమాయకుల భావోద్వేగాలు రెచ్చగొట్టడానికి మాత్రమే పనికి వస్తుంది గాని వాస్తవం కాదు.

మహానాయకుడి వాస్తు నమ్మకమే సెక్రటేరియట్ మార్పుకు కారణమనేది అందరికీ తెలిసిన బహిరంగ రహస్యం అయినప్పుడు, 'రాజ్యం మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పనిచేయాలి' అనే రాజ్యాంగ ఆదేశిక సూత్రానికి అది ఉల్లంఘన అవుతుంది. ఒక వ్యక్తికి, అధికారంలో ఉన్న వ్యక్తికి కూడ తన ఇష్టాయిష్టాలు, నమ్మకాలు, విశ్వాసాలు ఉండవచ్చు. కాని రాజ్యాంగ బద్ధంగా నిర్వహించవలసిన పాలనాధికారంలోకి ఆ సొంత నమ్మకాలను, విశ్వాసాలను తీసుకురాగూడదు. ఐదు సంవత్సరాల కోసం అధికారంలోకి వచ్చే ఒక వ్యక్తి తనకు ఉన్న వాస్తు, చేతబడి, బాణామతి, గ్రహచారం వంటి మూఢనమ్మకాలతో అధికార కార్యాలయాన్ని కూల్చాలని, కొత్త కార్యాలయం కట్టాలని నిర్ణయాలు తీసుకోవడం హాస్యాస్పదం, అభివృద్ధి నిరోధకం, నిరంకుశత్వం, ప్రజాధనం దుబారా.

వాస్తుకారణాల వల్ల తన అధికారిక భవనానికి రావడానికి కూడ ఇష్టపడని ముఖ్యమంత్రి అసలు ఆ భవనాలనే లేకుండా చేయడానికి ప్రయత్నించి సఫలం కావడం చరిత్రలో ఏ దేశంలోనైనా, ఏ కాలంలోనైనా జరిగిందో లేదో తెలియదు గాని ఘనమైన చరిత్ర కలిగిన తెలంగాణ ఆ చారిత్రక ఘనత కూడ సాధించింది. మంత్రివర్గమూ, ప్రజా ప్రతినిధులు అని చెప్పబడేవాళ్లూ, అధికారబృందమూ, ఉన్నత న్యాయస్థానమూ, ప్రచార సాధనాలూ కూడ ఆ మూఢత్వాన్ని వేరు వేరు కారణాల మీద సమర్థిస్తుండగా నాలుగు కోట్ల ప్రజలు మౌనసాక్షులుగా నిలబడ్డారు. కాలక్రమంలో ఆ ప్రజలే తాము పన్నులుగా చెల్లించిన సంపద లోంచి ఐదు వందల కోట్ల రూపాయలో, అంతకు రెట్టింపో, మూడు రెట్లో నాయకుడి మూఢవిశ్వాసానికి మూల్యంగా చెల్లించవలసి వస్తుంది. ధిక్కారమే జీవశ్వాసగా వందల సంవత్సరాలుగా నిలిచి ఉన్న తెలంగాణ అతి భయంకరమైన తప్పుడు నిరంకుశ నిర్ణయాలకు తలవంచిన సందర్భాలను కూడ చరిత్ర నమోదు చేస్తున్నది.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

బాధితుల్ని పరామర్శించడానికి వచ్చిన అప్పటి ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దనరెడ్డి కాన్వాయ్‌పై పేడనీళ్లు చల్లారు. ఆయన ప్రకటించిన నష్ట పరిహారాన్ని తిరస్కరించారు. దళితుల డిమాండ్ మేరకు హంతకుల ఆస్తులు జప్తు చేసి నష్టపరిహారం చెల్లిస్తామని మీడియా సమావేశంలో ప్రకటించాల్సిన పరిస్థితికి నేదురుమల్లి జనార్దనరెడ్డి నెట్టివేయబడ్డాడు. (ఆ డిమాండ్ నెరవేరలేదు.) చుండూరు ఉద్యమంలో భాగంగా వివిధ రాజకీయ పార్టీలలో ఉన్న దళిత ఎంఎల్‌ఏలు, ఎంపిలు వారి వారి పదవులకు రాజీనామాలు చేయాలని డిమాండ్ చేశారు. వారి పేర్లతో ప్లకార్డులు రాసి గాడిదల మెడలో వేసి ఊరేగించారు. వేంపెంట మారణహోమం సందర్భంగా అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు బాధితుల్ని పరామర్శించలేదు సరికదా.. తమ గోడు వెళ్లబోసుకుందామని హైదరాబాద్ వస్తే కలవడానికి కూడా ఇష్టపడలేదు. అయితే ఆయా కాలాలలో దళిత రాజకీయ నాయకులతో కలవడం, కలిసి తిరగడం దళిత నాయకులు అవమానంగా భావించేవారు. బాబా సాహెబ్ అంబేద్కర్ జయంతి, వర్ధంతి సభలకు వేదికలెక్కనిచ్చే వారు కాదు. అంబేద్కర్ విగ్రహానికి పూలదండలు వేస్తే తర్వాత వాటిని తీసివేసి ఆ విగ్రహాన్ని పాలతో శుద్ధి చేసేవారు. క్రమంగా పరిస్థితులు మారాయి. నూతన ఆర్థిక విధానాలు సృష్టించిన సంక్షోభం, మార్కెట్ మాయాజాలంలో మానవ సంబంధాలు ధ్వంసమై మార్కెట్ సంబంధాలు ప్రధానమయ్యాయి.

దళిత మేధావులు, ఉద్యోగులు, ఉద్యమకారులు వారి స్వార్థ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాల కోసం పీడకులైన అగ్రకుల పాలకుల్ని బహిరంగంగా సమర్థిస్తున్నారు. ఈ నేపథ్యంలో జగన్మోహన్‌రెడ్డి ప్రభుత్వం ఆదేశాలను, ఆజ్ఞలను శిరసావహించని నిజాయితీపరులైన దళిత అధికారులపై, ఉద్యోగులపై దాడులకు తెగబడుతుంది. ఎవరైతే పాలకుల అక్రమాలను ప్రశ్నిస్తారో వారిపై గ్రామ, మండలస్థాయి వైఎస్ఆర్‌సిపి నాయకుల వేధింపులు జరుగుతున్నాయి. నిందితులకు ఎంఎల్‌ఎలు, మంత్రులు, పోలీసు అధికారులు బహిరంగంగానే మద్దతు తెలుపుతున్నారు.

### దళితులపై వివక్ష దాడులు

తెలుగుదేశం పాలనలో తీవ్రమైన అవమానాలు, అణచివేతలకు గురైన దళితులకు ప్రత్యామ్నాయంగా జగన్మోహన్‌రెడ్డి కనిపించారు. 2019 సాధారణ ఎన్నికల్లో వైఎస్ఆర్‌సిపి అధికారంలోకి రావడానికి దళితులు ప్రధాన కారణం. అగ్రకుల పాలక పార్టీలు దళితులకు మేలు చేస్తాయనే భ్రమలు ఎవ్వరికి లేవు. కాని ప్రత్యామ్నాయం లేక 'అతనికంటే ఘనుడు ఆచంట మల్లన్న' అని తెలిసినప్పటికీ జగన్‌ను నమ్మడం దళితులకు అనివార్యమైంది. ఏ పార్టీ అధికారంలో ఉంటే ఆ కులాధిపత్యం, అణచివేత, దోపిడీ, వివక్షకు మొదటగా బలయ్యేది నిరుపేద వ్యవసాయ కూలీలైన దళితులే. అందుకే దళితులు ఆధిపత్య, అధికార కులాలను ప్రశ్నించే స్థితికి నెట్టబడుతున్నారు. అది సహించలేని ఆధిపత్య కులాలు అధికారమదంతో దళితులపై దాడులకు తెగబడుతున్నారు. అయితే జగన్ పాలనలో ప్రభుత్వాంగాలు కూడా ప్రత్యక్ష భాగస్వాములౌతున్నాయి. ఈ పరిణామం ప్రజాస్వామిక వాదులను ఆందోళనకు గురిచేస్తుంది.

ఇటీవల రాష్ట్రవ్యాప్తంగా దళిత, మైనారిటీలపై, బిసిలపై, మహిళలపై జరుగుతున్న దాడులకు రాజకీయ కారణాలున్నాయి. ప్రభుత్వమే జీతాలు ఇచ్చి వాలంటీర్ల వ్యవస్థను పోషిస్తుంది. దాని ద్వారా వైఎస్ఆర్‌సిపి పునాదుల్ని బలోపేతం చేసుకుంటున్న సందర్భంలో రాజకీయ విద్వేషాలు పల్లెల్ని మరింతగా కలుషితం చేస్తున్నాయి. అధికారముందని వైసిపి శ్రేణులు రెచ్చిపోతున్నారు. గ్రామ వాలంటీర్ దగ్గర నుండి జిల్లాస్థాయి నాయకుల వరకు ఎలాంటి అఘాయిత్యాలకు పాల్పడ్డా రెవెన్యూ, పోలీస్ సిబ్బంది ప్రేక్షకపాత్ర వహిస్తున్నారు. మరికొన్ని చోట్ల సహాయ సహకారాలందిస్తున్నారు. బాధితులు స్టేషన్‌లో రిపోర్ట్ చేస్తే పట్టించుకునే దిక్కులేదు. దళితులు మాత్రమే కాదు, వైసిపి యేతర పార్టీ నాయకులు, కార్యకర్తలు, ప్రజలు స్టేషన్‌లో రిపోర్ట్ చేసినా ప్రయోజనం లేదని మౌనంగా భరిస్తూ భయం భయంగా కాలం గడుపుతున్నారు. ప్రత్యర్థులను ఎంతగా భయపెట్టగలిగితే పార్టీ అంతగా బలపడుతుందనే అంచనాలో జగన్ ఉన్నట్టుంది.

దళితులు సామూహిక అత్యాచారాలకు, హత్యలకు బలైనప్పుడు మాత్రమే మీడియా ద్వారా బయటి ప్రపంచానికి తెలుస్తున్నాయి. రాజమండ్రి సీతానగరం పోలీస్‌స్టేషన్‌లో స్థానిక వైసిపి నాయకుడి ఆదేశానుసారం దళిత యువకుడ్ని స్టేషన్‌లో నిర్బంధించి తీవ్ర చిత్రహింసలు పెట్టి, మీసాలు తీసి, గుండు చేశారు. చీరాలలో మాస్క్ పెట్టుకోలేదని ఇద్దరు యువకుల్ని పోలీసులు కొట్టారు. తీవ్రమైన గాయాలతో ఆసుపత్రిలో చేరిన కిరణ్ అనే యువకుడు మూడువరోజు మరణించాడు. రాజమండ్రిలోని రాజానగరంలో మైనర్ దళిత బాలికను పది మంది మృగాళ్లు మత్తుమందు ఇచ్చి అత్యాచారం చేసి, పోలీస్ స్టేషన్ ఎదుట వదిలి వెళ్లిపోయారు. దళితులను ఏం చేసినా పోలీసులు పట్టించుకోరనే అభిప్రాయం ప్రజల్లో ఉండబట్టే ఆ రేపిస్టులు ధైర్యంగా పోలీస్ స్టేషన్ ముందు వదిలేశారు.

### దళిత ఉద్యోగులపై దాడులు

రాష్ట్రంలో గతంలో ఎన్నడూ జరగని విధంగా దళిత ఉద్యోగులు వేధింపులకు, అవమానాలకు గురౌతున్నారు. విశాఖ జిల్లా నర్సీపట్నం ప్రాంతీయ వైద్యశాల అనెస్థీషియా డా. సుధాకర్ తనతో పాటు ఆసుపత్రి సిబ్బందికి మాస్క్‌లు, పిపిఇ కిట్‌లు లేవని ఉన్నతాధికారులకు తెలియజేసినా ఉపయోగం లేకపోయేసరికి సోషల్ మీడియా ద్వారా ప్రభుత్వం దృష్టికి తెచ్చారు. ఒక ప్రభుత్వోద్యోగివై ఉండి ప్రభుత్వంపై విమర్శలు చేస్తావా? అంటూ ఉద్యోగం నుండి తీసివేయడమే కాకుండా నర్సీపట్నం పోలీసు స్టేషన్‌లో కేసు కూడా ఫైల్ చేశారు. నలభై రోజుల తర్వాత విశాఖపట్నం హైవే మీద ప్రత్యక్షమయ్యాడు. జగన్మోహన్‌రెడ్డిని దుర్భాషలాడాడని, ట్రాఫిక్‌కు అంతరాయం కలిగిస్తున్నాడని పోలీసులు సుధాకర్‌ను తీసుకెళ్లారు. తర్వాత కెజిఎచ్ ఆసుపత్రిలో చేర్చారు. అతన్ని పిచ్చివాడిగా నిర్ధారించిన డాక్టర్లు విశాఖ పిచ్చాసుపత్రిలో చేర్చారు. హైకోర్టు జోక్యంతో పిచ్చాసుపత్రి నుండి ప్రాణాలతో బయటపడ్డాడు.

సుధాకర్ సంఘటనపై హైకోర్టు స్పందించి సిబిఐ విచారణకు ఆదేశించింది. అయితే ఇటీవల సుధాకర్ మీడియా ముందుకొచ్చి 'ముఖ్యమంత్రి దేవుడి లాంటోడు. నన్ను మన్నించి నా ఉద్యోగం నాకు ఇప్పించాల'ని వేడుకున్నాడు. సుధాకర్ మాస్క్ అడిగినందుకు ఉద్యోగం ఊడబీకి, కేసుపెట్టి, కొట్టి, పిచ్చివాడ్ని చేసి, లొంగదీసుకొని, చివరకు ప్రాధేయపడేటట్లు చేసుకున్న జగన్ ప్రభుత్వం మాస్క్ పెట్టుకోనందుకు కిరణ్‌ను కొట్టి చంపింది.

చిత్తూరు జిల్లా వెనుమలూరు ప్రాంతీయ ప్రభుత్వ వైద్యశాల దళిత

డా. అనితారాణి తనను స్థానిక వైసిపి నాయకులు వేధిస్తున్నారని, బాత్‌రూం కెళ్లినప్పుడు ఫోటోలు తీశారని పై అధికారులకు ఫిర్యాదు చేసింది. వాళ్లు పట్టించుకోకపోయేసరికి వాయిస్ రికార్డు చేసి సోషల్ మీడియాలో అప్‌లోడ్ చేసింది. అప్పుడు స్పందించిన పోలీస్ అధికారులు, వైద్య శాఖాధికారులు ఆమె అవినీతిపరురాలుగాను, మానసిక పరిస్థితి సరిగాలేదని నిర్ధారించి ఉద్యోగం నుండి తొలగించారు. దేశం, ప్రపంచమంతా డాక్టర్ల సేవలను కొనియాడుతున్న 'కోవిడ్-19' కాలంలో ఈ రాష్ట్రంలోని దళిత డాక్టర్లు అవమానకరమైన రీతిలో పిచ్చివాళ్లుగా చిత్రీకరించబడి ఉద్యోగాల నుండి సస్పెండ్ చేయబడ్డారు. అదీ రాజన్న రాజ్యంలో జగనన్న పాలనతీరు.

చిత్తూరు జిల్లాకు చెందిన దళిత యువ జడ్జి రామకృష్ణ కడప జిల్లాలో జడ్జిగా పని చేస్తున్నప్పుడు అప్పటి హైకోర్టు జడ్జి నాగార్జునరెడ్డి బంధువులకు అనుకూలంగా తాను రికార్డ్ చేసిన మరణ వాంగ్మూలాన్ని మార్చలేదని సస్పెన్షన్‌కు గురయ్యాడు. ఆ సస్పెన్షన్‌ను సవాల్ చేస్తూ ఆయన రెండు సంవత్సరాలకు పైగా న్యాయపోరాటం చేశాడు. సుప్రీంకోర్టు, చివరకు పార్లమెంట్‌లో కూడా చర్చయ్యింది. అన్ని చోట్ల రామకృష్ణకు చుక్కెదురయ్యింది. ప్రస్తుతం చిత్తూరు జిల్లాలోని ఆయన స్వగ్రామంలో ఉంటున్నాడు. ఇటీవల ఆయనపై ఇంటి దగ్గర దాడి జరిగింది. నాగార్జునరెడ్డి బంధువైన మంత్రి పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి అనుచరులు తమపై దాడి చేశారని, స్టేషన్‌లో ఎస్ఐ కేసు నమోదు చేయలేదని పెద్దిరెడ్డి ఫోన్ చేసినందువల్లనే పోలీసులు కేసు రిజిష్టర్ చేయలేదని రామకృష్ణ ఆరోపణ. అందుకు పోలీసు అధికారులు స్పందించి రామకృష్ణను కౌంటర్ చేస్తూ ప్రెస్‌మీట్ పెట్టారు. ఆ మరుసటి రోజు పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డి ప్రెస్‌మీట్ పెట్టి డా. సుధాకర్‌ని, డా. అనితారాణిని, రామకృష్ణను వాడు, వీడు అని సంబోధిస్తూ అవమానకరంగా మాట్లాడారు. ఇటీవల పది రోజుల క్రితం నెల్లూరు జిల్లా ఉదయగిరి నియోజకవర్గంలోని వరికుంటపాడు ఎంఆర్ఓ శ్రీనివాసులు తనకనుకూలంగా రికార్డులు మార్చలేదని వైసిపి శ్రేణులు ఆఫీసులోనే ఆయనపై దాడికి సిద్ధపడ్డారు. కులం పేరుతో దూషించి ఫైళ్లన్నీ చిందరవందర చేశారు.

### సంక్షేమ కార్యక్రమాల రద్దు

గత ప్రభుత్వాలు ఎస్‌సి కార్పొరేషన్ ద్వారా 60 శాతం సబ్సిడీతో స్వయం ఉపాధి పథకం కింద ఏటా నాలుగు వందల కోట్ల రూపాయలు ఎస్‌సిల సంక్షేమానికి కేటాయించారు. ఇప్పుడు జగన్ ప్రభుత్వం ఆ పథకాన్ని రద్దు చేసింది. ఎస్‌సి, ఎస్‌టి విద్యార్థుల విదేశీ చదువుల కోసం అందే ఆర్థిక సహాయాన్ని నిలిపివేసింది. భూమి కొనుగోలు పథకాన్ని రద్దు చేశారు. దళితుల పొలాల్లో బోర్లు, విద్యుత్ సౌకర్యం, పంపుసెట్లు సరఫరాకు నిధుల కేటాయింపులు లేవు. సంక్షేమ హాస్టళ్ల రద్దు, ఉన్నత విద్య, ఉద్యోగావకాశాల కోసం ఏర్పాటు చేసిన శిక్షణా కేంద్రాలు మూతపడ్డాయి. ఎస్‌సి, ఎస్‌టి వాడల అభివృద్ధికి నిర్దేశించబడిన సబ్ ప్లాన్ నిధులకు బ్రేక్ ఇచ్చారు. మొత్తంగా దళితుల స్వయం ఉపాధికి ఉపయోగపడే పథకాలన్నీ రద్దుచేసి జగనన్న ఇచ్చే కానుకల మీద ఆధారపడేలా దళితుల్ని బిచ్చగాళ్లుగా మార్చారు.

### వ్యూహాలు మార్చుకొంటున్న అగ్రకులాల పాలకులు

రాష్ట్రంలో ఏ కులం అధికారంలో ఉంటే ఆ కులానికి సంబంధించిన ఉన్మాదులు రెచ్చిపోతూ, దాడులకు పాల్పడుతూ ఆధిపత్యం చెలాయిస్తారనేది గత చరిత్ర. నాడు అధికారంలో ఉండి దాడులకు పాల్పడితే, నేడు అధికారం కోసం దళితులపై సామూహిక హత్యాకాండలకు తెగబడుతున్నారు. మైనారిటీ సమూహాలపై మెజారిటీ మందను ఉసిగొల్పి దాడి చేయించి, ఆ దాడికి బహిరంగ మద్దతు తెలియజేయడం ద్వారా మెజారిటీ ఓటు బ్యాంకును కొల్లగొట్టి అధికారం చేజిక్కించుకునే ఫార్ములాను ఒక రాజకీయ విధానంగా బిజెపి ఈ దేశ రాజకీయాలలో ప్రవేశపెట్టి విజయం సాధించింది. ఆ ఫార్ములాను ఇపుడు అన్ని రాజకీయ పార్టీలూ అమలు చేస్తున్నాయి. అందులో భాగంగానే మెజారిటీ ఊరు ఓట్లు కొల్లగొట్టాలంటే కుల అసమానతలను ప్రోత్సహించాలి. కులవైషమ్యాలను రెచ్చగొట్టాలి. ఊరును ఐక్యం చెయ్యాలి, వాడను ఒంటరి చెయ్యాలి. ఇది నేటి అగ్రకుల రాజకీయ పార్టీల వైఖరి. కులమత మారణహోమాలు సృష్టించి ఓట్లు దండుకొని అధికారం చేపట్టడమనే సులువైన మార్గాన్ని ఎన్నుకున్న కారణంగానే దళితులపై, ముస్లింలపై, క్రైస్తవులపై దాడులు రోజురోజుకూ తీవ్రమౌతున్నాయి.

### మన కర్తవ్యం ఏమిటి?

మనీ, మీడియా, మాఫియా సమృద్ధిగా ఉన్న అగ్రకుల భూస్వామ్య వర్గాలు రాజ్యాధికార సాధన కోసం కుల, మత ఘర్షణలు సృష్టిస్తూ పీడిత ప్రజల్ని విడగొట్టి పాలిస్తున్నారు. ఈ నేపథ్యంలో పీడిత కులాల క్షేమం, అభివృద్ధి కోరుకునే ఎవ్వరైనా దళిత, బహుజనుల ఐక్యత కోసం కృషి చెయ్యాలి. కానీ, అందుకు భిన్నంగా 'దళిత బహుజనులకు రాజ్యాధికారం' నినాదంతో కాలం గడుపుతున్నారు. ఈ దేశంలో తరతరాలుగా పిడికెడు ఆత్మగౌరవం కోసం, మనిషిగా గుర్తింపు కోసం జరుగుతున్న పెనుగులాటలో లక్షలాది మంది దళితులు ప్రాణాలు కోల్పోతున్నారు. ఎక్కడ పోగొట్టుకున్నామో అక్కడే వెతుక్కోవాలనేది పెద్దల స్ఫూర్తి. ఈ సందర్భంగా ఖురాన్‌లోని ఒక నీతి కథ గుర్తుకొస్తుంది.

'ఒక యువకుడు కారు తాళాలు పోగొట్టుకొని పచ్చికలో వెతుకుతూ ఉంటాడు. పక్కనే ఇది గమనిస్తున్న పెద్దమనిషి 'ఏంటి బాబు చాలాసేపటి నుండి వెతుకుతున్నావు' అంటాడు. కారు తాళాలు పోతే వెతుకుతున్నానండీ అని ఆ యువకుడు సమాధానంతో ఆ పెద్ద మనిషి కూడా కొంతసేపు వెతికి 'బాబూ ఇంతకూ నీ తాళాలు ఎక్కడ పోగొట్టుకున్నావ్' అని అడుగుతాడు. అదిగో, ఆ చీకటిగా ఉన్న ప్రాంతంలో పోయాయండీ అంటాడు. పెద్దమనిషి విస్తుపోయి మరి ఇక్కడ ఎందుకు వెతుకుతున్నావ్ అంటే, అక్కడ చీకటిగా ఉంది కదండి అని యువకుడి సమాధానం.

అలా ఉంది దళిత బహుజన మేధావులు, నాయకుల తీరు. చీకటిని పారదోలే చిరుదివ్వెనైనా వెలిగించి పార్లమెంట్‌లోకి ప్రవేశించి 'కీ' వెతుక్కోవాలి గాని, దీపం వెలిగించడానికి బద్ధకించే, వెలుగుపై ఉబలాటమో తెలియదు కాని నాయకుల ఈ ధోరణి వల్ల దళితులకు దూరమయ్యారు. అగ్రకుల పాలక పార్టీలకు దగ్గరయ్యారు. ఇటీవల దళిత ఉద్యోగులపై, అధికారులపై జరుగుతున్న దాడులు దళిత ఆత్మగౌరవ ప్రతిఘటనా పోరాటాల అవసరాన్ని, అనివార్యతను గుర్తు చేస్తున్నాయి.

సాంఘిక సమానత్వం లేని రాజకీయ అధికారం నిరుపయోగం అంటారు డా. బి.ఆర్. అంబేద్కర్.

*(రచయిత కులనిర్మూలన పోరాట సమితి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్యక్షులు)* వీ

# కరువు కోరల్లో విజయనగరం జిల్లా రైతాంగం

*వ్యవసాయమే ప్రధాన జీవనాధారమైన విజయనగరం జిల్లాలో జీవనదులున్నా సాగునీరు లేక, పండిన పంటకు గిట్టుబాటు ధర రాక, రైతులు నిత్యం కరువుతో అల్లాడుతూ వలసబాట పడుతున్నారని అంటున్నారు* **ఎ. అన్నపూర్ణ**

ఉత్తరాంధ్ర మూడు జిల్లాల్లో మరీ వెనుకబడిన ప్రాంతం విజయనగరం జిల్లా. విశాఖ తరువాత రెండో పారిశ్రామిక నగరంగా గుర్తింపు పొందింది. ఈ జిల్లాలో పంట భూములకు కొదవలేదు. అలాగే చెప్పుకోదగ్గ తీరప్రాంతమూ ఉంది. తూర్పు కనుమలతో నిండిన దట్టమైన అటవీ ప్రాంతముంది. గోస్తనీ, సువర్ణముఖి, చంపావతి, వేగావతి, గోముఖి, జంఝావతి, వట్టిగెడ్డ వంటి జీవనదులు కూడా ఉన్నాయి. అయినా అనాదిగా ప్రభుత్వాల తీవ్ర నిర్లక్ష్యం, చిన్నచూపు వల్ల ఎన్నో ఏళ్లుగా వెనుకబడే ఉంటోంది. కరువుకి మరో పేరులా ఉంటుంది.

జిల్లాలో 82 శాతం ప్రజలకు వ్యవసాయమే ప్రధాన జీవనాధారం. సహజ సంపద పుష్కలంగా ఉన్నా ఈ ప్రాంతంలోని రైతులు కష్టాలు, కన్నీళ్లతోనే బతుకులు వెళ్లదీస్తున్నారు. నిత్యం ఇక్కడ ప్రజలు కరువు కాటకాల వలన బతుకు బండి నడపలేక అవస్థపడుతున్నారు. రెక్కాడితేగాని డొక్కాడని వ్యవసాయ కూలీల బతుకు మరింత దుర్భరంగా ఉంటుంది. ఆకలితో అల్లాడుతున్నారు. వలస దారి పడుతున్నారు. అంతేకాదు ఎక్కడ ఏ పరిశ్రమ నిర్మించాలన్నా పంట భూములే కావాలి. గతంలో గ్రోత్ సెంటర్ నిర్మాణం దగ్గర నుంచి నేటి భోగాపురం విమానాశ్రయం నిర్మాణం వరకూ ప్రభుత్వాలు రైతుల నుంచి బలవంతంగా భూములు లాక్కుంటున్నాయి. అలా లాక్కున్న భూములకు నష్టపరిహారం చెల్లించేందుకు మాత్రం మొహం చాటేస్తున్నాయి. ప్రభుత్వాల తీరు అలా ఉంటే భూమినే నమ్ముకుని బతుకుతున్న రైతులు, రైతు కూలీలు ఏమైపోవాలి?

ఏ యేటికాయేడు ఏదో ఒక ఉపద్రవం రైతులను వెంటాడుతూనే ఉంటుందిక్కడ. ఎందుకంటే భూగర్భ జలాలు రోజు రోజుకి అడుగంటిపోతున్నాయి. వానొస్తే పంట. రాకపోతే కరువు. వరుస తుఫాన్‌లు వస్తే రైతు పంట చెదిరిపోతుంది. గుండె చెరువైపోతుంది. రైతుకి ఒక కష్టం కాదు. ఇల్లు గడపాలి, అప్పులు తీర్చాలి, మళ్లీ పంటకు సిద్ధం కావాలి. ఇక్కడ దీర్ఘ కాలంగా రైతులకి సకాలంలో పంటకు సాగు నీరు ఏర్పాట్లు లేవు. ప్రభుత్వాలు కంటి తుడుపుగా మొదలు పెట్టిన గోముఖి అక్విడెక్టు నిర్మాణం, వెంగళరాయ సాగర్ జలాశయం ప్రాజెక్టులు పేపర్ల మీద తచ్చాడుతున్నాయి. ఈ నిర్మాణాలు పూర్తయితే బొబ్బిలి, సీతానగర్ మండలాల్లో సుమారు 10 వేల ఎకరాలకి సాగునీరు అందుతుంది.

పండిన పంటకు గిట్టుబాటు ధర మాట ఒక పెద్ద సమస్య. దానికి తోడు ఇప్పుడు అమ్మకమే పెద్ద సమస్య అయిపోయిందివాళ. పెట్టుబడి పెట్టి, శ్రమచేసి, కరువుని దాటుకుని, తుఫాన్‌లను ఎదుర్కొని నేల తల్లి ఒడి నుండి బతికించిన పంటను అమ్ముకోవాలంటే రైతులు పడే కష్టాలు అన్నీ ఇన్నీ కావు. ప్రభుత్వం సప్లై చేసిన విత్తనాలతో పండించిన పంటనే తిరిగి కొనడానికి అధికారులెన్నో తిప్పలు పెడుతున్నారు. బాధ్యత మొత్తం రైతులదే. గుర్తింపు పత్రాలు ఆధార్, పట్టా పాస్ బుక్, బ్యాంక్ ఎకౌంట్ చూపాలి. ఏ ఒక్క పత్రం లేకపోయినా రైతులు ఈసురోమంటున్నారు. అంతేనా మచ్చు తీసుకెళ్లాలి. నచ్చితే, విఆర్ఓ ధృవీకరణ పత్రం ఇస్తే గోను సంచులిస్తారు. పంటను రైతులే ఎత్తిపట్టి బళ్లకో, ట్రాక్టర్లకో తీసుకెళ్తే తూకానికి 2, 3 రోజులు పడుతుంది. తేమ వలన ఒకోసారి సంచులు ఆన్‌లైన్‌లో పడవు. తూకం అయ్యాక అకౌంట్‌లో డబ్బులు పడతాయంటారు. పడవు. ఇప్పటికే పండిన పంటలకి కోట్ల రూపాయల బకాయిల కోసం ఎనిమిది మండలాల రైతులు అధికారుల చుట్టూ మిల్లర్ల చుట్టూ కాళ్లరిగెలా తిరుగుతున్నారు. ఎందుకంటే వీళ్లు బడా పెట్టుబడిదారులు కాదు. పేద రైతులు. ఒక్కోసారి అధికారులు, మిల్లర్లు దళారులకీ పట్టం కడుతున్నారు. ఇక్కడ అనధికార దోపిడీ జరుగుతుంది. దళారుల రాక కోసం ఎదురు చూపులతో పండించిన పంటకు కల్లంలో కాపు కాస్తున్నారు. 'కల్లంలో పడుకున్నట్టే మా పండలగలన్నీ" అంటున్నారక్కడి రైతులంతా. పొలం బడి, రైతుబంధు ...లాంటి ఎన్నో అందమైన పేర్లు కాని రైతు సంక్షేమం కానరాదెక్కడా.

ఈ జిల్లా కూరగాయల పంటకూ పెట్టింది పేరు. దీంతో పాటు అనేక రకాల పూల తోటలు సాగుచేస్తున్నారు. రామభద్రపురం అందుకు ప్రసిద్ధి. అన్ని రకాల కూరగాయల సేద్యం చేస్తారిక్కడ. ఏడాదికి లక్ష మిలియన్ల టన్నుల కూరగాయలు పండిస్తారిక్కడ. ఇక్కడి నుండి ఇతర రాష్ట్రాలకు, జిల్లాలకు ఎగుమతి జరుగుతుంది. రామభద్రపురం అంతర్రాష్ట్ర కూరగాయల మార్కెట్ కూడలిగా ఉంది. రోజుకి 10 లక్షలకు పైగా వ్యాపారం సాగుతుంది. కానీ ఇక్కడ మార్కెట్ యార్డ్ లేదు. రోడ్ మీదే వ్యాపారం జరుగుతుంది. కోల్డ్ స్టోరేజ్‌లు లేవు. దీంతో మార్కెట్‌కి తెచ్చిన సరుకు అదే రోజు ఎంతొస్తే అంతకి దళారులకి అమ్ముకోవలసి వస్తుంది. దళారులు బాగుపడుతున్నారు. రైతులు ఆర్థికంగా చితికిపోతున్నారు. చివరకు ఫీజులు కట్టలేక పిల్లల చదువులను మధ్యలోనే ఆపేస్తున్నారు. 20 రకాల కూరగాయలు పండుతాయి. సుమారు 10 వేల రైతు కుటుంబాలకు జీవనాధారం. కానీ నేడు వాతావరణంలో మార్పులు, పురుగుల బెడద. తెగుళ్ల వలన, కల్తీ మందుల వలన రోజు రోజుకి పంట దిగుబడి తగ్గిపోతుంది. గిట్టుబాటు ధర లేదు. రాయితీలు లేవు. ప్రభుత్వ ఉద్యానవన, వ్యవసాయ శాఖలు రైతులకు పంట దిగుబడిని పెంచే సూచనలు సలహాలు ఇవ్వరు. పరికరాలు అందివ్వరు. రైతు

సదస్సులు నిర్వహించరు. నష్టాలెక్కువగా రాబడి తక్కువగా ఉండడంతో కొంతమంది వ్యవసాయ క్షేత్రాలను వదిలేసి కూలికెలుతున్నారు.

ఈ జిల్లాలో రైతులు గోగు నార పంట ఎక్కువగా పండించేవారు. ఈ పంటకు అనుబంధంగా జూట్ పరిశ్రమ ఉండేది. ఇక్కడున్న 11 జూట్ మిల్లులు రైతులకు, వ్యవసాయ కూలీలకు ఉపాధి భరోసానిచ్చేవి. ప్రభుత్వాల ఉదాశీనవైఖరి, ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ఒకటొకటిగా ఈ పరిశ్రమలను మింగేశాయి. ఇక్కడ ఈ పరిశ్రమ పూర్తిగా కుప్పకూలిపోయింది. ఫలితంగా ఈ పరిశ్రమకు ముడి సరుకును అందించే గోగు రైతుల పరిస్థితి చిన్నాభిన్నమైపోయింది. ప్రభుత్వ సబ్సిడీలు, సరైన ప్రోత్సాహకాలు లేక బతుకు తెరువు ఆశలన్నీ అడియాసలై పోవడంతో వ్యవసాయానికి దూరమయ్యారు.

అంతేకాదు ఇక్కడ చెరకు రైతుల పరిస్థితిలో ఏ మినహాయింపులేదు. ఒక్క భీమసింగి చక్కెర కర్మాగారం చూస్తే దీని మీద 14 మండలాల రైతులు ఆధారపడ్డారు. ఇందులో 16,873 మంది రైతులు భాగస్వాములుగా ఉన్నారు. కానీ 2 వేల మంది మాత్రమే చెరకు సప్లై చేస్తున్నారు. రోజు రోజుకి చెరకు సాగు తగ్గిపోతుంది. చెరకు రైతుల పరిస్థితి అధ్వాన్నమైపోయింది. ఎందుకంటే యేళ్ల తరబడి మిల్లులు బకాయిలు చెల్లించడం లేదు. ఈ బకాయిల విలువ కోట్లలో ఉంటుంది. గిట్టుబాటు ధర లేక, మిల్లులు తీసుకోక, బకాయిల చెల్లింపులు లేక అనేక ఇబ్బందులకి గురవుతున్నారు.

జిల్లా వ్యాప్తంగా ఎటు చూసినా సంఘటిత, అసంఘటిత రంగాలలోని రైతులు, వ్యవసాయ కూలీలు ఎంతో వేదనకు గురవుతున్నారు. ఇటు వ్యవసాయంలో అభివృద్ధి లేక అటు నూతన పరిశ్రమలు రాక ఉపాధిలేక వలసబాట పడుతున్నారు. పల్లెలు ఖాళీ అవుతున్నాయి. నగరాలకు వలసపోయి అక్కడా ఎలాంటి భద్రతలేని బతుకులు వెళ్లదీస్తున్నారు. ఈ వలస కార్మికులందరూ ఇటీవల కరోనా పేరుతో చేసిన లాక్‌డౌన్ కాలంలో ఎనలేని కష్టాలను, కన్నీళ్లను మోసుకొచ్చారు.

ఇక్కడ అపారమైన ప్రకృతి సంపద ఉండి కూడా ప్రజలు పేదరికం, అనారోగ్యం, అశాంతి, నిరక్షరాస్యతలో జీవిస్తున్నారు. ఈ జిల్లాలో ఏ గడపకు వెళ్లినా, ఏ మనిషిని చూసినా ఎంత వెనుకబడిన జీవితాన్ని గడుపుతున్నారో ఇట్టే అర్థమవుతుంది. బతకడం కోసం ఎంతో కష్టపడుతున్నారు. ఇంటిల్లపాది రోజంతా చేలల్లో పడి కొట్టుకులాడుతున్నారు. అవును నాణ్యమైన తిండి లేదు. పిల్లలు, పెద్దలు పోషకాలు లేని ఆహారంతో ఆకలి తీర్చుకుంటున్నారు. సరైన బట్టలేకుండానే బడికిపోయే పిల్లలు. మరుగుదొడ్లు లేని అపరిశుభ్ర వాతావరణంలో బతుకుతున్నారు. ఇరుకు గదులల్లో ఒకపక్క పంటకోసం తెచ్చిన విత్తనాలు, మందులు మరోపక్క కుటుంబ సభ్యులు. ఎండకి, వానకి, చలికి కుటుంబంలో నలుగురుంటే ఇద్దరు ఆరుబయటే పడుకోవాలి. ఈ దేశంలో 130 కోట్ల మందికి అన్నం పెట్టే రైతులు ఇలాంటి దుర్భర దారిద్ర స్థితిలో ఉన్నారు. రాజ్యాంగం సూత్రీకరించిన గౌరవప్రదమైన జీవితం వాళ్లకి అందని పండు. కలకల్లాడాల్సిన ఊరు వాడ, పంట పాడి, మనిషి, మాను అంతా జీవం లేని వనరులతో బతుకు నడుపుతున్నారు.

దీనికి కారణం ఏడు దశాబ్దాల వలస పాలకుల పాలన ఇక్కడ ఏ మార్పును తీసుకురాలేదు. మరింత దిగజార్చింది. ఏ పాలకవర్గం అధికారం చేపట్టినా పెట్టుబడుదారుల ఆస్తులు పెరుగుతున్నాయి. ప్రజల ఆదాయాలు మాత్రం రోజురోజుకి అడుగంటిపోయాయి. ప్రజలకి ఉపయోగపడాల్సిన వనరులన్నీ కార్పొరేట్‌వర్గాల చేతుల్లో, ప్రజల బాగోగులేమో వాళ్ల కాళ్లకింద తొక్కిపెట్టబడుతున్నాయి.

ఈ రోజు మోడీ ప్రభుత్వం అధికారం చేపట్టిన నాటి నుండి అనేక ప్రజా వ్యతిరేక విధానాలను అమలు చేస్తూ వచ్చింది. ఇప్పటికే నోట్ల రద్దు, జిఎస్‌టి, ఎఫ్‌డిఐ పేర్లతో పేదోళ్ల నోట్లో మట్టి కొట్టింది. ఈ బండరాళ్ల కింద ఎందరి బతుకులో చితికి పోయాయి. విదేశీ స్వదేశీ కార్పొరేట్ పెట్టుబడిదారులు యథేచ్ఛగా రాయితీలు, సబ్సిడీలు, అప్పులు, మాఫీలు, సౌకర్యాలు పొందుతున్నారు. ఈ దేశంలో రైతులు, చేనేత కార్మికులు మాత్రం రూపాయి పెట్టుబడి లేక బూటకపు రుణమాఫీలతో ఆత్మహత్యల పాలవుతున్నారు. పన్నుల భారం పేదలది. లాభాల భారం పెద్దలది.

ఈ దేశంలో 94 శాతం మంది కార్మికులు అసంఘటిత రంగంలో ఉన్నారు. వీరిలో 50 శాతం వ్యవసాయరంగం నుండే ఉన్నారు. ఇప్పుడు కోవిడ్-19 అనారోగ్యం, ఆర్థిక రూపాలలో మొత్తం మానవాళి జీవితాలనే తలకిందులు చేస్తుంది. ఈ పెను ముప్పుకి కారణం పాలకుల ప్రజావ్యతిరేక విధానాల అమలు ఫలితమేనని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. ఇప్పటివరకు అరకొరగా నిలబెట్టుకుంటూ వస్తున్న ఇక్కడి ప్రజల జీవన ప్రమాణాలన్నీ అధఃపాతాళానికి కొట్టుకుపోతున్న పరిస్థితి. ఈ స్థితిలో ఇక్కడ ప్రజలకి వ్యవసాయమొక్కటే ఆసరా. ఈ ఆసరాని నిలబెట్టుకోవాలంటే వనరులపై హక్కు, వనరుల పంపకం, వనరుల అభివృద్ధి జరగాలి. అందుకు పోరాటమొక్కటే పరిష్కార మార్గం. పి.ఎమ్. కిసానో, రైతు భరోసానో, రుణమాఫీలు రైతుల కష్టాలను తీర్చవు. అవన్నీ ఓట్ల కోసం గాలాలు. ఏడు దశాబ్దాలు దాటినా ఇంకా ఈ గాలాలకే బలవుదామా? రైతు జీవితాల్లో శాశ్వత మార్పుని తెచ్చేది రైతు రాజ్యమొక్కటే. అందుకే ఇక్కడ రైతులంతా శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటాల స్ఫూర్తితో ఐక్యతతో పోరాడాలి. కార్మిక కర్షక రాజ్యం స్థాపన కోసం నిరంతరం కృషి చేయాలి. దీనిలో భాగంగానే మన చుట్టూ, మన ప్రాంతం చుట్టూ ఉన్న సమస్యలన్నీ పరిష్కరించబడతాయని ప్రతి ఒక్కరు గుర్తించాలి.

*(రచయిత ప్రగతిశీల కార్మిక సమాఖ్య ఎపి రాష్ట్ర కమిటీ సభ్యురాలు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.*

# జీవించే హక్కుకు భరోసా ఎక్కడ?

***తమిళనాడులోని తూత్తుకుడి జిల్లా సాత్తాంకుళమ్ పోలీసు కస్టడీ మరణాలు దేశంలో పౌరహక్కుల అణచివేత స్థాయి తీవ్రతను, న్యాయవ్యవస్థ పట్ల అగౌరవాన్ని తెలియజేస్తున్నాయని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**19** జూన్ 2020 తూత్తుకుడి జిల్లా సాత్తాంకుళమ్ పోలీసులు స్థానిక మొబైల్ దుకాణాల యజమానులైన జయరాజ్‌ను కొరోనా నిబంధనలు పాటించలేదనే కారణం చేత అరెస్ట్ చేశారు. అతడు చేసిన నేరం అంతా పోలీసులు వచ్చేసరికి తన దుకాణంను మూయకపోవడమే. అప్పటికి కేవలం పదిహేను నిమిషాలు మాత్రమే అయింది. పోలీసులు తాము చెప్పిన గడువు కాలం ప్రకటించినప్పటికీ తన మొబైల్ దుకాణం తెరిచి ఉంచాడనే ఏకైక కారణం చేత పోలీసుస్టేషన్‌లో అక్రమంగా నిర్బంధించారు. తన తండ్రిని నిర్బంధించారని తెలుసుకొని విడిపించుకోవడానికి కుమారుడు బెన్నిక్స్ పోలీసు స్టేషన్‌కు వెళ్లగా, ఇరువురినీ పోలీసులు చిత్రహింసలకు గురిచేశారు. దాదాపుగా అన్ని రకాల ప్రయోగాలను వారిపైన ప్రయోగించారు. దాదాపు 80 శాతం వారు చనిపోయారు. చివరి 20 శాతం ప్రాణాలు ఉండగా వారిని కోవిల్‌పట్టి ఫస్ట్ క్లాస్ మెజిస్ట్రేట్ వద్దకు రిమాండ్ కొరకై తీసుకొని వెళ్లారు కనీసం ఆ మెజిస్ట్రేట్ కూడా కనికరం చూపకుండా, వారి వైపు ఏమైనా చూచి వారిపట్ల దయ, జాలి చూపకుండా రిమాండ్‌కు ఆదేశించాడు. స్థానిక జైలు సిబ్బంది వారి ఆరోగ్య పరిస్థితి, శరీరాలపై తీవ్ర రక్తస్రావం, గాయాలు గమనించి స్థానిక ఆసుపత్రిలో చేర్పించగా, వారు మరణించారు. ఇవి పూర్తిగా పోలీసులు చేసిన హత్యలే. సాత్తాంకుళమ్ పోలీసు స్టేషన్‌లో జరిగిన చిత్రహింసలకు గురైన వారు ఎంతమందో. పోలీసులకు ఏ మాత్రం న్యాయవ్యవస్థపై గౌరవం లేదు. పౌరులను చిత్రహింసలకు గురిచేస్తే అది 'నేర'మవుతుందని వారికి తెలియక కాదు. మమ్మల్ని ఎవరూ ఏమీ చేయలేరనే అహంతో వారు ఈ విధంగా ప్రవర్తిస్తున్నారు. దాదాపుగా భారదేశంలో అన్ని పోలీస్టు స్టేషన్లలో ఇదే పరిస్థితి నెలకొంది.

భారత రాజ్యాంగం ఇచ్చిన పౌరహక్కులు, రాజ్యాంగ హక్కులు, రాజ్యాంగ విలువలు, పోలీసుల దృష్టిలో అపవిత్రమైనవి. వాటి గురించి మాట్లాడే వాడు నేరస్థుడు. ప్రజాస్వామిక వ్యవస్థలో నివసిస్తున్న, జీవిస్తున్న పౌరులు 'రాజ్యాంగం' ఇచ్చిన హక్కుల గురించి ప్రశ్నిస్తూనే ఉండాలి. భారత రాజ్యాంగం ప్రజాస్వామిక స్ఫూర్తికి నిదర్శనం. కాని ఈ పోలీసులు ప్రజల పట్ల కక్షపూరితంగా వ్యవహరిస్తున్నారు. తూత్తుకుడి జిల్లా సంఘటనలో ఏ నేరం చేయనప్పటికీ నిర్దాక్షిణ్యంగా రెండు ప్రాణాలను పోలీసులు బలిగొన్నారు. ఇది ఎంత దుర్మార్గం? వీరి ప్రాణాలకు విలువ ఎవరు చెల్లిస్తారు? వీరిరువురినీ చిత్రహింసలకు గురిచేసిన పోలీసులు మాత్రమే బాధ్యులు కారు. రిమాండ్‌కు ఇచ్చే సమయంలో వారిని కనీసం 'మీకు రక్తగాయాలు ఎక్కడి నుండి వచ్చినవి?', 'పోలీసులు చిత్రహింసలకు గురిచేశారా?' అని ప్రశ్నించని స్థానిక మెజిస్ట్రేట్ కూడా బాధ్యుడే. సాత్తాంకుళమ్ పోలీసు స్టేషన్‌లో ఆ రోజు డ్యూటీలో ఉన్న పోలీసు లందరినీ 'హత్య' కేసు నమోదు చేసి అరెస్టు చేయాలి. వెంటనే ఉద్యోగాలలో నుంచి తొలగించి, వీరిపై ఏ మాత్రమూ కనికరం చూపరాదు. ప్రజలు ఆగ్రహానికి గురై రాష్ట్రవ్యాప్తంగా ఆందోళన చేపట్టడంతో మధురై హైకోర్టు బెంచ్ కేస్‌ను సుమోటోగా స్వీకరించి విచారణ చేపట్టింది. అంతేకాకుండా జాతీయ మానవ హక్కుల సంఘం (ఎన్‌ఎచ్‌ఆర్‌సి) తమిళనాడు రాష్ట్ర డిజిపికి, తూత్తుకుడి జిల్లా పోలీసు సూపరింటెండెంట్‌కూ నోటీసులు జారీ చేసింది. వారం రోజుల లోగా సమాధానం ఇవ్వాలని నోటీసులో పేర్కొంది. అప్పుడు రాష్ట్ర ప్రభుత్వం స్పందించి ఐదుగురిపై హత్యానేరం ఐపిసి సెక్షన్ 302 కింద సిబిసిఐడి కేసు నమోదు చేసి అరెస్టు చేసింది. ఈ ఐదుగురిలో సాత్తాంకుళమ్ ఇన్‌స్పెక్టర్, ఇద్దరు ఎస్‌ఐలు, ఇద్దరు కానిస్టేబుళ్లు ఉన్నారు.

ఈ మొత్తం సంఘటనపై విచారణ జరిపినప్పుడు ఆ స్టేషన్‌లో పనిచేసే ఒక మహిళా కానిస్టేబుల్ సాక్ష్యమిస్తూ, ఎవరెవరు ఆ ఇరువురు తండ్రీ కొడుకులను హింసించారనే విషయాన్ని పై అధికారుల ముందు వాంఙ్మూలం ఇచ్చింది. స్థానిక జ్యుడీషియల్ ఫస్ట్ క్లాస్ మెజిస్ట్రేట్ ముందు సెక్షన్ 164 సిపిసి ప్రకారం కూడా వాంఙ్మూలం ఇచ్చింది. అప్పుడు కేసుకు ఇంకా బలం చేకూరింది. తద్వారా ఈ కేసులో నేరస్థులను అరెస్ట్ చేయడం సులభంగా మారింది.

సాత్తాంకుళమ్ పోలీస్ స్టేషన్‌లో సిసి టివి ఫుటేజీలు కూడా తొలగించారు. వాటిని ఏ రోజుకారోజు తొలగించే సౌకర్యం కూడా ఏర్పాటు చేసుకున్నారు. ఈ విధంగా ఎంతమందిని ఆ పోలీసు స్టేషన్‌లో చిత్రహింసలకు గురిచేసి చంపి ఉంటారో?

ఈ దేశంలో ప్రతిరోజూ ఎన్నో సంఘటనలు ఇలాంటివి జరుగుతున్నా ఈ సంఘటనకు ప్రాధాన్యత ఎందుకు వచ్చిందంటే కేవలం తమ మొబైల్ దుకాణాన్ని 15 నిమిషాలు ఎక్కువగా తెరిచి ఉంచినందుకు, ఆ దుకాణాన్ని మూసే సమయంలో పోలీసులకు, తాము కోరిన సమాధానం ఇవ్వకుండా కొంత నిర్లక్ష్యపూర్వకంగా సమాధానం ఇచ్చాడనే ఆగ్రహంతో పోలీసులు యజమాని జయరాజ్‌ను కొడుతూ పోలీస్ స్టేషన్‌కు తీసుకు వెళ్లారు. తన తండ్రిని అక్రమంగా అరెస్టు చేశారని, మాట్లాడి విడిపించుకొని రావడానికి వెళ్లిన కుమారుడు బెన్నిక్స్‌ను కూడా చిత్రహింసలకు గురిచేశారంటే పోలీసుల దురహంకారం ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. చిన్న మాటలతో పోయేదానికి హత్యలు చేసే స్థాయికి పోలీసులు వచ్చారంటే వీరిపై అధికారులు, వారిని ఆదేశిస్తున్న రాజకీయ

వ్యవస్థ మొత్తం సహకారం ఉంది కాబట్టే ఈ విధంగా పోలీసులు చేయగలుగుతున్నారు. తమను ప్రశ్నించే వారికి ఇదే విధంగా బుద్ధి చెబుతాం అని మొత్తం సమాజానికే ఒక సవాల్‌గా ఈ పోలీస్ వ్యవస్థ తయారైంది. ఒక్క తూత్తుకుడి జిల్లా లోనే కాదు దేశవ్యాప్తంగా ఇదే పరిస్థితి నెలకొని ఉంది. స్థానిక వ్యాపార సంస్థల నుంచి నెల వారీ మామూళ్లు, పెట్రోల్ బంకులు, దాబాలు, వైన్స్, హోటళ్లు ఇతర పరిశ్రమలు (నూనె, బియ్యం మిల్లులు) వీరి సహజ ఆదాయ మార్గాలు. అయితే 73 సంవత్సరాల స్వాతంత్ర్య ఫలాలు పోలీసులను ఈ విధంగా తయారు చేశాయా? లేదా పౌరసమాజం చూస్తూ ఊరుకోవడం వలన పోలీసులు ఈ విధంగా తయారయ్యారా అనేది మనలను మనం శోధించుకోవాల్సిన విషయం. ఇది పూర్తిగా పోలీసుల అమానవీయ, రాజ్యాంగంపై నిర్లక్ష్య ధోరణికి నిదర్శనం.

దేశవ్యాప్తంగా సగటున గంటకు పోలీసు స్టేషన్‌లో చిత్రహింసలకు గురయి చనిపోయే వారు 6 నుంచి 7 మంది ఉన్నట్లు గతంలో ఒక సర్వే చెప్పింది. కానీ ప్రస్తుతం ఆ లెక్క కూడా పెరిగి ఉండవచ్చు. పోలీస్ స్టేషన్‌లో ఒక ఫిర్యాదు నమోదు చేసి ఎఫ్ఐఆర్ కాపీ తీసుకోవడానికి ఎంతో శ్రమించాల్సిన పరిస్థితి ఉంది. పై అధికారుల నుంచి ఒత్తిడి తీసుకొని వస్తే తప్ప స్థానికంగా పోలీసులు స్పందించే పరిస్థితి లేదు. పోలీసులు తాము నిర్ణయించుకున్నదే శాసనం, రాజ్యాంగం తప్ప తమను ఎవరూ ప్రశ్నించడానికి లేదు అనే స్థితిలో ఉన్నారు. దీనికి ప్రధాన కారణం ఈ దేశంలో న్యాయవ్యవస్థకు పోలీసులు భయపడకపోవడమే. అంతేకాకుండా కింది కోర్టుల న్యాయమూర్తులు ప్రతి చిన్న పనికీ పోలీసుల మీద ఆధారపడటం. కాబట్టి న్యాయాధికారులంటేనే వారికి లెక్కలేదు. పైగా న్యాయాధికారులను తమ చెప్పు చేతుల్లో ఉంచుకునే ప్రయత్నం కొన్ని చోట్ల పోలీసులు చేస్తున్నారు. ఇది మరీ దుర్మార్గం. చివరకు సామాన్య పౌరుడు ఈ దేశంలో పోలీసుల అరాచకాలకు బలవుతున్నారు. ఇది నిత్యకృత్యంగా మారిపోయింది.

ఎవరు ఏయే హోదాల్లో ఉన్నప్పటికీ భారత రాజ్యాంగం అందరి కంటే ఉన్నతమైనదిగా భావించాలి. దీనిని భారత సుప్రీం కోర్టు ఎన్నోసార్లు స్పష్టం చేసింది. ఉదాహరణకు బల్గేరియా ప్రధాన మంత్రి ఆ దేశంలో చర్చికి వెళ్లినప్పుడు మాస్క్ ధరించనందుకు ఆ దేశ ఆరోగ్య మంత్రిత్వ శాఖ 300 లెవ్స్ (రు. 13000) జరిమానా విధించింది. అదే భారతదేశంలో నయితే ఈ విధంగా జరిగి ఉండేదా? ఈ దేశంలో 'చట్టబద్ధ పాలన' (రూల్ ఆఫ్ లా) అంటే అధికారంలో ఉన్నవారి ఆజ్ఞ పాటించడమే అనగా ఎవరు అధికారంలో ఉంటే వారి ఆజ్ఞను శిరసా వహించడమే.

భారత రాజ్యాంగం ఏమి చెబుతున్నదనేది కాకుండా అధికారంలోని వారి మెప్పు పొందడం కోసం ఎంతవరకైనా దిగజారి పనిచేసే పోలీస్ వ్యవస్థను తయారు చేశారు. పోలీసులు ఎన్ని అకృత్యాలు చేసినప్పటికీ వారి పట్ల గౌరవ మర్యాదలు, భయభక్తులు ఈ ప్రజలు చూపించబట్టే పోలీసులు ఈ విధంగా తయారయ్యారు.

ప్రజాస్వామ్య వ్యవస్థలో పోరాడే హక్కు ప్రజలకు ఉందనేది పోలీసులు గుర్తించడం లేదు, గౌరవించడం లేదు. పౌర, ప్రజాస్వామిక హక్కుల దృక్పథంనే వారు తృణీకరిస్తున్నారు, అణిచివేస్తున్నారు. నిజాన్ని కప్పిపెట్టాలని చూసినప్పటికీ తూత్తుకుడి జిల్లాలో అది జరగలేదు. వారు చేసిన దుర్మార్గం, హత్యలు బయటపడ్డాయి. పోలీసుల దుర్మార్గాలు ఎంత తీవ్రతరంగా ఉంటాయనే దానికి ఇదే నిదర్శనం. నిరాయుధులైన, కేవలం మొబైల్ దుకాణం నడుపుతున్న తండ్రీ కొడుకులనే హతమార్చిన పోలీసు వ్యవస్థ ఈ దేశంలో ఉందంటే నిజంగా పోరాడే ప్రజలపై, చైతన్యవంతులైన ప్రజలపై పోలీసులు ఏ విధమైన బలప్రయోగం చేస్తారో ఊహించవచ్చు.

పోలీసులు అరెస్ట్ చేసే సమయంలోనూ, తమ కస్టడీకి తీసుకొనే సమయంలోనూ కొన్ని నియమాలను పాటించాలనీ, 1996లోనే దేశ సర్వోన్నత న్యాయస్థానం సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. కుటుంబ సభ్యులు, లేక న్యాయవాది సమక్షంలో పోలీసులు విచారణ చేయాలనీ స్పష్టపరిచింది. అయినప్పటికీ నిందితుల పట్ల అనగా (నేరం ఆరోపించబడింది కానీ రుజువు కాలేదు కాబట్టి ఆరోపించబడిన నిందితులు మాత్రమే) పోలీసులు గౌరవ మర్యాదలతో వ్యవహరించాలని చాలాసార్లు తీర్పులలో వివిధ రకాలుగా స్పష్టపరిచింది. (ఎఐఆర్ 1997 ఎస్‌సి 610). ఇంట్లో ఉన్న వస్తువులను కానీ లేదా ఏదైనా డాక్యుమెంట్లను తీసుకునే సమయంలో ఇంట్లో వారి అనుమతితోనే వాటిని స్వీకరించాలి. పోలీసులు కస్టడీ లోనికి తీసుకున్న వ్యక్తిని మొదట సోదా చేసే సమయంలో, పోలీసులు మొదట ఆ వ్యక్తి చేత సోదా చేయబడాలి. అంతే కాకుండా కుటుంబ సభ్యులకు సమాచారమిచ్చి, వారి సంతకం తీసుకుని ఆ వ్యక్తిని అదుపులోనికి తీసుకుంటున్నట్లు తెలియజేసి, కుటుంబ సభ్యులకు రసీదు ఇవ్వాలి. కుటుంబ సభ్యులను కూడా తోడుగా వెంట తీసుకువెళ్లగలిగే వెసులుబాటు వారికివ్వాలి. వారి న్యాయవాదికి సమాచారం ఇచ్చుకునే సౌలభ్యం కూడా ఉండాలి. 24 గంటలలోగా కోర్టులలో ప్రవేశపెట్టాలి.

పైన తెలియజేసిన డి.కె. బసు కేసు తీర్పులోని కొన్ని వివరాలను పోలీసులు ఇప్పుడు ఏమీ పాటించడం లేదు. తాము అనుకున్న వ్యక్తిని అరెస్ట్ చేస్తారు లేదా అక్రమంగా ఎన్‌కౌంటర్‌లో కాల్చి చంపుతారు. ఎవరైనా రాష్ట్ర హైకోర్టులను ఆశ్రయిస్తే, హైకోర్టును కూడా తప్పుదోవ పట్టించే సమాధానాలను వెతుకుతారు తప్ప వారు చేసింది తప్పు అని ఏ మాత్రమూ సరిచూసుకోరు. మరోసారి తప్పు జరగకుండా సరిదిద్దుకునే ప్రయత్నం చేయరు. ఈ మధ్యకాలంలో విపరీతమైన ధనదాహం పోలీసు వ్యవస్థలో ఎక్కువైంది. ఆయా ప్రభుత్వాలు కూడా విచ్చలవిడిగా నిధులను కేటాయిస్తున్నాయి. అరెస్ట్ కాబడిన వ్యక్తి వారికి ధనమైనా ముట్టచెప్పాలి లేదా వారికి దాసోహమైనా కావాలనే పరిస్థితి నెలకొంది.

పోలీసులు చేస్తున్న అరెస్ట్‌లలో సగం అనవసరమైనవే ఉన్నాయనీ, అవి గతంలోనే కేసులు నిరూపణ కాలేని పరిస్థితి నెలకొన్నదనీ జాతీయ పోలీస్ కమిషన్ 3వ నివేదికలో పేర్కొంది. పోలీస్ కమిషన్ సూచించిన విషయాలను కూడా పోలీస్ వ్యవస్థ పాటించడం లేదనీ సుప్రీంకోర్టు విచారణ వ్యక్తం చేస్తున్నది. ప్రాథమిక హక్కు అయిన 'వ్యక్తి స్వేచ్ఛ' (సివిల్ లిబర్టీ) సంరక్షణకు సంబంధించిన రాజ్యాంగ నిర్దేశాలను పోలీస్ కమిషన్ సిఫారసులలో ఉన్నప్పటికి వాటిని అమలు పరిచే ఏకైక మార్గం ఏమిటంటే చట్టాలను ఉల్లంఘించే వారిని ఉద్యోగాల నుంచి తొలగించి, వారిపై క్రిమినల్ కేసులు నమోదు చేసి వారిని ప్రాసిక్యూట్ చేయడం మరో మార్గం. అవినీతిపరులైన అధికారులపై నిర్దిష్టంగా

# జి.ఎన్. సాయిబాబాకు అరుంధతీ రాయ్ లేఖ

***దేశంలో ప్రస్తుతం నెలకొని ఉన్న పరిస్థితి గురించి నాగపూర్ జైలులో నిర్బంధంలో ఉన్న సాయిబాబాకు రచయిత్రి***
**అరుంధతీ రాయ్** *రాసిన లేఖ*

ప్రియమైన సాయి,

నిన్ను నిరాశ పరుస్తున్నందుకు క్షమించు. ఈ ఉత్తరం రాస్తున్నది నేను అరుంధతిని, అంజుమ్ కాదు. నువ్వు ఆమెకు మూడు ఏండ్ల క్రితం ఉత్తరం రాసావు. ఆమె నీకింకా జవాబు బాకీయే ఉంది. కానీ ఏమని చెప్పను – వాట్సాప్, ట్విట్టర్‌ల వేగవంతమైన ప్రపంచాన్ని పక్కన పెట్టు, ఆమె దృష్టి లో సమయం అనే భావన మన భావన కన్న భిన్నమైనది. ఆమె దృష్టిలో ఉత్తరానికి మూడేండ్లు జవాబు ఇవ్వకుండా ఉండడం పెద్ద విషయం కాదు. ప్రస్తుతం అంజుమ్ జన్నత్ గెస్ట్ హౌజ్‌లో తన గదికి గడి వేసుకొని, రోజంతా పాటలు పాడుతూ గడిపేస్తోంది.

చెప్పుకోదగిన విషయం ఏమిటంటే ఇన్ని ఏండ్ల తర్వాత ఆమె మళ్లీ పాడడం మొదలుపెట్టింది. ఆమె గది ముందునుండి నడిచేప్పుడు ఆమె పాటలు వింటుంటే బతికి ఉన్నందుకు నాకు సంతోషమనిపిస్తుంది. ఆమె 'తుమ్ బిన్ కౌన్ ఖబరియా మోరీ లేత్' (నువ్వు తప్ప నా గురించి ఎవరు అడుగుతారు?) అనే పాట పాడినప్పుడల్లా నా మనసులో దిగులు ఆవరిస్తుంది. ఆ పాట నాకు నిన్ను గుర్తు చేస్తుంది. ఆమె పాడేటప్పుడు, ఆమె కూడా నీ గురించి ఆలోచిస్తుందని నాకు తెలుసు. అందుకే ఆమె నీకు జవాబు రాయకపోయినా, ఆమె తరచూ నీ గురించి పాడుతుందని నీకు తెలియాలి. నువ్వు ఏకాగ్రతతో వింటే, ఆమె పాడే పాటలు నీకు వినబడవచ్చు కూడా.

సమయం గురించి మన భావన అని మాట్లాడినప్పుడు అంత సునాయాసంగా 'మన' అని నిన్ను కలుపుకోవడం నా తప్పే – ఎందుకంటే దుర్భరమైన అండా సెల్ లో జీవిత ఖైదుగా ఉండటమంటే సమయం పట్ల నీ భావన, నాకన్నా అంజుమ్ భావనకే దగ్గరగా ఉండవచ్చు. బహుశా ఆమె భావన నుండి కూడా చాలా భిన్నంగా ఉండవచ్చు. ఇంగ్లిష్ భాషలో 'డూయింగ్ టైమ్' (జైలులో ఖైదీగా ఉండడం) అనే పదాలకు మామూలు వాడుకభాషలో అర్థం కన్నా ఏదో లోతైన అర్థం ఉన్నట్టు నేను అనుకునేదాన్ని. ఏమోలే, అనాలోచితంగా ఈ మాటలు అన్నందుకు క్షమించు. ఒక రకంగా అంజుమ్ కూడా తన శ్మశానవాటికలో జీవిత ఖైదు అనుభవిస్తోంది. కాకపోతే ఆమె జైలు ఊచల వెనక బతకడంలేదు. ఆమెకు మనుషులెవరూ జైలర్లుగా కాపలా కాయడంలేదు. జీనీలూ, జాకీర్ మియా గురించి ఆమె జ్ఞాపకాలే ఆమెకు జైలర్లు.

**ఖాకీ కాల్పనికం**

నువ్వు ఎలా ఉన్నావని నేను అడగను. వసంత నాకు చెప్తూనే ఉంది. అన్ని వివరాలూ ఉన్న మెడికల్ రిపోర్ట్ కూడా చూశాను. వాళ్లు నీకు బెయిలు కానీ పెరోల్ కానీ ఇవ్వకపోవడం ఊహకందని విషయంగా ఉంది. నిజానికి నీ గురించి నేను ఆలోచించకుండా ఒక్క రోజు కూడా గడవదు. ఇప్పటికీ నీకు అందే వార్తాపత్రికలను సెన్సార్ చేస్తున్నారా, పుస్తకాలు అందకుండా చేస్తున్నారా? నీకు రోజూ సహాయపడే తోటి ఖైదీలు నీ సెల్లులోనే ఉంటారా, షిఫ్ట్‌లలో సహాయం చేస్తారా? స్నేహంగా ఉంటారా వాళ్లు? నీ వీల్ చెయిర్ పని చేస్తోందా? వాళ్లు నిన్ను అరెస్ట్ చేసినప్పుడు అది పాడయిందని నాకు తెలుసు – నువ్వేదో ప్రమాదకరమైన నేరస్తునివి అయినట్టు నువ్వు ఇంటికి వెళ్తుంటే నిన్ను కిడ్నాప్ చేశారు.

---

ఆరోపణలున్నప్పుడు వారిని 'అవినీతి నిరోధక శాఖ' (ఎసిబి) చేత దాడులు చేయించినప్పటికి వారు మారడం లేదు కాబట్టి వారిని తిరిగి ఉద్యోగాలకు తీసుకోకుండా కఠినంగా వ్యవహరించాలి. ఐపిఎస్ అధికారులు 'చట్టం' అంతా తమకు నూరిపోసిన పిండి మాదిరి భావిస్తూ ఉంటారి. ఇది పూర్తిగా అవాస్తవం. కింది స్థాయి అధికారులు తప్పు చేస్తే వారిని రక్షిస్తున్నారు. ప్రజల దృష్టి మరల్చడానికి తాత్కాలికంగా సస్పెన్షన్ విధిస్తున్నారు తప్ప నిజంగా వారిని విధుల నుంచి తప్పించడం లేదు. వారిని ఉద్యోగాల నుంచి పూర్తిగా తొలగించాలి. అవినీతి నిరోధక శాఖలో కూడా పోలీసు శాఖ సిబ్బందే పనిచేయడం వలన పోలీసు అధికారులు అవినీతికి పాల్పడినప్పుడు ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారు. కాబట్టి అధారాలు దొరికిన వెంటనే విచారణ జరిపించి వారిని కఠినంగా శిక్షించాలి. లేనిపక్షంలో ఇలాంటి సంఘటనలు పునరావృతమవుతాయి.

జయరాజ్, బెన్నిక్స్‌ల విషయంలో కూడా తమిళనాడు రాష్ట్రంలోని దాదాపు అన్ని ప్రజా సంఘాలు స్పందించడంతో ప్రజా ఉద్యమానికి తలొగ్గి రాష్ట్ర ప్రభుత్వం స్పందించి, నిందితులైన పోలీసు అధికారులపై కేసు నమోదు చేసి, వారిని అరెస్ట్ చేసింది. మధురై హైకోర్టు బెంచ్ కూడా విచారణకు స్వీకరించడం చేత ప్రస్తుతం సిపిఐ విచారణ కొనసాగుతున్నది. నిందితులపై విచారణ పూర్తిచేసి అతి త్వరగా వారిని కోర్టు ద్వారా శిక్ష విధించబడాలని ఆశిద్దాం. ఈ కేసును మాదిరిగా తీసుకొని దేశవ్యాప్తంగా పోలీసు స్టేషన్లలో ప్రజలతో పోలీసులు వ్యవహరించే తీరు మారాలని ఆశిద్దాం. మొత్తం పోలీసు వ్యవస్థకే ఈ కేసు కనువిప్పు కావాలి. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజల పౌర, ప్రజాస్వామిక హక్కులు కాపాడబడాలని కోరుకుందాం.

*(రచయిత అడ్వకేట్, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

(వాళ్ల తుపాకులు గుంజుకొని, ఒక చేత్తో నీ వీల్ చెయిర్ ఎత్తుకొని నువ్వు పారిపోతూ ఉంటే, 'ఆత్మరక్షణ' కోసం వికాస్ దుబేని చేసినట్టు నిన్ను చేయకుండా ఉన్నందుకు మనం సంతోషపడాలి. ఖాకీ కాల్పనికం అని ఈ కొత్త సాహిత్య ప్రక్రియకు పేరు పెట్టాలి, ఏమంటావు? ఈ ప్రక్రియలో సాహిత్య వార్షికోత్సవాలు జరిపే అంత మెటీరియల్ ఉంది. పారితోషికం కూడా ఉంటే బాగుంటుంది, మన నిష్పాక్షిక న్యాయస్థానాల్లోని నిష్పాక్షికమైన న్యాయమూర్తులు ఈ పని కూడా అద్భుతంగా చేస్తారు.)

నువ్వు నన్ను కలవడానికి వచ్చినపుడు, వీధి అవతల ఉన్న క్యాబ్ డ్రైవర్‌లు నీ వీల్ చెయిర్‌ను మెట్లపై మోస్తూ నా ఫ్లాట్ వరకూ తేవడానికి సహాయం చేసిన ఆ రోజులను గుర్తు చేసుకుంటుంటాను. ఈ మధ్య కాలంలో ఆ ప్రతి మెట్టు మీద ఒక ఊరకుక్క కూర్చొని ఉంటోంది. చడ్డా సాహిబ్ (తండ్రి), బంజారిన్ (జిప్సీ తల్లి), లీల, శీల (వాటి కుక్క పిల్లలు). కోవిడ్ లాక్‌డౌన్ సమయంలో అవి పుట్టాయి. ఎందుకో మరి అవి నన్ను దత్తత తీసుకోవాలని నిర్ణయించుకున్నట్టుగా ఉంది. కానీ కోవిడ్ లాక్‌డౌన్ ముగిసాక మన క్యాబ్ డ్రైవర్ మిత్రులందరూ ఇక్కడ లేకుండా పోయారు. పని దొరకడం లేదు. క్యాబ్‌లు అన్నీ కదగకుండా, మట్టి కొట్టుకుపోయి ఉన్నాయి. మెల్లగా వేళ్లూనుకొని, వాటికి కొమ్మలు, ఆకులు వస్తున్నాయి. చిన్న చిన్న మనుషులు పెద్ద నగరాల వీధుల్లో నుండి మాయమైపోయారు. అందరూ కాదు. కానీ చాలా మంది. లక్షల మంది.

నువ్వు నాకోసం చేసిన పచ్చళ్లు చిన్న సీసాల్లో ఇంకా అలానే ఉన్నాయి. నువ్వు బయటకు వచ్చి నాతో కలిసి భోజనం చేసేవరకూ వాటిని తెరవకుండా వేచి ఉంటాను. అవి చక్కగా మాగుతున్నాయి.

నేను మీ వసంతనూ, మంజీరనూ అప్పుడప్పుడు మాత్రమే కలుస్తాను. ఎందుకంటే మా సామూహిక విషాదపు బరువు ఆ కలయికల్ని కష్టతరం చేస్తుంది. అయితే, ఒక్క విషాదమే కాదు, కోపం, నిస్సహాయత%లల% నావరకైతే నేను సిగ్గు పడుతున్నాను కూడా – నీ పరిస్థితి ఎంత అన్యాయమైనదో ఎక్కువ మందికి అర్థం చేయించలేకపోయినందుకు – 90 శాతం అంగవైకల్యం ఉన్న మనిషిని ఒక హాస్యాస్పదమైన నేరం మోపి, శిక్ష వేసి, జైలులో ఉంచడం ఎంత అమానుషమో అర్థం చేయించ లేకపోయినందుకు సిగ్గు పడుతున్నాను. ప్రక్రియనే శిక్షగా చేసే మన న్యాయవ్యవస్థ చక్రవ్యూహంలో నీ పిటిషన్ వేగవంతం అయ్యేందుకు నేనేమీ చేయలేకపోతున్నందుకు సిగ్గు పడుతున్నాను. సుప్రీంకోర్టు అంతిమంగా నిన్ను నిర్దోషిగా విడుదల చేస్తుంది. కానీ అది జరిగేటప్పటికి నువ్వూ, నీవాళ్లూ ఎంత మూల్యం చెల్లించి ఉంటారు!

నీ జైలుతో పాటు అన్ని జైళ్లలో కోవిడ్–19 విజృంభిస్తుండగా, ఈ యావజ్జీవ కారాగార శిక్ష, నీ పరిస్థితి వల్ల, అతి సులభంగా మరణ శిక్ష కాగలదని వాళ్లకు తెలుసు.

మనం కలిసి నవ్వుకున్న, కలిసి తిన్న, తీవ్రంగా వాదించుకున్న కొంత మంది మన మిత్రులతో సహా ఇంకా చాలా మంది – విద్యార్థులు, లాయర్లు, జర్నలిస్టులు, ఆక్టివిస్టులు – ఇప్పుడు జైలులో ఉన్నారు. వివి (అంటే నేను వరవరరావు గురించి మాట్లాడుతున్నాను, నీ జైలు సెన్సార్లు నేనేదో కోడ్ భాష మాట్లాడుతున్నానని అనుకోగలరు!) గురించి వార్త విన్నావో లేదో తెలియదు. 81 ఏండ్ల ఆ అద్భుతమైన కవిని జైలులో పెట్టడమంటే ఒక నవయుగ కళాఖండాన్ని జైలులో పెట్టడమే. ఆయన ఆరోగ్యం గురించి తెలుస్తున్న వార్తలు చాలా ఆందోళనకరంగా ఉన్నాయి. ఎన్నో రోజులు ఆయన అనారోగ్యాన్ని నిర్లక్ష్యం చేసి, ఇప్పుడు కోవిడ్ పాజిటివ్ వచ్చాక, హాస్పిటల్‌లో చేర్చారు. కుటుంబ సభ్యులు ఆయనను చూడడానికి వెళ్లిన సమయానికి ఆయన ఒంటరిగా, మూత్రంతో తడిసిన పక్కబట్టల్లో పడుకొని ఉన్నట్టు చెబుతున్నారు. ఆయనకు మాటలు తడబడుతున్నాయట, నడవలేకపోతున్నారట. వివికి మాటలు తడబడటం! లక్షలాది ప్రజల ముందు సునాయాసంగా ప్రసంగాలు చేసిన వివి! ఆంధ్రా, తెలంగాణా, ఇండియా అంతటా తన కవిత్వంతో కోట్ల మంది ఊహలను వెలిగించిన వివి.

నీ గురించి భయపడుతున్నట్టే, వివి ప్రాణానికి కూడా ముప్పు ఉందని భయపడుతున్నాను. భీమా కోరేగాం కేసులో నిందితులు చాలా మంది ఆరోగ్యం సరిగ్గా లేదు, వాళ్లకు కోవిడ్–19 వచ్చే అవకాశం చాలా ఉంది. జైలులో వివికి సహాయపడిన వర్నన్ గోంజాల్వెస్‌కి మరింత ప్రమాదం ఉండవచ్చు. గౌతమ్ నవ్లాఖా, ఆనంద్ తేల్తుంబ్డే కూడా అదే జైలులో ఉన్నారు. కానీ కోర్టులు పదేపదే బెయిలు నిరాకరిస్తున్నాయి. గౌహతీలో ఖైదీగా ఉన్న అఖిల్ గోగోయ్‌కు కోవిడ్ టెస్ట్ పాజిటివ్ వచ్చింది.

ఎంత సంకుచితమైన, ఎంత క్రూరమైన, ఎంత అల్పమైన మేధస్సు గల ఏలుబడిలో ఉన్నాం మనం? తన సొంత రచయితలు, మేధావులని చూసి ఇంత భయపడడం ఈ విశాలమైన దేశపు ప్రభుత్వానికి ఎంత విషాదకరం?

**సంగీతం, కవిత్వం, ప్రేమ**

కొన్ని నెలల క్రితమే పరిస్థితులు నిజంగానే మారబోతున్నట్లు అనిపించింది. పౌరసత్వ సవరణ చట్టం (సిఎఎ), పౌరుల జాతీయ రిజిస్టర్‌కు (ఎన్ఆర్‌సి) వ్యతిరేకంగా లక్షలాది మంది వీధుల్లోకి వచ్చారు. ముఖ్యంగా విద్యార్థులు. చాలా ఉద్విగ్నభరితంగా ఉండింది. గాలిలో సంగీతం, కవిత్వం, ప్రేమ నిండిపోయాయి. ఒక విప్లవం కాకపోయినా, ఎట్టకేలకు కనీసం ఒక తిరుగుబాటు. నువ్వు చాలా సంతోషడి ఉండేవాడివి.

కానీ అదంతా ఘోరంగా ముగిసిపోయింది. ఫిబ్రవరిలో ఈశాన్య ఢిల్లీలో 53 మందిని ఊచకోత కోసారు. పూర్తిగా శాంతియుతమైన నిరసనలు చేసిన సిఎఎ వ్యతిరేక నిరసనకారులను ఆ ఊచకోతకు బాధ్యులుగా నిందిస్తున్నారు. అది సాయుధ ముఠాలు, చాలాసార్లు పోలీసుల మద్దతుతో పథకం ప్రకారం చేసిన దాడి అని వీడియోల్లో స్పష్టంగా తెలుస్తోంది. ఆ సాయుధ ముఠాలు కార్మికవర్గాల వాడల గుండా అల్లర్లు చేస్తూ, దహనాలు, హత్యలు చేస్తూ సాగిపోయాయి. ఆ ప్రాంతాల్లో కొంతకాలంగా ఉద్రిక్తత నెలకొని ఉంది, అందుకే స్థానిక ప్రజలు సిద్ధంగానే ఉన్నారు, ఎదురుతిరిగి పోరాడారు.

కాకపోతే ఎప్పటిలాగానే, బాధితులనే నేరస్తులుగా చిత్రీకరిస్తున్నారు. కోవిడ్ లాక్‌డౌన్ ముసుగులో, వందలాది మంది యువకులను, ముఖ్యంగా ముస్లింలను, అలానే చాలా మంది విద్యార్థులను ఢిల్లీలో, ఉత్తరప్రదేశ్‌లో అరెస్ట్ చేశారు. ఎలాంటి సాక్ష్యాలూ లేని సీనియర్

కార్యకర్తలను కేసుల్లో ఇరికించడానికి అరెస్ట్ చేసిన యువకులపై ఒత్తిడి చేస్తున్నారని వదంతులు వినిపిస్తున్నాయి.

ఇక ఫిక్షన్ రచయితలు మహత్తరమైన ఒక కొత్త కథ రాయడంలో బిజీగా ఉన్నారు. అమెరికా అధ్యక్షుడు ట్రంప్ ఢిల్లీలో ఉన్నప్పుడు ప్రభుత్వాన్ని ఇబ్బంది పెట్టడానికి ఒక గొప్ప కుట్రలో భాగంగా ఢిల్లీ ఊచకోత చేశారని వాళ్ల కథనం. పోలీసులు చెప్తున్న తేదీలను బట్టి చూస్తే ట్రంప్ పర్యటన ఖరారు కాకముందే ఆ ప్రణాళికలు వేసినట్లుగా ఉంది. అంటే సిఎఎ వ్యతిరేక కార్యకర్తలు వైట్ హౌస్ లో ఎంత లోతుగా పాతుకుపోయి ఉండాలి! ఇది ఎలాంటి కుట్ర? ప్రభుత్వానికి చెడ్డ పేరు తేవడానికి నిరసనకారులు తమను తాము చంపుకున్నారా?

అంతా తలకిందులుగా ఉంది. ఇక్కడ చంపబడటం నేరం. వాళ్లు నీ శవం పైన కేసు పెట్టి, నీ భూతాన్ని పోలీస్‌స్టేషన్‌కు హాజరవమంటారు. నేనిది రాస్తుండగానే, బీహార్ లోని అరారియా నుండి ఒక వార్త వచ్చింది. అక్కడ ఒక మహిళ తనపై సామూహిక అత్యాచారం చేశారని పోలీసులకు ఫిర్యాదు చేసింది. పోలీసులు ఆమెతో పాటు, ఆమెతో ఉన్న మహిళా కార్యకర్తలను అరెస్ట్ చేశారు.

ఇప్పుడు కలతపెట్టే విషయాలు ప్రతిసారీ రక్తపాతం, లించింగ్, ఊచకోతలు, అరెస్టులే కానవసరం లేదు. కొన్ని రోజుల క్రితం, అలహాబాద్‌లో కొందరు దుండగులు – ఒక ఇళ్ల వరుస మొత్తాన్ని బలవంతంగా కాషాయం రంగుతో స్ప్రే పెయింట్ చేసి, ఆపై యజమానుల ఇష్టానికి వ్యతిరేకంగా హిందూ దేవుళ్ల భారీ చిత్రాలతో వాటిని నింపేశారు. ఎందుకో గాని, ఈ విషయం నా వెన్నులో వణుకు పుట్టించింది.

నిజంగా, ఇండియా ఈ దారిలో ఇంకెంత దూరం వెళ్లనుందో నాకు తెలియదు.

నువ్వు జైలు నుండి బయటకు వచ్చినపుడు సమూలంగా మారిపోయిన ఒక ప్రపంచంలో అడుగుపెడతావు. కోవిడ్ –19, అనాలోచితంగా చేసిన లాక్‌డౌన్ ప్రజల జీవితాల్లో విధ్వంసం సృష్టించాయి. పేదలకు మాత్రమే కాదు, మధ్యతరగతి ప్రజలకు కూడా. హిందుత్వ దళాలతో సహా. 138 కోట్ల జనాభా ఉన్న దేశంలో నెలరోజుల పాటు దేశవ్యాప్తంగా కర్ఫ్యూ లాంటి లాక్‌డౌన్ ప్రకటించే ముందు కేవలం నాలుగు గంటల నోటీసు (రాత్రి 8 నుండి అర్ధరాత్రి వరకు) ఇవ్వడం నువ్వు ఊహించగలవా?

ప్రజలు, సరుకులు, యంత్రాలు, మార్కెట్లు, కర్మాగారాలు, పాఠశాలలు, విశ్వవిద్యాలయాలూ అక్షరాలా అన్నీ స్థంభించిపోయాయి. చిమ్నీలలో పొగ, రోడ్లపై ట్రక్కులు, వివాహాలలో అతిథులు, ఆసుపత్రులలో చికిత్స. ఏమాత్రం ముందస్తు నోటీసు లేకుండా. అతి గారాబం వల్ల చెడిపోయిన డబ్బున్నవాడి కొడుకు క్లాక్ వర్క్ బొమ్మకు కీ లాగేసినట్టు, ఈ భారీ దేశం మూసివేయబడింది. ఎందుకు? ఎందుకంటే వాడు చేయగలడు కాబట్టి.

కోవిడ్ –19 మన సమాజాన్ని పీడిస్తున్న కులం, వర్గం, మతం, లింగాలకు సంబంధించిన భారీ సంస్థాగత అన్యాయాలను బయటపెట్టే ఒక రకమైన ఎక్స్–రేగా పరిణమించింది. వైరస్ వ్యాపిస్తూ వృద్ధి చెందుతుంటే, సరైన ప్రణాళిక లేని లాక్‌డౌన్ వల్ల ఆర్థిక వ్యవస్థ దాదాపుగా కుప్పకూలిపోయింది. మనం ఒక గడ్డకట్టిన విస్ఫోటనంలో బతుకుతున్నట్లు అనిపిస్తుంది. మనకు తెలిసిన ప్రపంచం ముక్కలైపోయి, ఆ ముక్కలన్నీ గాలిలో వేలాడుతున్నాయి. అవి ఎక్కడ పడుతాయో, నిజంగా నష్టం ఎంత విస్తృతమైనదో ఇంకా తెలియదు.

కూడు, గూడు, డబ్బు, రవాణా లేని నగరాల్లో చిక్కుకున్న లక్షలాది మంది కార్మికులు వందల, వేల మైళ్ల దూరం తమ గ్రామాలకు నడిచివెళ్లారు. నడుస్తున్న వాళ్లని పోలీసులు కొట్టి అవమానించారు. వాళ్లు తరలిపోవడం చూస్తుంటే జాన్ స్టెయిన్బెక్ రాసిన 'ది గ్రేప్స్ ఆఫ్ రాత్' గుర్తుకు వచ్చింది. నేను ఈ మధ్యనే ఆ పుస్తకం మళ్లీ చదివాను. ఎంత గొప్ప పుస్తకం.

ఆ నవలలో (అది అమెరికాలో ఆర్థిక మాంద్యం సమయంలో జరిగిన భారీ వలసల గురించి రాసిన నవల) జరిగినదానికీ ఇప్పటికీ ఉన్న తేడా ఏమిటంటే, భారతదేశంలో ప్రజలలో పూర్తిగా ఆగ్రహమే లేనట్టు కనిపిస్తుంది. అప్పుడప్పుడు ఆగ్రహం చెలరేగుతుంది, కాదనను, కానీ అదేదీ పాలకులు నిలువరించ లేనిదైతే కాదు. అందరూ తమ పరిస్థితిని మారుమాట్లాడకుండా అంగీకరించడం వణుకు పుట్టిస్తోంది. ప్రజలు ఎంత విధేయులై ఉన్నారు? కష్టాలను ఓర్చుకోవడంలో, విధేయత చూపించడంలో ప్రజలు చూపించే అంతులేని ఈ ఓపిక పాలకవర్గాలకు (కులాలకు) హాయిగా ఉండవచ్చు. కానీ బాధను ఓర్చుకునే ఈ సామర్థ్యం ఒక వరమంటావా, శాపమంటావా? నేను దీని గురించి చాలా ఆలోచిస్తున్నాను.

లక్షల మంది శ్రామికవర్గ ప్రజలు తమ ఇళ్లకు లాంగ్‌మార్చ్ మొదలుపెట్టినప్పుడు, టీవీ ఛానెళ్లూ, ప్రధానస్రవంతి ప్రచారసాధనాలు అకస్మాత్తుగా "వలస కార్మికులు" అనే వాస్తవాన్ని కనుగొన్నాయి. విలేకరులు ప్రజల ముఖాల్లో మైక్రోఫోన్లను పెట్టి "మీరు ఎక్కడికి వెళుతున్నారు? మీ దగ్గర ఎంత డబ్బు ఉంది? మీరు ఎన్ని రోజులు నడుస్తారు?" అని అడుగుతుంటే, వాళ్ల దుస్థితిని చూసి ఎంతోమంది, కార్పొరేట్లు స్పాన్సర్ చేసిన మొసలి కన్నీళ్లు కార్చారు.

కానీ నువ్వూ, నీలా జైళ్లలో ఉన్న మిగిలిన వాళ్లూ, ఈ పేదరికాన్ని సృష్టించి, పర్యావరణాన్ని నాశనం చేసి, ప్రజలు గ్రామాలను విడిచిపోయేలా చేసిన ఈ యంత్రానికి వ్యతిరేకంగా ఎన్నో సంవత్సరాలు ఉద్యమించారు. మీరందరూ న్యాయం కోసం మాట్లాడుతుంటే – ఇవే టీవీ ఛానెల్స్, కొన్ని సందర్భాల్లో వీళ్లే జర్నలిస్టులూ, వ్యాఖ్యాతలూ – ఆ యంత్రాన్ని కీర్తించారు. వాళ్లు మిమ్మల్ని నిందించి, తూలనాడి, ముద్రలు వేశారు. వాళ్లు ఇప్పుడు మొసలి కన్నీళ్లు పెట్టుకుంటూ, భారతదేశ జిడిపి 9.5 శాతం పడిపోబోతోందని ఆందోళన చెందుతుండగా – మీరంతా జైలులో ఉన్నారు.

ఆ మొసలి కన్నీళ్లు కారుస్తూనే ఈ ప్రభుత్వం చేసే ప్రతీ విషయానికి మీడియాలో అదే పనిగా చప్పట్లు కొడుతారు. ఒకోసారి ఇక లేచి నిలబడి మరీ చప్పట్లు కొడతారు. లాక్‌డౌన్ సమయంలో నేను చదివిన మొదటి నవల వాసిలీ గ్రాస్‌మన్ రాసిన స్టాలిన్ గ్రాడ్. (గ్రాస్‌మన్ ఎర్ర సైన్యంతో ఫ్రంట్‌లైన్స్ లో ఉన్నాడు. అతని రెండవ పుస్తకం 'లైఫ్ అండ్ ఫేట్' సోవియట్ ప్రభుత్వం ఆగ్రహానికి గురయింది. ఆ పుస్తకం రాతప్రతి "అరెస్టు చేయబడింది" – అదేదో మనిషి అయినట్టు.) అది చాలా

సాహసోపేతమైన పుస్తకం, సృజనాత్మక రచనా తరగతులలో బోధించలేనటువంటి సాహసం అది.

ఇంతకీ, అది నాకు ఎందుకు గుర్తొచ్చిందంటే ఆ పుస్తకంలో, రష్యాలో యుద్ధంలో పాల్గొంటున్న ఒక సీనియర్ నాజీ సైనికాధికారికి, హిట్లర్ కి మధ్య జరిగిన సమావేశం గురించి అసాధారణమైన వివరణ ఉంటుంది. అప్పటికే యుద్ధంలో జర్మనీ పరిస్థితి బాగాలేదు. ఆ అధికారి ఆ సమావేశంలో హిట్లర్‌కు వాస్తవ పరిస్థితిని వివరించాల్సి ఉంటుంది. కానీ తీరా హిట్లర్‌ను ముఖాముఖి కలిసినప్పుడు, అతను ఎంత భయానికీ, ఉద్విగ్నతకూ గురి అవుతాడంటే అతని మెదడు పనిచేయకుండా పోతుంది. ఫ్యూరర్‌ను ప్రసన్నం చేసుకోవటానికి, అతను ఏది వినాలనుకుంటున్నాడో అదే చెప్పేట్టు అతని మెదడు పెనుగులాడుతుంది.

ఇప్పుడు మన దేశంలో అదే జరుగుతోంది. సంపూర్ణంగా సమర్థవంతమైన మెదళ్లు భయంతో, ముఖస్తుతి చేయాలనే కోరికతో గడ్డకట్టి పోతున్నాయి. మన సామూహిక మేధస్సు క్షీణిస్తోంది. నిజమైన వార్తలకు ఇక్కడ అవకాశం లేదు.

మరోవైపు కరోనా విపత్తు ఉధృతమవుతోంది. ప్రపంచంలో తీవ్రంగా ప్రభావితమైన దేశాల పోటీలో విజేతలైన దేశాలు, ఇరవై ఒకటవ శతాబ్దపు ముగ్గురు మేధావుల నేతృత్వంలో ఉండటం యాదృచ్ఛికం కాదు. మోడీ, ట్రంప్, బోల్సొనారో. ఢిల్లీ ముఖ్యమంత్రి (ప్రస్తుతం భారతీయ జనతా పార్టీ చుట్టూ తేనెటీగ లాగా తిరుగుతున్నాడు) అమరమైన వాక్యాల్లో చెప్పాలంటే, వాళ్ల నినాదం ఇప్పుడు : హమ్ అబ్ ఫ్రెండ్స్ హై నా? (మేము ఇప్పుడు దోస్తులం కదా?)

ట్రంప్ నవంబర్‌లో ఓడిపోయే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. కానీ భారతదేశంలో కనుచూపుమేరలో ఆశ కనిపించడం లేదు. ప్రతిపక్షాలు కుప్పకూలిపోతున్నాయి. నాయకులు భయపడిపోయి, నిశ్శబ్దంగా ఉన్నారు. ఎన్నికైన రాష్ట్ర ప్రభుత్వాలను కాఫీ పై నురుగులా ఊదేస్తున్నారు. రోజువారీ వార్తల్లో ద్రోహాలు, ఫిరాయింపులు ఆనందంగా నివేదించబడుతున్నాయి.

లంచాలు తీసుకొని అమ్ముడు పోకుండా ఆపడానికి ఎమ్మెల్యేలను హాలిడే రిసార్ట్స్ లోకి తోలి బంధించడం కొనసాగుతూనే ఉంది. అమ్మకానికి సిద్ధంగా ఉన్నవాళ్లను బహిరంగంగా వేలం వేసి ఎక్కువ వేలంపాట పాడినవాళ్లకు ఇచ్చేస్తే సరిపోతుందని నేనంటాను. నువ్వేమంటావు? వాళ్లు ఎవరికి ఉపయోగపడతారని? సరే వాళ్లని వదిలేద్దాం.

అసలు విషయాన్ని మాట్లాడుకుందాం: మనం ఒక్క-పార్టీ ప్రజాస్వామ్యంలో ఇద్దరు వ్యక్తులచే పాలించబడుతున్నాం. చాలామంది ఇది ఒక కాలం చెల్లిన వ్యవహారమని కూడా గ్రహిస్తున్నట్టు లేరు.

లాక్‌డౌన్ సమయంలో మధ్యతరగతి ప్రజలు చాలా మంది తాము జైలులో ఉన్నట్టుగా అనిపిస్తోందని ఫిర్యాదు చేశారు. కానీ ఆ మాటలు ఎంత అవాస్తవమో నీకు బాగా తెలుసు. వాళ్లు తమ కుటుంబాలతో ఇళ్లలోనే ఉన్నారు (అయితే అది, చాలామందిపై, ముఖ్యంగా మహిళలపై హింసగా పరిణమించింది). వాళ్లు తమ దగ్గరివారితో మాట్లాడుకో గలిగారు, వాళ్ల పనులు యధావిధిగా చేసుకోగలిగారు. వాళ్ల దగ్గర ఫోన్లు ఉన్నాయి. వాళ్లకు ఇంటర్నెట్ ఉంది. నీలాగా కాదు. కశ్మీర్ ప్రజల లాగా కాదు. గత ఏడాది ఆగస్టు 5న సెక్షన్ 370 రద్దు చేయబడి, జమ్మూ కశ్మీర్ రాష్ట్రం ప్రత్యేక హోదాను, రాష్ట్ర హోదాను కోల్పోయినప్పటి నుండి కశ్మీర్ ప్రజలు లాక్‌డౌన్ లో ఇంటర్నెట్ లేకుండా ఉన్నారు.

రెండు నెలల కోవిడ్ లాక్ డౌనే భారతదేశం ఆర్థిక వ్యవస్థకు ఇంత పెద్ద దెబ్బ అయితే, ఒక సంవత్సరం కన్నా ఎక్కువ కాలం ఇంటర్నెట్ లేకుండా సైనిక లాక్ డౌన్ ను భరించాల్సి వచ్చిన కశ్మీరీల గురించి ఆలోచించు. వ్యాపారాలు కుప్పకూలిపోతున్నాయి. వైద్యులు రోగులకు చికిత్స అందించలేక ఇబ్బంది పడుతున్నారు. విద్యార్థులు ఆన్‌లైన్ తరగతులకు హాజరు కాలేకపోతున్నారు. అలాగే, గత ఏడాది ఆగస్టు 5 లోపే వేలాది మంది కశ్మీరీలు జైలు పాలయ్యారు. అవి ముందస్తు – నిరోధక నిర్బంధాలు. ఎటువంటి నేరం చేయని వ్యక్తులతో నిండిన జైళ్లు ఇప్పుడు కోవిడ్ వ్యాధి ప్రేరక కేంద్రాలుగా మారుతున్నాయి. దాని గురించి ఏమనాలి?

సెక్షన్ 370 ని రద్దు చేయడం అహంకారంతో కూడిన చర్య. “ఒకేసారి శాశ్వతంగా” విషయాన్ని పరిష్కరిస్తామని ప్రగల్భాలు పలికినా, ఆ చర్య ఇప్పుడు ఆ ప్రాంతంలో ఒక గర్జిస్తున్న భూకంపాన్ని తెచ్చిపెట్టింది. పెద్దపెద్ద భూఫలకాలు కదులుతూ తమను తాము కొత్త స్థానాల్లోకి అమర్చుకుంటున్నాయి. తెలిసిన వాళ్లు చెప్పేదాన్ని బట్టి, చైనా పిఎల్ఎ సరిహద్దును దాటి, లదాఖ్‌లోని పలు చోట్ల, వ్యూహాత్మక స్థానాలను ఆక్రమించింది.

చైనాతో యుద్ధం అంటే పాకిస్తాన్‌తో యుద్ధానికి పూర్తి భిన్నమైన పరిస్థితి. అందుకే, మామూలుగా చేసే తొడ గొట్టడాలు అంత బలంగా లేవు. చర్చలు జరుగుతున్నాయి. ఇప్పటివరకైతే భారతీయ టీవీలో ఎలాగూ ఇండియానే గెలుస్తోంది. కానీ టీవీకి దూరంగా, ఒక కొత్త ప్రపంచ క్రమం తన ఉనికిని తెలియజేస్తోంది.

ఈ ఉత్తరం నేను అనుకున్న దానికంటే పెద్దదైపోతోంది. ప్రస్తుతానికి ఇక వీడ్కోలు చెప్తాను. ప్రియమైన మిత్రమా, ధైర్యంగా ఉండు. సహనంగా కూడా. ఈ అన్యాయం ఎప్పటికీ కొనసాగదు. ఆ జైలు ద్వారాలు తెరుచుకుంటాయి, నువ్వు మా దగ్గరకు తిరిగి వస్తావు. పరిస్థితులు ఎప్పటికీ ఇట్లా కొనసాగలేవు. అట్లా కొనసాగితే, మనం విచ్ఛిన్నమవుతున్న వేగం దానికదే ఒక కొత్త ఊపందుకుంటుంది. అప్పుడు మనం ఏమీ చేయవలసిన అవసరం లేదు.

అట్లా జరిగితే, అది మనం ఊహించలేని స్థాయిలో ఒక పెద్ద విషాదం అవుతుంది. కానీ బహుశా ఆ శిథిలాల నుండి సున్నితమైనదేదో, వివేకవంతమైనదేదో ఉద్భవించవచ్చు.

ప్రేమతో,

**అరుంధతి**

*(నాగపూర్‌లోని జైలులో అండా సెల్‌లో ఉన్న ప్రొ. జి.ఎన్. సాయిబాబాను ఉద్దేశించి ప్రఖ్యాత నవలా రచయిత్రి, సామాజిక కార్యకర్త అరుంధతీ రాయ్ 2020 జూలై 17న ఈ బహిరంగ లేఖ రాశారు.)*

*(ఇంగ్లిష్ నుంచి అనువాదం చైతన్య చెక్కిళ్ల, అమెరికాలో వైద్యులు, రచయిత)*

వీ

# రాజస్థాన్ రాజకీయంలో ప్రజా తీర్పేది?

***ప్రజాస్వామ్య వ్యవస్థలో ఓట్ల ద్వారా ఎన్నికైన ప్రజా ప్రతినిధులు తమను గెలిపించిన ప్రజలను పట్టించుకోకపోవడం, పదవుల కోసం, డబ్బు కోసం అమ్ముడుపోవడంతో ఎన్నికల వ్యవస్థపై ప్రజలకు విశ్వాసం పోతోందని అంటున్నారు కె. మహేష్***

ఎన్నికల ప్రజాస్వామ్యంలో ప్రజల ఓటు తీర్పే అత్యున్నతం. అధికారంలోని ప్రభుత్వాన్ని దించేయాలన్నా? కొనసాగించాలన్నా అంతిమ నిర్ణేతలు ఓటర్లే. ప్రజలు ఓటు ద్వారా కోరుకున్న పార్టీ, రాజకీయ శిబిరమే అధికారాన్ని చేపట్టాలి, పాలన సాగించాలి. ఈ ప్రజాస్వామ్య పండుగ (పోలింగ్) లో అందరూ పాల్గొంటేనే తీర్పుకు అధిక ప్రాధాన్యత దక్కుతుంది. ప్రజల ఓట్లతో గెలిచిన మొత్తం చట్టసభ్యుల సంఖ్యలో సగానికి ఎక్కువ బలం ఉన్న పార్టీ అధికార పీఠాన్ని అధిరోహిస్తుంది. కానీ, నేడు మనదేశంలో ఓటర్ల తీర్పుకు సంబంధం లేకుండా అధికారాన్ని చేపడుతున్న ఉదంతాలు బహిరంగంగా కనిపిస్తున్నాయి.

ఓటర్ల తీర్పుకు విలువకడుతున్న చందంగా హార్స్ ట్రేడింగ్ ఇప్పుడు సాధారణ పదంగా మారింది. బేరసారాలు, ప్రభుత్వాన్ని కూల్చేకుట్రలు, పార్టీ ఫిరాయింపులు, సొమ్ము చెల్లించి చట్టసభ్యుల రాజీనామాలకు పురికొల్పడం, ఇతరత్రా ప్రలోభాలు ఇవన్నీ రాజకీయంలో సర్వసాధారణం అన్న దశకు చేరుకున్నాం. ఉన్నట్టుండి ప్రతిపక్షంలోని పార్టీ అధికారాన్ని హస్తగతం చేసుకుంటుంది. ఎంఎల్ఏల తిరుగుబాటు, ఫిరాయింపులని ఓ పక్షం రోజులపాటు హైరానా ఉంటుంది. అనంతరం, చట్టబద్ధంగా ఎన్నుకున్న తాము ప్రజలను పాలించడానికి అధికారాన్ని చేపడుతున్నట్టు ప్రమాణాలు చేస్తారు. తర్వాత శరామామూలే. లేదా అధికార పక్షమే అప్రమత్తమై ముప్పును తప్పించుకుంటుంది. ఇలాంటి ఉదంతాలు ప్రజా తీర్పును అపహాస్యం చేస్తున్నవి. అసలు ప్రజలిచ్చిన తీర్పుకు అధికారంలోని కూటమికి ఏమైనా పొంతన ఉన్నదా అనే అనుమానాలను కలిగిస్తున్నాయి.

ఇటీవలే మధ్యప్రదేశ్‌లో ఇలాంటి పరిణామమే ముందుకొచ్చింది. అధికార కాంగ్రెస్ నుంచి జ్యోతిరాదిత్య సింధియా తిరుగుబాటు చేశారు. తన వర్గీయులతో బిజెపిలో కలవగా కాంగ్రెస్ సర్కారు గద్దెదిగాల్సి వచ్చింది. అధికారంలోకి వచ్చిన బిజెపి ప్రభుత్వంలో జ్యోతిరాదిత్య సింధియా వర్గీయులకు క్యాబినెట్‌లో కీలక పదువులు దక్కగా, సింధియా ఇటీవలే రాజ్యసభ బిజెపి సభ్యుడిగా ప్రమాణ స్వీకారం తీసుకున్నారు.

ఈ పరిణామాలన్ని రాజకీయాలు సెటిల్‌మెంట్ స్థాయికి దిగజారాయన్న కలతను కలుగజేశాయి. ప్రజలు ఓట్లేసి గెలిపిస్తే చాలు తర్వాత వారి నిర్ణయానికి విలువే లేదన్నట్టుగా ఉంటుందీ వ్యవహారం.

ఇప్పుడు రాజస్థాన్‌లోనూ ఇటువంటి పరిస్థితులే కనిపిస్తున్నాయి. ప్రజల కోసం ఎన్నికైన రాజస్థాన్ చట్టసభ్యులు నేడు ప్రజల యోగక్షేమాలను గాలికొదిలేశారు. అధికారంలోని కాంగ్రెస్‌లో అంతర్గత కుమ్ములాటలు రచ్చకెక్కి స్వప్రయోజన రాజకీయాలు బహిరంగమయ్యాయి. పదవి, ప్రాధాన్యతల కోసం ఓ వర్గం తిరుగుబాటు చేస్తే అధికారాన్ని కాపాడుకునే ప్రయత్నాల్లో సర్కారు ఉన్నది. కాగా, ఎప్పుడు ఛాన్స్ దొరుకుతుందా? అని బిజెపి వేచిచూస్తున్నది. ఇదే అదును అనుకోని బీఎస్పీ కూడా రంగంలోకి దిగింది. కరోనా కట్టడి చర్యలపైనా కాకుండా ఈ పార్టీల ప్రధాన దృష్టి నేడు రాజకీయ చదరంగంపైనే ఉన్నది.

**రాజస్థాన్ రాజకీయ పరిణామాలు..**

2018లో రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలకు ముందు చురుకుగా వ్యవహరించి కాంగ్రెస్ గెలుపునకు ఓ మేరకు కారకుడైన సచిన్ పైలట్ సానుకూల ఫలితాలు రావడంతో ముఖ్యమంత్రి పదవిపై ఆశలు పెట్టుకున్నాడు. కానీ, సీనియర్‌లనే నమ్మిన కాంగ్రెస్ అధిష్ఠానం అశోక్ గెహ్లాట్‌ను సీఎం చేసింది. రాజస్థాన్ పిసిసి ప్రెసిడెంట్ పదవిని పొడిగిస్తూ డిప్యూటీ సీఎం పదవినిచ్చి సచిన్‌ను సంతృప్తి పరిచింది. కానీ, ఆది నుంచీ గెహ్లాట్, పైలట్‌ల మధ్య పొసగలేదు. సీఎం కుర్చీ రేసులో ప్రత్యర్థులైన వీరు సర్కారు ఏర్పడిన తర్వాత కూడా అదే ధోరణితో మెలిగారు.

ఇటీవలే జరిగిన రాజ్యసభ ఎన్నికల సందర్భంలో కాంగ్రెస్ ఎంఎల్ఏల కొనుగోలుకు బిజెపి యత్నించిందని, అందులో సొంతపార్టీ నేతల హస్తమున్నదని సీఎం, హోం మంత్రి అయిన అశోక్ గెహ్లాట్ భావించి దర్యాప్తునకు ఆదేశించారు.

ఈ కుట్రపై విచారణలో భాగంగా స్పెషల్ ఆపరేషన్ గ్రూపు సచిన్ పైలట్‌కు తాఖీదులు పంపడంతో వీరిద్దరి మధ్య అసంతృప్తి బద్దలైంది. ఈ నోటీసులతో సచిన్ పైలట్ బహిరంగంగానే అశోక్ గెహ్లాట్‌పై తిరుగుబాటు చేశాడు. హర్యానాలోని గురుగ్రామ్‌లో ఓ హోటల్‌లో తన వర్గం ఎంఎల్ఏలను తరలించాడు. తనతో 30 మంది ఎంఎల్ఏలు ఉన్నారని, అశోక్ గెహ్లాట్ సర్కార్ మైనార్టీలో పడిందని ప్రకటించాడు. దీంతో సచిన్‌ను శాంతపరచడానికి కాంగ్రెస్ ప్రయత్నాలు చేసింది. ఢిల్లీ నుంచి కాంగ్రెస్ దూతలూ రంగంలోకి దిగి ప్రయత్నాలు చేశారు. రెండు సార్లు శాసనసభాపక్ష సమావేశాన్ని నిర్వహించి ఆహ్వానించారు. అయినా సచిన్ వెనక్కి రాకపోవడంతో స్పీకర్ ద్వారా అనర్హత నోటీసులు జారీ చేయించారు. దీనిపై సచిన్ వర్గం వివరణ ఇవ్వకుండా నేరుగా రాజస్థాన్ హైకోర్టును ఆశ్రయించింది. అనర్హత నోటీసులపై రెబల్ ఎంఎల్ఏల వివరణకు గడువును పెంచుతూ రెండు సార్లు హైకోర్టు ఆదేశాలివ్వగా, స్పీకర్ సి.పి. జోషి సుప్రీంకోర్టును ఆశ్రయించారు. కానీ, రెండు న్యాయస్థానాల్లోనూ కాంగ్రెస్‌కు ప్రతికూల ఆదేశాలే వచ్చాయి. దీంతో

# ఆధిపత్య వ్యవస్థ సృష్టి వికాస్ దుబే

*రాజకీయ వ్యవస్థే దుబేలను పెంచి పోషిస్తూ, దానికి అడ్డు వచ్చినప్పుడు మాత్రం వారిని ఎన్‌కౌంటర్ల పేరుతో హతమారుస్తుందనీ, వ్యవస్థ మార్పే వీటికి పరిష్కారమనీ అంటున్నారు* **ఎం.కె. కుమార్**

వికాస్ దుబేని పోలీసులు చంపేశారు. ఈ విషయం అందరికీ తెలుసు. కరుడు గట్టిన నేరస్థుడు, అరెస్టు చేయడానికి వచ్చిన పోలీసులనే చంపిన వ్యక్తిని చంపడంలో తప్పులేదని మెజారిటీ ప్రజలు భావిస్తున్నారు. ఇక్కడ రెండు అంశాలు ఉన్నాయి. పోలీసులు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకోవడం. రెండోది. వికాస్ దుబేకి అండగా ఉన్న రాజకీయ నేతల వివరాలు బయటకు రాకుండా అతన్ని చంపడం. వ్యవస్థ తన ఆధిపత్య చెలామణి కోసం తయారు చేసుకున్న వికాస్ దుబే లాంటి నేరస్థులను తన అవసరం తీరిన తర్వాత చంపివేస్తుందని చరిత్ర మరోమారు రుజువు చేసింది. తెలంగాణలో నయీం విషయంలోను ఇదే జరిగింది. నయీం అరాచకాలను ప్రోత్సహించిన, తమ స్వంత అక్రమ పనులు అతని ద్వారా నెరవేర్చుకున్న రాజకీయ నేతల, బ్యూరాక్రాట్ల వివరాలు ఇప్పటికీ సమాజానికి తెలియరాలేదు. వికాస్ దుబే ఇక ఎంత మాత్రం తమకు పనికిరాడని, లేదా తమకే కొరకరాని కొయ్యగా తయారయ్యాడనే ఆలచనతోనే అధికార పార్టీ ప్రభుత్వ అండదండలతోనే వికాస్ దుబే హత్య జరిగింది. ఈ సంఘటన నేపథ్యంలో ప్రజాస్వామ్య వ్యవస్థ పేలవమైన పనితీరును, చట్టం నిరుపయోగంగా మారడాన్ని మరోసారి నిరూపించబడింది. యోగీ ప్రభుత్వం అంటేనే ఎన్‌కౌంటర్‌ల ప్రభుత్వమని దేశవ్యాప్తంగా ప్రజలు బలంగా విశ్వసిస్తున్నారు. అలాగే ఉండాలని మధ్యతరగతి కోరుకుంటోంది.

**వికాస్ దుబే ఎవరు?**

2001లో దుబే, యుపిలో రాష్ట్ర ర్యాంక్ మంత్రి, సంతోష్ శుక్లా,

---

రాజకీయ వేదికగానే సమస్య పరిష్కరించుకోవాలని కాంగ్రెస్ యోచించింది. ఫలితంగా సుప్రీంకోర్టు నుంచి స్పీకర్ పిటిషన్‌ను ఉపసంహరించుకున్నారు. తమకు మెజార్టీ బలమున్నదని గెహ్లాట్ ఫ్లోర్ టెస్టుకు ప్రభుత్వం సిద్ధమైంది. దాని కోసం అసెంబ్లీని సమావేశపరచాలని సీఎం గెహ్లాట్ గవర్నర్ కల్‌రాజ్ మిశ్రాకు ప్రతిపాదన పంపారు. కానీ, 'పై నుంచి' ఒత్తిళ్ల కారణంగా గవర్నర్ మిశ్రా వీలైనంత జాప్యాన్ని చేశారు. అసెంబ్లీ నిర్వహణ కోసం సీఎం గెహ్లాట్ మూడు సార్లు ప్రతిపాదించగా, మూడు సార్లూ గవర్నర్ తిరస్కరించారు. అసెంబ్లీ సమావేశాలు ఏర్పాటు చేయాలని సీఎం క్యాంపు రాజ్‌భవన్‌లో సుమారు ఐదు గంటలపాటు ధర్నాకు దిగారు. చివరికి ఆగస్టు 14 నుంచి సమావేశానికి గవర్నర్ మిశ్రా ఆమోదం తెలిపారు.

**బహిరంగంగా ఎంఎల్ఏల ధరలు..**

సచిన్ పైలట్ తిరుగుబాటు సమయంలో ఒక్క కాంగ్రెస్ ఎంఎల్ఏకు రూ. 15 కోట్ల ఎర వేస్తున్నారని సీఎం గెహ్లాట్ తెలిపారు. పెద్ద మొత్తంలో ప్రలోభపెట్టి బిజెపి తన సర్కారును కూల్చే కుట్ర చేస్తున్నదని ఆరోపించారు. ఎంఎల్ఏల రేట్లు ముందుగా ఫస్ట్ ఇన్‌స్టాల్‌మెంట్‌గా పది కోట్లు, సెకండ్ ఇన్‌స్టాల్‌మెంట్‌గా రూ. 15 కోట్లుగా ఉండేవని వ్యాఖ్యానించారు.

అసెంబ్లీ సమావేశాలకు గ్రీన్ సిగ్నల్ వచ్చిన తర్వాత ఈ రేట్లు భారీగా పెరిగాయని తెలిపారు. ఇప్పుడు ఎంత కావాలో చెప్పండి అని అడుగుతున్నారని చెప్పారు. ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి ఎంఎల్ఏల రేట్లు ఇలా ఉన్నాయని బహిరంగంగా ప్రకటించడం ప్రస్తుత పరిస్థితుల తీవ్రతను తెలుపుతున్నాయి.

ఎంఎల్ఏలను రీసార్టులు, హోటల్‌కు తరలించి కాపాడుకునే పరిస్థితులు ఓటర్లకు ఎటువంటి సంకేతాలనిస్తాయి? తమ ప్రతినిధి అంగడిలో సరుకయ్యాడని భావిస్తే ఎన్నికలపై విశ్వాసం ఎన్నాళ్లుంటుంది? ఎన్నికల్లో ప్రలోభాలు, రిగ్గింగ్, నకిలీ ఓట్లు, ఈవీఎం ట్యాంపరింగ్‌లు.. తీరా తమ అభ్యర్థి గెలిచి అసెంబ్లీకి చేరుకున్నాక ఎంఎల్ఏల బేరసారాలు. రాజ్యాంగబద్ధ పదవిలో ఉండి గవర్నర్‌లు 'కేంద్ర' ఏజెంట్లుగా మారడం, రాష్ట్ర క్యాబినెట్ అభ్యర్థననూ ఎలాంటి జంకు లేకుండా తిరస్కరించడం.. ఇలా రాజస్థాన్ పరిణామాలు మరోసారి వికృత రాజకీయాలను, రాజ్యాంగంపై దాడిని స్పష్టం చేశాయి.

రాజస్థాన్‌లో 2018 చివరలో అసెంబ్లీ ఎన్నికలు జరిగాయి. అప్పుడు నమోదు చేసుకున్న ఓటర్లు సుమారు 4.77 కోట్ల మంది వరకు ఉన్నారు. కానీ, ఆ ఎన్నికల్లో ఓటేసినవారు 3.57 కోట్ల మంది. అంటే రాష్ట్రంలో అధికారాన్ని నిర్ణయించే ప్రక్రియలో సుమారు 74.72 శాతం ఓటర్లు పాల్గొన్నారు. మిగతావారు ప్రస్తుత రాజకీయపార్టీలపై నమ్మకం సడలడం వల్లనో, వ్యవస్థపై విసుగుపుట్టో, ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా తమ బతుకులు మారబోవనో లేదా వ్యక్తిగత కారణాల వల్లనో పోలింగ్‌లో పాల్గొనలేదు.

74.72 శాతంలో సుమారుగా 40 శాతం మంది ఓట్లు పడిన కాంగ్రెస్ (100 సీట్లతో) ఇతర చట్టసభ్యుల మద్దతుతో అధికారాన్ని చేపట్టింది. ఈ ప్రభుత్వమూ ప్రస్తుత కరోనా ఆపత్కాలంలోనూ ప్రజల యోగక్షేమాలపై కాకుండా అంతర్గత కుమ్ములాటలోనే మునిగిపోయవడం విషాదకర పరిణామం.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)* వీ

కాన్పూర్ దేహాట్‌లోని శివలి పోలీస్ స్టేషన్‌లోపల ఉన్న బిజెపి నాయకుడిని వెంబడించి, పగటిపూట కాల్చి చంపాడు. నాలుగేళ్ల తరువాత అతన్ని నిర్దోషిగా ప్రకటించారు. 1999లో, దుబే తన గ్రామంలో ఒక జున్నా బాబాను చంపి అతని భూమి, ఇతర ఆస్తులను స్వాధీనం చేసుకున్నాడు. 2000లో, అతను తన గురువు, స్థానిక తారా చంద్ ఇంటర్ కాలేజీ రిటైర్డ్ ప్రిన్సిపాల్ హత్య కేసులో నిందితుడు. జైలు శిక్ష కూడా దుబే అనుభవించాడు. 2006లో ఇచ్చిన ఇంటర్వ్యూలో, దుబే తాను 10 సంవత్సరాలు బిక్రూ గ్రామానికి ప్రధాన్ అని చెప్పాడు. ఆ తరువాత అతను జిల్లా పంచాయతీలో సభ్యుడయ్యాడని చెప్పాడు. అతని తమ్ముడు పొరుగున ఉన్న భీతి గ్రామానికి చెందిన గ్రామ ప్రధాన్ పదవికి పోటీ లేకుండా ఎన్నికయ్యాడని చెప్పాడు. అతని సోదరుడి భార్య అప్పుడు జిల్లా పంచాయతీ సభ్యురాలు. అతని సోదరుడు బిక్రూ గ్రామానికి ప్రధాన్ అయ్యాడు.

**దుబేకు, పోలీసులకు మధ్య సంబంధాలు**

దుబేకు, స్థానిక పోలీస్ స్టేషన్ అధిపతి మధ్య సంబంధాలున్నాయని డిప్యూటీ ఎస్పీ దేవేంద్ర కుమార్ మిశ్రాపై అధికారులకు లేఖ రాశాడు. లేఖ నేపథ్యంలో జూలై 7న తివారీని మొరాదాబాద్ సెక్టార్‌లోని ప్రావిన్షియల్ ఆర్మ్డ్ కాన్స్టాబులరీ (పిఎసి) కు బదిలీ చేశారు. జూలై 3న బిక్రూ గ్రామంలో జరిగిన దాడిలో మరణించిన ఎనిమిది మంది పోలీసులలో మిశ్రా కూడా ఉన్నాడు. తీవ్రమైన సంఘటన గురించి హెచ్చరించిన లేఖను అధికారిక రికార్డులలో పొందుపరచలేదు.

అలాగే చౌబేపూర్ స్టేషన్ అధికారి, వినయ్ తివారీ, సబ్ ఇన్‌స్పెక్టర్ కృష్ణ కుమార్ శర్మలను కుట్ర ఆరోపణలపై అరెస్టు చేశారు. ఈ వారం ప్రారంభంలో, చౌబేపూర్ పోలీస్ స్టేషన్‌లో పోస్ట్ చేసిన 68 మంది సిబ్బందిని తొలగించారు. స్థానిక చౌబేపూర్ పోలీస్ స్టేషన్‌తో పాటు, దుబేకి కాన్పూర్ నగర్‌లోని శివరాజ్పూర్, బిల్హౌర్, బీతూర్ పోలీస్ స్టేషన్లు, కాన్పూర్ దేహాట్‌లోని శివలి పోలీస్ స్టేషన్‌లలో పోలీసు సిబ్బందితో సంబంధాలు ఉన్నట్లు తెలిసింది.

2001లో, బిజెపి నాయకుడుని కాలిస్తే, ఆ రైఫిల్ లైసెన్స్ ఈ రోజు వరకు రద్దు చేయబడలేదు. నాలుగు సంవత్సరాల తరువాత, దుబే నిర్దోషిగా ప్రకటించబడ్డాడు. చివరకు మంత్రి వ్యక్తిగత సిబ్బంది దుబేకు అనుకూలంగా ప్రకటనలు ఇచ్చారు. చౌబేపూర్ పోలీస్ స్టేషన్‌లో దుబేపై 62 కేసులు, ఐదు హత్య కేసులు, ఎనిమిది హత్యాయత్న కేసులు ఉన్నాయి. అన్ని కేసులను లాగ్‌లో పేర్కొనలేదు. అతనిపై కేసులు ఉన్నప్పటికీ, రాష్ట్రంలోని టాప్ 25 నేరస్థులలో దుబే ఎప్పుడూ జాబితా చేయలేదు.

**బలౌతున్న పోలీసులు**

పోలీసు వ్యవస్థను ఆధిపత్య శక్తులు వినియోగించుకోవడం వల్ల కింది స్థాయి పోలీసులు తమ ప్రాణాలను కోల్పోవాల్సి వస్తోంది. ప్రపంచ పోకడలకు విరుద్ధంగా, పోలీసులచే చంపబడిన పౌరుల సంఖ్య కంటే రెండు రెట్లు ఎక్కువ మంది పోలీసులు విధుల్లో మరణించారు. పోలీసు మరణాలలో ఎక్కువ భాగం నేరస్థుల చేతిలోనే జరగలేదు. పై అధికారుల నిర్లక్ష్యం, పని పరిస్థితుల ఫలితంగా ఎక్కువ మంది చనిపోయారు. సమాజం బహిరంగంగా హింసను ప్రదర్శిస్తుందని వారు గుర్తించడం లేదు. హింసారూపక నిర్మాణాలలో వ్యవస్థ చిక్కుకుపోతుందని వారు గ్రహించడం లేదు. అదే సమయంలో వారు చట్ట కట్టుబాటుకు వెలుపల పనిచేయడానికి ఇష్టపడుతున్నారు. అందుకే నైతిక కోణంలో పోలీసులు అట్టడుగున ఉన్నారు. రాజకీయ కార్యకలాపాలకు కేంద్రంగా, వారి స్వంత అవసరాలకు అనుగుణంగా పోలీసు వ్యవస్థను నడిపించుకుంటు న్నారు. అందువల్ల వారు తమ సొంత శ్రేయస్సును డిమాండ్ చేయలేరు. అందుకే పోలీసులు నేరమయ వ్యవస్థ, ఆధిపత్య శక్తుల మధ్య చిక్కుకు పోతున్నారు.

1947, 2019 మధ్య 35,000 మందికి పైగా పోలీసు సిబ్బంది విధి నిర్వహణలో ప్రాణాలు కోల్పోయారని డేటా సూచిస్తుంది. ఐఐఎం రోహ్తక్ పరిశోధకుల బృందం ఇంటర్వ్యూలు నిర్వహించింది. కానిస్టేబుల్, ఐజి ర్యాంకుల హౌదాలో వున్న 104 మంది పోలీసు సిబ్బందితో సంభాషించింది. పోలీసులు ఎక్కువ మంది చనిపోవడానికి గల కారణాలను ఈ బంద సభ్యులు అడిగి తెలుసుకున్నారు. వారి నివేదికలోని అంశాలను పరిశీలిద్దాం.

మొదట, సరియైన శిక్షణ లేకపోవడం వల్లే పోలీసు సిబ్బందిలో అధిక ప్రమాద రేటుకు ముఖ్యమైన కారణమని నివేదిక తెలిపింది. 2019లో భారతదేశంలో పోలీసింగ్ స్థితిపైలోక్నీటి –సిఎస్‌డిఎస్ నిర్వహించిన మరో అధ్యయనం కూడా ఈ ఫలితాలకు మద్దతు ఇస్తోంది. గత ఐదేళ్లలో కేవలం 6.4 శాతం పోలీసు కానిస్టేబుళ్లు మాత్రమే శిక్షణ పొందారు. ఈ సంఖ్య రాను రాను ప్రతి ఏటా తగ్గిపోతోంది. వారికి చట్టాల పట్ల, సమాజం పట్ల, నేరస్తుల పట్ల సరియైన శిక్షణ ఇవ్వకపోవడం వల్ల, అది పోలీసు సిబ్బంది కార్యాచరణ సామర్థ్యం ప్రభావితమై ఉండవచ్చని నివేదికలు తెలుపుతున్నాయి. అధికారంలో ఉన్న ఆధిపత్య శక్తులు తన అక్రమ కార్యాకలాపాలకు నేరస్థులను ఉపయోగించుకోవడం సర్వసాధారణం. అయితే ఆధిపత్య శక్తుల నేరస్థుల మధ్య పంపకాలలో, పెత్తనంలో వస్తున్న తేడాలు చివరకు సాధారణ పోలీసులను బలి తీసుకుంటోంది.

రెండవది, పోలీసు సిబ్బంది రోజులో ఎక్కువ సేపు పనిచేయాల్సి వస్తుంది. అలసటకు వారు ఎక్కువగా గూరౌతున్నారు. పోలీసు సిబ్బంది, సగటున, రోజుకు 13 నుండి 14 గంటలకు పైగా విధుల్లో ఉంటారు. అలసట, ప్రతిచర్య సమయం, శ్రద్ధ, దృష్టి, పరిస్థితుల పట్ల అవగాహన అనేది వారిని తీవ్ర వత్తిడికి గురిచేస్తోంది.

పోలీసు సిబ్బందిలో అధిక ప్రాణనష్టానికి ఒత్తిడి మరొక ముఖ్యమైన కారణం. ఉద్యోగ ఒత్తిడి, పరిస్థితుల ఒత్తిడి రెండూ వారి ప్రాణాలను బలిగొంటున్నాయి. కింది స్థాయి సిబ్బంది తరుచుగా పై అధికారుల నిరంకుశ వైఖరి వల్ల విధి నిర్వహణలోనే తుపాకీతో కాల్చుకుని ఆత్మహత్యలకు పాల్పడ్డ సంఘటనలు తరుచుగా జరగుతున్నాయి.

**బూటకపు ఎన్‌కౌంటర్‌లకు పేరుమోసిన యోగి**

పోలీసులు వికాస్ దుబేని చంపడం, దానికి దారితీసిన సంఘటనల క్రమం వల్ల ఉత్తర్‌ప్రదేశ్‌లో పాలనపై మరోమారు దృష్టి సారించాలి. పోలీసు సంస్కరణల గురించి యూపీలో మాట్లాడక పోవడమే మంచిది.

ఉత్తర్‌ప్రదేశ్‌లో ఆదిత్యనాథ్ రాజకీయ పాలన ప్రత్యేకమైనది. అనేక భారతీయ రాష్ట్రాలు శిక్షార్హమైన చర్యలను సహించవు. చట్ట నియమాల ప్రకారం నడుచుకునే ప్రయత్నం చేస్తాయి. ఆదిత్యనాథ్ పాలనను స్పష్టంగా, సైద్ధాంతికంగా 'ఎన్‌కౌంటర్ రాజ్' అని పిలుస్తారు. దీనికి ముఖ్యమంత్రికి ఆపాదించబడిన ఒక ప్రకటనను చూద్దాం. "అగర్ అప్రాద్ కరెంగే తో ఠోక్ దియే జాయేంగే." (మీరు గనక నేరం చేస్తే మిమ్మల్ని చంపేస్తాం.)

సిఏఏ వ్యతిరేక నిరసనలను అరికట్టడానికి ప్రభుత్వం ప్రయత్నించిన విధానాలు ప్రజలను భయపెట్టాయి. చట్టబద్ధమైన మద్దతు లేని, అపరాధ భావన లేని మార్గాల్లో ప్రజల ఆస్తులను ఏకపక్షంగా అటాచ్ చేశారు. యుపిలో పోలీసు హింసపై స్వతంత్ర జర్నలిస్ట్ నేహా దీక్షిత్ ఒక నివేదికను ప్రచురించారు. ప్రభుత్వ దరకత్వంలోనే ఫిబ్రవరి 2018 నాటికి కూడా, యుపి పోలీసులు నెలలో నాలుగు ఎన్‌కౌంటర్లు చేస్తున్నారు. ఈ ఎన్కౌంటర్ లలో 40 మంది వరకు మరణిస్తున్నారు. కొన్ని చట్టాలను ఉపయోగించడం ద్వారా స్వల్ప జరిమానా విధిస్తున్నట్లుగా ప్రభుత్వం చెపుతోంది. యుపి ప్రభుత్వం వివిధ రకాల నేరాలకు వ్యతిరేకంగా జాతీయ భద్రతా చట్టాన్ని అమలు చేస్తున్నట్లు కనిపిస్తోంది. ప్రభుత్వ హింసను మాత్రం క్రమంగా పెంచుతోంది.

చట్టాన్ని పోలీసులు తమ చేతుల్లోకి తీసుకుని తక్షణ న్యాయాన్ని ప్రజలకు అందిస్తున్నారని ప్రభుత్వమే చెపుతోంది. తక్షణ న్యాయం పేరిట ఒక వ్యవస్థను సృష్టించడం యోగి సైద్ధాంతిక విజయానికి ఉపయోగ పడుతుందని ఆయన విశ్వసిస్తున్నాడు.

**వ్యవస్థ నిర్మాణంలో భాగమే దుబే**

వికాస్ దుబే హత్యకు ఇక్కడ ఒక నిర్దిష్ట సైద్ధాంతిక సందర్భం కూడా ఉంది. యుపి రాజకీయాల ప్రాధాన్యత, భయానకత్వం రెండింటినీ ప్రతిబింబించే ఒక రకమైన గ్యాంగ్‌స్టర్ దుబే కనిపిస్తాడు. అతను ఎనిమిది మంది పోలీసులను చంపడమే కాక, అనేక ఘోరమైన నేరాలకు పాల్పడ్డాడు. కానీ అతను ఒక సామాజిక, రాజకీయ శక్తి నిర్మాణంలో భాగం. రాజకీయ పాలనలో చట్ట పాలన కోసం డిమాండ్ క్రూరత్వంగా పరిగణించబడుతుంది. ప్రతీకారం మానవీకరణగా పరిగణించ బడుతుంది. ఈ హత్యపై ఉత్తర్‌ప్రదేశ్‌లోని ప్రజాస్వామిక వాదులందరు నిద్రపోయే అవకాశం లేదు.

వికాస్ దుబే జీవితం, ఎదిగిన తీరు, ప్రభుత్వ అధికారాన్ని అణగదొక్కడాన్ని సూచిస్తుంది. పోలీసు బలగాలను రాజకీయం చేస్తుంది. మొదటిది, చట్టవిరుద్ధమైన హత్యలకు ఉదార ప్రజాస్వామ్యంలో స్థానం లేదు. రెండవది, అటువంటి సందర్భాలలో పోలీసులు చెప్పే సాధారణ సాకులు నమ్మబుద్ధిగా ఏ మాత్రం వుండవు. పోలీసులు తమ సహచరులు చంపబడటం పట్ల తమ నిరాశను వ్యక్తం చేయడం సాధారణమే. అదే క్రమంలో న్యాయవ్యవస్థపై తమకు నమ్మకం లేకపోవడాన్ని పోలీసులు దుబే హత్య ద్వారా చూపించారు. న్యాయ బలహీనతను సాకుగా యోగి సర్కార్ చూపిస్తుంది. న్యాయ బలహీనత వెనుక సాధారణంగా రాజకీయ హస్తం ఉంటుంది. దుబేకు రాజకీయ నాయకులతో ఉన్న సంబదాల విషయంలో ప్రస్తుత యుపి ప్రభుత్వంకు ఏ మాత్రం ఆసక్తి లేదు. ఆదిత్యనాథ్‌కు కొన్ని పౌర సమాజాలు బలమైన మద్దతుగా ఉన్నాయి. సామాజిక సమస్యలు శాంతిభద్రతల సమస్య కాదు.

**నమ్మకాన్ని కోల్పోయిన పోలీసు వ్యవస్థ**

ప్రజల దృష్టిలో పోలీసు వ్యవస్థ అత్యంత అపనమ్మకం కలిగిన సంస్థలలో ఒకటి. పోలీసు సంస్కరణలు ప్రజల్లో మరింత నమ్మకాన్ని సృష్టిస్తుందని అనుకోవచ్చు. ప్రజలకు తక్కువ స్థాయి నమ్మకం ఉన్నప్పుడు, పోలీసులను మరింత శక్తివంతం చేయడం సరికాదు. పోలీసు వ్యవస్థలో సంస్కరణలు అణచివేతకు ఎక్కువ అధికారాలను ఇస్తున్నాయి. పోలీసులను ప్రజలు విశ్వసించకపోతే, ప్రభుత్వం మరింత సమర్థవంతంగా ప్రజల్ని నమ్మించాలని చూస్తోంది. వ్యవస్థ నిర్మాణం, లక్షల మంది పేద ప్రజలను భయపెడుతోంది. ప్రభుత్వం సృష్టించిన చట్టవిరుద్ధమైన పాలనలో ప్రజలు భయభ్రాంతులకు గురౌతున్నారు. ఈ నేపథ్యంలో పోలీసులకు మరింత శక్తిని ప్రభుత్వం ఇవ్వాలనుకుంటోంది. ఇప్పటికే పోలీసుల చేతిలో ఎక్కువగా బాధపడుతున్న బలహీనమైన సమూహాలు ఉన్నాయి. అవి సమర్థవంతమైన పోలీసు బలగాలకు మరింత భయపడతాయి.

**ప్రజాస్వామ్యంలో పోలీసులే శక్తిమంతులు**

ప్రజాస్వామ్యంలో పోలీసులకు వింత స్థానం ఉంది. వారికి ప్రోత్సాహాన్ని ఇవ్వడానికి అధికారంలో ఉన్న రాజకీయ శక్తి సాధనంగా పనిచేస్తుంది. అధికారంలో ఉన్నవారు పోలీసు శక్తిని వదులుకోవటానికి ఇష్టపడరు. కాబట్టి సంస్కరణలకు ప్రోత్సాహం ఉండదు. కానీ ప్రతిపక్షాలు కూడా అలా కోరుకోవడం లేదు. సమాజ గుర్తింపు, డబ్బు, హింస, మాఫియా ద్వారా తెరిచిన చట్టపరమైన నిర్మాణమే పోలీసు వ్యవస్థ. ఇది వాస్తవానికి ప్రజాస్వామ్యంలోని శక్తిని విచ్ఛిన్నం చేస్తుంది.

**హింసపై గుత్తాధిపత్యం**

దుబే వంటి చాలా మంది నేరస్థులు చట్ట నియమాలను అణచివేస్తారు. కానీ ప్రజలు వారిని పవర్ సోర్సులుగా చూస్తారు. ఇవి తరచూ అధికారపార్టీకీ ఉపయోగించబడతాయి. భారతీయ ప్రజాస్వామ్యం మనుగడ సాగించింది కేవలం విలువల పట్ల ఉన్న నిబద్ధత వల్లనే కాదు. హింసాత్మక శక్తికున్న వాస్తవమైన విచ్ఛిన్నం దానికి చాలా అవసరం. ముఖ్యంగా ఉత్తర్‌ప్రదేశ్, బీహార్ వంటి రాష్ట్రాలలో పోలీసు సంస్కరణ అంటే నేరవ్యవస్థను ప్రోత్సహించడం, అనైతిక ఆర్థిక వ్యవస్థను పెంపొందించడమే.

**సుప్రీంకోర్టు మార్గదర్శకాలు**

2014 కేసులో సుప్రీంకోర్టు నిర్దేశించిన మార్గదర్శకాలను అనుసరించి, గ్యాంగ్‌స్టర్ వికాస్ దుబే హత్యపై ఉత్తర్‌ప్రదేశ్ ప్రభుత్వం విచారణ జరుపుతుంది. ఆ విచారణ ఫలితం ఎలా వుంటుందో ప్రజలకు ముందే తెలుసు. రికార్డుల ప్రకారం, యోగి ఆదిత్యనాథ్ ప్రభుత్వం మార్చి 2017లో బాధ్యతలు స్వీకరించినప్పటి నుండి పోలీసులు క్రాస్ ఫైరింగ్ అని అల్లిన కథలో 119వ బాధితుడు దుబే. మరణాలు జరిగిన

74 ఎన్‌కౌంటర్ కేసుల్లో మెజిస్టీరియల్ ఎంక్వైరీలు పూర్తయ్యాయి. అనుకున్నట్టే పోలీసులకు అన్ని కేసుల్లోను క్లీన్ చిట్ లభించింది. 61 కేసులలో, పోలీసులు దాఖలు చేసిన మూసివేత నివేదికలను కోర్టు అంగీకరించింది. మొత్తం మీద 6,145 ఆపరేషన్లు జరిగాయని, ఇందులో 119 మంది నిందితులు మరణించారని, 2,258 మంది గాయపడ్డారని రికార్డులు చెబుతున్నాయి. ఈ ఆపరేషన్‌లలో, 13 మంది పోలీసులు ప్రాణాలు కోల్పోయారు. ఇందులో గత వారం కాన్పూర్ సమీపంలో ఎనిమిది మంది ఉన్నారు. మొత్తం 885 మంది పోలీసులు గాయపడ్డారు.

సుప్రీంకోర్టు మార్గదర్శకాలు, స్వతంత్ర విచారణ లాంటి చట్టపరమైన చట్రం ఉన్నప్పటికీ, ఎన్‌కౌంటర్ హత్యలలో చట్టాలను విస్మరిస్తూనే ఉన్నారు. గత ఏడాది డిసెంబర్‌లో హైదరాబాద్‌లో సామూహిక అత్యాచారం జరిగింది. 26 ఏళ్ల పశువైద్యురాలిని హత్య చేసిన కేసులో నిందితులుగా ఉన్న నలుగురిని పోలీసులు ఎన్‌కౌంటర్లో చంపేశారు. ఈ కేసులో మాజీ ఎస్సీ జడ్జి వివిఎస్ సిర్పుర్కర్ నేతృత్వంలోని స్వతంత్ర దర్యాప్తును సుప్రీంకోర్టు ఆదేశించింది. జాతీయ మానవ హక్కుల కమిషన్, తెలంగాణ హైకోర్టు ముందు విచారణను నిలిపివేసింది. దుబే హత్యకు సమానమైన పరిస్థితులలోనే హైదరాబాద్ కట్టుకథ ఉంది. పారిపోయే ప్రయత్నంలో పోలీసుల తుపాకీలను లాక్కోవడానికి ప్రయత్నించినప్పుడు నిందితులు కాల్పులు జరిపినట్లు తెలంగాణ పోలీసులు తెలిపారు. దాదాపు ఏడు నెలల తరువాత, దర్యాప్తు కొనసాగుతోంది.

**సుప్రీంకోర్టు జోక్యం**

ఉత్తరప్రదేశ్‌లో ఎన్‌కౌంటర్లలో కూడా సుప్రీంకోర్టు జోక్యం చేసుకుంది. దీనిని 2019 జనవరిలో 'చాలా తీవ్రమైన సమస్య' అని పేర్కొంది. పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ 1000 మందికి పైగా మరణించిన ఎన్‌కౌంటర్లకు సంబంధించిన జాబితాను ఉన్నత న్యాయస్థానానికి సమర్పించింది. జూలై 2018 – ఫిబ్రవరి 2019 మధ్య నాలుగుసార్లు విచారించిన కేసు అప్పటి నుండి జాబితా చేయబడలేదు.

ఎన్‌కౌంటర్ మరణాల కేసుల్లో ఎన్‌హెచ్‌ఆర్‌సి 2017 నుంచి ఉత్తర్‌ప్రదేశ్ ప్రభుత్వానికి కనీసం మూడు నోటీసులు జారీ చేసింది. తన చర్యలను సమర్థిస్తూ నోటీసులకు రాష్ట్రం సాధారణ ప్రతిస్పందనను దాఖలు చేసినప్పటికీ, అప్పటి నుండి కేసులు కదలలేదు. ఎన్‌కౌంటర్ హత్యలపై దర్యాప్తులో జాప్యం సాధారణం అయిపోయింది. పోలీసులపై తీసుకున్న ఏ చర్యనైనా క్షమించమని రాష్ట్ర ప్రభుత్వాలు తరచూ హడావిడి చేస్తుంటాయి. గత ఏడాది మార్చిలో, నకిలీ ఎన్‌కౌంటర్ కేసులో 2013లో సెషన్స్ కోర్టు దోషిగా తేల్చిన 11 మంది పోలీసుల శిక్షలను నిలిపివేసినందుకు బాంబే హైకోర్టుపై మహారాష్ట్ర ప్రభుత్వం వత్తిడి తెచ్చింది. అలాగే, 2015లో పోలీసు అధికారుల శిక్షలను నిలిపివేస్తూ ప్రభుత్వం జారీ చేసిన ఉత్తర్వులను కూడా కోర్టు రద్దు చేసింది.

పీపుల్స్ యూనియన్ ఫర్ సివిల్ లిబర్టీస్ వర్సెస్ స్టేట్ ఆఫ్ మహారాష్ట్రలో 2014 ఇచ్చిన తీర్పు ప్రకారం, మొదటి సమాచార నివేదిక (ఎఫ్ఐఆర్) నమోదు తప్పనిసరి అని సుప్రీంకోర్టు తన మార్గదర్శకాలలో పేర్కొంది. "పోలీసు చర్యల సమయంలో సంభవించే అన్ని మరణ కేసులలో మెజిస్టీరియల్ విచారణ తప్పనిసరిగా జరగాలి. మరణించినవారి బంధువును విచారించాలి. ఒక నేరపూరిత చర్య పోలీసులు చేశారని, పోలీసులపై ఫిర్యాదు చేసినప్పుడు ఏఫ్ ఐ ఆర్ చేయాలి. ఎఫ్ఐఆర్ ఐపిసిలోని తగిన విభాగాల క్రింద కేసు నమోదు చేయబడాలి" అని కోర్టు తెలిపింది.

అప్పటి సిజెఐ ఆర్.ఎం. లోధా, జస్టిస్ రోహింటన్ ఫాలి నారిమన్ ఇచ్చిన తీర్పు విచారణలో "బలప్రయోగం సమర్థించబడిందా, తీసుకున్న చర్య చట్టబద్ధమైనదా" అని చూపించాలి. పోలీసులు హత్య చేసిన ప్రతి కేసులో ఎఫ్ఐఆర్‌లు దాఖలు చేయడం 2009లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు తప్పనిసరి చేసింది. పోలీసుల ప్రైవేటు రక్షణ హక్కును మేజిస్ట్రేట్ విచారణకు ముందు చేయవలసి ఉందని కోర్టు తెలిపింది. ఈ తీర్పును ఎస్సీ వెంటనే నిలిపివేసినప్పటికీ, 2019 జూలైలో హైకోర్టు తీర్పును కోర్టు సమర్థించింది.

**వికాస్ దుబే సృష్టి**

భారతదేశంలో అలాంటి నేరస్థులు సృష్టించబడతారని ఎవ్వరూ ఊహించివుండరు. నిజానికి నేరస్థులు ఎక్కడైనా ఉంటారు. ముఠా ప్రభువులు కూడా ఉన్నారు. కానీ వారు పోలీసులకు భయపడి వారి అధికారాన్ని గౌరవించారు. ఒక నేరస్థుడు పోలీసులపై దాడి చేయడానికి ధైర్యం చేయడు. కనీసం ఒక సీనియర్ అధికారి నేతృత్వంలోని పోలీసు పార్టీపై ఆకస్మికంగా దాడి చేసి నాశనం చేయడు. ఉత్తర్‌ప్రదేశ్‌లోని రెండు జిల్లాలకు మించి విస్తరించని స్థానిక గ్యాంగ్‌స్టర్ వికాస్ దుబే పోలీసులపై, రాష్ట్ర అధికారంపై గౌరవాన్ని ఎలా కోల్పోయాడు. సమాధానాన్ని సూత్రీకరించడం కష్టం కాదు. కోరలు లేని న్యాయవ్యవస్థ, క్షీణించిన అన్ని శాస్త్రీయ సంకేతాలు, రాజకీయం చేయబడ్డ పాలనా సంస్థల వల్ల ఈ వ్యవస్థకు వెలుపల ఉన్నవారు వ్యవస్థపై ఆజమాయిషీ చేయగలుగుతున్నారు.

క్రిమినల్ చట్టాన్ని సవాలు చేయాలనుకునే ఏ పౌరుడైనా మొదట దాడిచేసేది పోలీసులపైనే. ప్రాసిక్యూటర్, డిఫెన్స్ న్యాయవాదులు, న్యాయమూర్తులు కాలక్రమానుసారం తదుపరి స్థానంలో ఉన్నారు. వ్యవస్థలోని పోలీసు విభాగం డబ్బు, రాజకీయ ఒత్తిడి ద్వారా ప్రభావితమైతే, ఫిర్యాదు కూడా స్వీకరించబడదు. చట్టాన్ని అమలు చేయడానికి అవసరమైన ఎఫ్ఐఆర్ నమోదు చేయకుండా ఉండటానికి 20 లేదా అంతకంటే ఎక్కువ కారణాలను అందిస్తుంది. ఎఫ్ఐఆర్ వాస్తవానికి నమోదు చేయబడితే, ఎస్‌ఎచ్‌ఓ దర్యాప్తు విధి మొదటి నుండి విచారకరంగా ఉంటుంది. సాక్షుల వాంగ్మూలాలు సరిగ్గా నమోదు చేయబడవు.

దోపిడీకి రక్షణ కోసం తగినంత విధేయతను పోలీసు విభాగం చూపుతుంది. ఎస్‌ఎచ్‌ఓ దర్యాప్తు అధికారులు తరచూ అపరాధి దగ్గర డబ్బు తీసుకుని రక్షించాలని నిర్ణయించుకుంటారు. వారి రాజకీయ యజమానులను సంతోషపెట్టడం తమ ప్రయోజనాలలో ఉందని వారు భావిస్తారు. ఈ రోజుల్లో మామూలుగా జరుగుతున్నట్లుగా, ఒక అధికారి రాజకీయ ప్రయోజనాలతో ఒక పోషకుడి ద్వారా తన పోస్టింగ్‌ను భద్రపరచుకుంటాడు. రక్షణ కోసం సరైన వ్యక్తిని సంప్రదించినట్లయితే నేరస్థులు తప్పించుకుంటారు.

**రాజకీయ నాయకుల జోక్యం**

స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే రాజకీయ నాయకులు నేర పరిశోధనలలో జోక్యం చేసుకోలేదు. ఈ మార్పు నాలుగు దశాబ్దాల తరువాత జరిగింది. ఉత్తర భారతదేశంలోని రాష్ట్రాలలోనే మొదట అవినీతి అధికారులకు రాజకీయ జోక్యం, ప్రోత్సాహక ప్రక్రియ ప్రారంభమై ఉండవచ్చు. కానీ ముంబైలో, నేరస్థులు, పోలీసులు, రాజకీయ నాయకుల మధ్య సంబంధాలు ఎనభైలలో మాత్రమే కనిపించాయి.

నేరస్థులు రాజకీయ నాయకులకు ఎన్నికలలో గెలవడానికి డబ్బులు ఇస్తారు. వారి అనుచరుల అండదండలను అందిస్తారు. వారి సేవలను అంగీకరించే రాజకీయ ప్రలోభం చాలా గొప్పది. చాలా రాజకీయ పార్టీలు వారి సహాయాన్ని కృతజ్ఞతగా అంగీకరిస్తాయి. వారు తమ జోక్యాన్ని కోరుకునే పోలీసు అధికారులను నిర్బంధిస్తారు. రాజకీయ మార్గం ద్వారా అధికారులను నియమించిన తర్వాత వారు తమ రాజకీయ పోషకుడికి బాధ్యత వహిస్తారు. పోలీస్ చీఫ్ నియామకంలో లాబీయింగ్ పాత్ర పోషిస్తే నేరస్థుని రాజకీయీకరణ పూర్తవుతుంది.

సుపరిపాలన సూత్రాలు ఎలా విస్మరించబడుతున్నాయో రాజకీయ, నేరస్థుల మధ్య సంబంధాలే చెపుతాయి. పోలీసులు తమను తాము దోపిడీదారులుగా మార్చుకుంటారు. దుర్మార్గులను ఆపరేట్ చేయడానికి, అనుమతించటానికి పోలీసు బలగాలను రాజకీయం చేసే ఈ ప్రక్రియను గమనించాలి. ఖాకీలను, రాజకీయ నాయకులను కొనొచ్చు. రాజకీయ నాయకుల, పోలీసుల ప్రోత్సాహం కారణంగా ఇన్ని సంవత్సరాలు అభివృద్ధి చెందిన వికాస్ దుబే, అతను ఎంచుకున్న వృత్తి జీవితంలో రారాజు అయ్యాడు. ఎనభైల ఆరంభంలో, బలవంతపు నాయకత్వ ఉద్యోగాలను నిర్వహించడానికి ఉన్నత అధికారులను ఎన్నుకునే ప్రక్రియను ఇది సిఫారసు చేసింది. సుప్రీంకోర్టు తన సూచనలకు ముద్ర వేసింది. కానీ ఏ రాజకీయ పార్టీ కూడా పోలీసులపై తన గొంతును విప్పడానికి సిద్ధంగా లేదు. ఈ గొంతును విప్పనంత వరకు, వికాస్ దుబేలు మరింత తరచుగా కనిపిస్తూనే ఉంటారు.

**వికాస్ దుబేను అరెస్టు చేసి చంపడం**

దాదాపు వారం రోజుల పాటు పరారీలో ఉన్న దుబేని మధ్యప్రదేశ్ లోని ఉజ్జయినిలోని మహాకలేశ్వర్ ఆలయ ప్రాంగణంలో అరెస్టు చేశారు. ఆలయంలో విఐపి దర్శనం కోసం దుబే రు. 250 టికెట్ కొన్నట్లు ఉజ్జయిని ఎస్‌పి మనోజ్ కుమార్ సింగ్ తెలిపారు. అతను వెళ్లేటప్పుడు, సెక్యూరిటీ గార్డులు అతని పేరును అడిగారు. అక్కడ వాదన జరిగింది. ఆలయ ప్రాంగణంలో కాపలాదారులు అతన్ని బంధించారు. చివరికి, దుబే తన గుర్తింపును వెల్లడించాడు. తర్వాత పోలీసులు అతన్ని అరెస్టు చేశారు.

విస్తృతంగా ప్రసారం చేయబడిన ఒక వీడియోలో, దుబే "వికాస్ దుబే హూ కాన్పూర్ వాలా (నేను కాన్పూర్‌కు చెందిన వికాస్ దుబే)" అని అరవడం వినిపిస్తుంది. ఆ తర్వాత ఒక పోలీసు అతన్ని చెంపదెబ్బ కొట్టి పోలీసు వాహనంలో బలవంతంగా ఎక్కిస్తాడు. తరువాత రోజు, యుపి పోలీస్ స్పెషల్ టాస్క్‌ఫోర్స్ (ఎస్‌టిఎఫ్) బృందం ఉజ్జయిని చేరుకుంది. వారికి దుబేను అప్పగించారు. ఎస్‌టిఎఫ్ అతన్ని రోడ్డు మార్గంలో కాన్పూర్‌కు తీసుకెళ్లింది.

కాన్పూర్‌లో పోలీసు కస్టడీ నుండి తప్పించుకోవడానికి ప్రయత్నించినట్లు పోలీసులు చెప్పారు. శుక్రవారం తెల్లవారుజామున దుబే కాల్చి చంపబడ్డాడు. ఉదయం 7 గంటల సమయంలో కాన్పూర్ లోని సచేండి ప్రాంతంలో ప్రమాదానికి గురైన దుబేని కాన్పూర్‌కు తీసుకువచ్చిన వాహనం బోల్తా పడిందని కాన్పూర్ అసిస్టెంట్ పోలీస్ సూపరింటెండెంట్ డాక్టర్ అనిల్ కుమార్ తెలిపారు. ప్రమాదం నుండి తప్పించుకున్న దుబే, ఒక అధికారికి చెందిన సర్వీస్ పిస్టల్‌తో పారిపోవడానికి ప్రయత్నించాడని పోలీసులు పేర్కొన్నారు. ఈలోగా, గ్యాంగ్‌స్టర్ ప్రయాణిస్తున్న వాహనాన్ని ఎస్కార్ట్ చేస్తున్న మరో పోలీసు బృందం సంఘటన స్థలానికి చేరుకుంది. వారు ఆ ప్రాంతాన్ని తమ అదుపులోకి తీసుకుని దుబేని పట్టుకోవడానికి ఒక ఆపరేషన్ ప్రారంభించారు.

పోలీసు బృందం తనపైకి రావడాన్ని చూసిన దుబే కాల్పులు జరిపాడు. ఈ ఘటనలో ఇద్దరు అధికారులు గాయపడినట్లు పోలీసులు తెలిపారు. ప్రతీకారంగా పోలీసులు దుబేపై కాల్పులు జరిపారు. గాయపడిన ముగ్గురు వ్యక్తులను ఆసుపత్రికి తరలించారు. అక్కడ వైద్యులు దుబే చనిపోయినట్లు ప్రకటించారు. దుబేకి నాలుగు బుల్లెట్ గాయాలు అయ్యాయని, వారిలో ముగ్గురు ఛాతీలో ఉన్నాయని గ్యాంగ్‌స్టర్‌ను పోస్టుమార్టమ్ చేసిన మెడికల్ కాలేజీ ప్రిన్సిపాల్ తెలిపారు. పోస్టుమార్టం నివేదిక ఇంకా బయటకు రాలేదు. జూలై 4న బిక్రూ గ్రామంలోని దుబే ఇల్లు కూల్చివేయబడింది. పోలీసులు 21 మందిపై, ఎక్కువగా బిక్రూ గ్రామంలో నివసించేవారిపై ఎఫ్ఐఆర్ నమోదు చేశారు.

**ముగింపు**

ఐరోపాకు వెళ్లే మార్గంలో గోల్డెన్ ట్రయాంగిల్, గోల్డెన్ క్రెసెంట్ నుండి హెరాయిన్ తేవడానికి భారతదేశం ఒక ప్రధాన రవాణా స్థానం. నల్లమందు ప్రపంచంలోనే అతిపెద్ద చట్టబద్ధమైన పెంపకందారు భారతదేశమే. 5–10 శాతం చట్టబద్ధమైన నల్లమందు అక్రమ హెరాయిన్‌గా మారుతుందని నిపుణులు అంచనా వేస్తున్నారు. 8–10 శాతం అధిక పరిమాణంలో సాంద్రీకత ద్రవంగా వినియోగిస్తారు. మాండ్రాక్స్ అక్రమ ఉత్పత్తికి ఓషధ పరిశ్రమ కూడా బాధ్యత వహిస్తుంది. వీటిలో ఎక్కువ భాగం దక్షిణాఫ్రికాలో అక్రమంగా రవాణా చేయబడతాయి. దక్షిణాఫ్రికా ద్వారా వజ్రాల అక్రమ రవాణా ఒక పెద్ద నేరపూరిత చర్య. వజ్రాలు సరఫరాలో కొన్నిసార్లు హెరాయిన్ సరుకులను దాచిపెట్టడానికి ఉపయోగిస్తారు. దేశంలో మనీలాండరింగ్‌కు కొదవలేదు. ఎక్కువగా సాంప్రదాయ హవాలా వ్యవస్థను ఉపయోగించడం ద్వారా, 2003లో భారతదేశం మనీలాండరింగ్‌ను నిషేధించింది. స్మగ్లింగ్‌కు, లాండ్ మాఫియాను నడపడానికి నేరస్థులు అవసరం. అందుకే నేరస్థులు ఆధిపత్య వ్యవస్థలచే తయారు చేయబడతారు. రాజకీయ నాయకులు ఎన్నికలలో గెలవడానికి పెద్ద ఎత్తున డబ్బు అవసరం. అందుకే నేరస్థులను తయారుచేసి, నేరాలను ప్రోత్సహించి నల్లడబ్బు ఉత్పత్తికి పునాది వేసుకుంటారు. నేరస్థులు అధిక వాటాకు ఆశపడినపుడు, అక్రమ డబ్బుతో ప్రభుత్వాలను శాసించే ప్రయత్నం చేసినపుడు నేరస్థులు చంపబడతారు.

కోల్డ్ బ్లడెడ్ హత్యలపై ప్రజా మేధావులు, కాలమిస్టుల చేతులెత్తేయడం పరిపాటే. కొద్దిరోజుల ముందు, ఎనిమిది మంది పోలీసులను చంపిన దుబే అతని అనుచరులు తమ సొంత డెత్ వారెంట్లపై వారే సంతకం చేసుకున్నారు. క్షణికావేశంలో, గ్యాంగ్ లార్డ్ అవివేకమైన చర్య చేశాడు. తన అధిక-రిస్క్, అధిక ఆదాయ పనిలో, సహచరులుగా ఉన్న పోలీసులు ఒక ఆస్తి అని దుబే మరిచిపోయాడు. తన ఆస్తిని తనే ధ్వంసం చేసుకున్నాడు.

ఒక హత్య ఆరోపణకు సంబంధించి పోలీసు పార్టీ తనను చూడటానికి వచ్చినందుకు దుబే తన అనుచనరులను చంపమని చెప్పి, తన లాభదాయకమైన వృత్తికి ముగింపు పలికాడు. శాంతిని ప్రేమించే పౌరులను చట్టవిరుద్ధమైన అంశాల నుండి రక్షించడంలో పోలీసులు విఫలం కావచ్చు. కాని శాంతిభద్రతల సంరక్షకులు అని భావిస్తున్న తమకే సురక్షితం లేకపోతే ఎలా? తమ సొంత సృష్టి నుండి తమను తాము రక్షించుకోలేకపోతే ప్రజల దగ్గర పోలీసు వ్యవస్థ చులకన అవుతుంది. పోలీసులను ప్రజలు గౌరవించేది కేవలం భయంతోనే. వాస్తవానికి, ప్రతి రాజకీయ పార్టీ పాలనలోను చట్టవిరుద్ధ హత్యలు జరిగాయి.

1940ల చివరలో, 1950ల ప్రారంభంలో తెలంగాణలో రైతులు తిరుగుబాటు చేశారు. తిరుగుబాటును అణచడానికి, నిజాం పోలీసు హింసను నిర్దాక్షిణ్యంగా ఆశ్రయించాడు. వందలమంది హత్య చేయబడ్డారు. నిజానికి రాజ్యహింసను అప్పుడే ఖండించాల్సింది. పంజాబ్, మధ్యప్రదేశ్ ఇతర రాష్ట్రాల్లో పోలీసులు అనధికారికంగా చేసిన హత్యల ద్వారా 1950, 1960లలో పెద్ద ఎత్తున్న డెకాయిట్లను ఏరిపారేశామని చెప్పినప్పుడు రాజ్యహింసను ఎవ్వరూ ఖండించలేదు. పశ్చిమ బెంగాల్‌లో నక్సల్బరీ, పంజాబ్‌లో ఖలిస్తానీ ఆందోళన ఎలా అణచివేయబడిందో ప్రజలకు తెలుసు. రాజకీయ ప్రచారాలను చట్టేతర మార్గాల ద్వారా తటస్థీకరించడం మొదలైంది. ఇది మరోవైపు మాఫియా డాన్స్‌ను పోషించే వరకు పురోగతి సాధించింది.

అధికార పార్టీ పోటీకి భయపడనంతవరకు, ఎన్నికల సమయంలో అతి ముఖ్యమైన డబ్బును, వస్తువులను పంపిణీ చేయడంలో సహాయపడిన నేరస్థులను ఆశీర్వదించడం వ్యవస్థకు అత్యవసరం. పట్టణాలు, గ్రామ సమూహాలలో పెద్ద ఎత్తున ఓట్లు రాలాలంటే నేరస్థులు అత్యవసరం. పోలీసలు ఆ నేరస్థులకు అండగా ఉండి ఎన్నికల ప్రహసనాన్ని దిగ్విజయంగా ముగిస్తారు. ఏదేమైనా, రాజకీయాలు పోటీగా మారినప్పుడు, ప్రతి ఓటు కోసం ప్రత్యర్థి పార్టీలు పోరాడడానికి సిద్ధపడుతున్నప్పుడు, గ్యాంగ్ స్టర్లు చాలా శక్తివంత మయ్యారు.

మాఫియా డాన్, పోలీస్, పొలిటీషియన్ అనుబంధం తీవ్రమైన రాజకీయ పోటీలో దేశవ్యాప్తంగా అభివృద్ధి చెందడానికి అవసరమైంది. అధికారంలో ఎవరుంటే ఆ పార్టీలోకి జంపు అయ్యే రాజకీయ నాయకుల మాదిరి గ్యాంగ్‌స్టర్లు ఉంటారనుకుంటే పొరపాటు. వీరికి నిజాయితి ఉంటుంది. మాఫియా డాన్స్‌కి వ్యక్తిత్వం ఉంటుంది. ఒక స్థాయికి వెళ్లిన తర్వాత, వాళ్లే ఎన్నికలలో సొంత అభ్యర్థులను నిలబెడతారు. నేరస్థులు డాన్‌లు అయ్యారు. డాన్‌లు మాఫియా సామ్రాజ్యాన్ని స్థాపించారు. వాటిని రక్షించుకోవడానికి రాజకీయ నాయకులు అయ్యారు. చివరకి వారే పార్టీ నేతలయి, ముఖ్యమంత్రులౌతున్నారు. ఇది నేరమయ రాజకీయ క్రమం. ఇది పరస్పరం ప్రయోజనకరమైన అమరిక.

వాస్తవానికి, నేర వృత్తి అనేది రాజకీయ నాయకుడిగా మారడానికి ఒక సులభమైన మార్గం. నేరస్థులను పట్టుకోవడానికి పోలీసులను ఆదేశించిన న్యాయమే, వారు రాజకీయ నాయకులుగా మారిన తరువాత తగిన ప్రవర్తనతో వ్యవహరించాల్సి ఉంటుందని హెచ్చరిస్తుంది. ప్రతి రాష్ట్రంలోను నేరస్థులుగా మారిన రాజకీయ నేతల చిట్టా చాలా పెద్దది. ఇటీవలి ఢిల్లీ అల్లర్లలో, హింసను ప్రేరేపించిన ఆప్ శాసనసభ్యుడు స్వేచ్ఛగా తిరుగుతాడు. వాస్తవానికి,లోపభూయిష్ట న్యాయ వ్యవస్థ వల్లే నేరస్థులు స్వేచ్ఛగా తిరుగుతున్నారు. దుబే విషయం చూద్దాం. 2001లో అతను ఒక బిజెపి మంత్రిని కాల్చి చంపాడు. అతను భయాందోళనలో ఒక పోలీసు స్టేషన్లోకి దూసుకెళ్లాడు. మంత్రి అంగరక్షకులు, పోలీసులు మొదలైనవారు ఈ హత్యకు ప్రత్యక్ష సాక్షులు. ఈ వాస్తవాలను ఎఫ్ఐఆర్ సరిగా నమోదు చేసింది. కానీ కొన్ని సంవత్సరాల తరువాత, దుబేపై కేసు కొట్టేశారు. ఎందుకంటే ప్రత్యక్ష సాక్షులు, అందరూ దుబేకు అనుకూలంగా మారారు. ఏదో ఒకవిధంగా, అటువంటి కేసులన్నిటిలో సాక్షులు తమ వ్యక్తిత్వాలను కోల్పోతారు. పోలీసు సంస్కరణల విషయానికొస్తే, ఇవి దశాబ్దాలుగా ప్రస్తావించబడుతూనే ఉన్నాయి. అనేక కమిటీలు, కమీషన్లు తమ సిఫార్సులను అందించాయి. కానీ సంస్కరణల సంకల్పంలోపించింది.

ఏ రాజకీయ నాయకుడూ పోలీసులపై తన పట్టును వదులుకోవాలని అనుకోవడం లేదు. ఇది అతని పోస్టింగ్స్‌పై ప్రభావం చూపుతుంది. తద్వారా పోలీసులు నాయకులకు అనుగుణంగా పనిచేయాల్సి వస్తుంది. మహారాష్ట్రలో డిసిపిలను పోస్ట్ చేయమని ఎన్‌సిపి హోంమంత్రి అనిల్ దేశ్‌ముఖ్ ఇచ్చిన ఉత్తర్వును ఠాక్రే తిప్పికొట్టారు. దేశ ఆర్థిక రాజధానిలో తన అభిమాన పోలీసులను పోషించాలని సిఎం స్పష్టంగా కోరుకున్నారు. డాన్ల భయంకరమైన ముగింపుకు దారితీసే ఎన్‌కౌంటర్ హత్యలు సంచలనాత్మక నేరాలకు ముగింపుగా ప్రజలు గుర్తిస్తారు. ప్రజలకు ఒక విధమైన ఉత్సాహాన్ని అందించడానికి దుబే లాంటి ఎన్‌కౌంటర్‌లు సహాయపడతాయి. కొన్ని రోజుల తరువాత ప్రజలు సాధారణ స్థితికి వస్తారు. మళ్లీ మరొక దుబే వచ్చే వరకు. ఎందుకంటే, రాజకీయ న్యాయ వ్యవస్థను శుభ్రపరచకుండా నేర న్యాయ వ్యవస్థ సంస్కరణ సాధ్యం కాదు. స్వచ్ఛమైన రాజకీయాలు మాత్రమే స్వచ్ఛమైన వ్యవస్థకు పునాదిగా వుంటాయి. కాని భారత్ లాంటి సంక్లిష్ట ప్రజాస్వామిక వ్యవస్థలో అది అందని ద్రాక్షపండు లాంటిది.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు)* వీ

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవితకనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

**- కార్ల్ మార్క్స్**

# 'స్టార్స్'తో విద్యావ్యవస్థపై ప్రపంచబ్యాంక్ పెత్తనం

*విద్య ప్రాథమిక ఉద్దేశాలను, లక్ష్యాలను దెబ్బతీసి, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలు నెరవేర్చడమే 'స్టార్స్' ఉద్దేశమని అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

సమాజ పరివర్తనకు ప్రాథమిక సాధనం విద్య. అట్టి విద్యను ప్రభుత్వమే ప్రజలందరికి ఉచితంగా అందించాలి. ఏడు దశాబ్దాల స్వతంత్ర భారత దేశంలో విద్యారంగం లోపభూయిష్టంగా ఉండడం విచారకరం. ఇవాళ్టికీ అధిక భాగం జనాభా నిరక్షరాస్యతలో, అ విద్యలో మునిగే ఉంది. ప్రభుత్వం ప్రజలందరికి విద్యను అందించడంలో తీవ్రంగా వెనుకబడింది. అందించే విద్యలో కూడా అసమానతలున్నాయి. ఒకవైపు సామాజికంగా అట్టడుగు వర్గాలకు, దళితులకు, వెనుకబడిన కులాల, ఆదివాసీల పిల్లలకు విద్య అవకాశాలు అందవలిసినంతగా ఇప్పటికీ అందడం లేదు. మరొక వైపు ఉన్నత వర్గానికే పరిమితమైంది. ప్రభుత్వాల ఆలోచనలోనే అందరి గురించి ఆలోచించడమన్న ప్రజాస్వామ్య సంస్కృతే కరువైంది. రెండు వర్గాలున్న ఈ దేశంలో ఒక వర్గమే (ఉన్నత) ఇవ్వాళ పాలకుల దృష్టిలో ఉంది. రెండవ వర్గం (నిమ్న) వాళ్ల స్పృహ నుండి, చైతన్యం నుండి జారిపోయింది.

దశాబ్దాలుగా పాలకపక్షాలు గంభీరమైన వాగ్దానాలు చేస్తూనే, ఆచరణలో విద్యారంగ లోపాలను సవరించకుండానే అసమానతలకు దారి తీసేవిదంగా విద్యను మరింతగా ప్రియంగా మార్చే అనుచిత అప్రజాస్వామిక విధానాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్నాయి. భారతదేశంలో విద్యలో ప్రమాణాల పెంపు కోసం ప్రపంచ బ్యాంక్ దర్శకత్వంలో చేపట్టిన అపెప్, డిపెప్, సర్వశిక్ష అభియాన్ ఆర్ఎంఎస్ఎ, ప్రస్తుత సమగ్రశిక్ష అభియాన్, కనీస సామర్థ్యాల సాధన, క్లిప్స్, క్లాప్ వంటి పథకాలు సత్ఫలితాలు ఇవ్వడం లేదని తెలుపుతున్నాయి. ప్రథం అనే స్వచ్ఛంద సంస్థ అసర్పేరిట ఏటా ప్రకటించే నివేదిక, జాతీయ విద్యా పరిశోధన శిక్షణ సంస్థ (ఎన్సిఇఆర్టి) జాతీయ సర్వే నివేదికలన్నీ పాఠశాల స్థాయిలో విద్యా ప్రమాణాలు క్షీణించడంతో పాటు, విద్యార్థుల్లో కనీస సామర్థ్యాలు లేవని స్పష్టీకరించాయి. ఈ సంవత్సరం ప్రకటించిన అసర్ నివేదిక ఎనిమిదో తరగతి విద్యార్థులు 54 శాతం మంది ఓ చిన్న పేరాలోని అంశాల గురించి చెప్పలేకపోయారని, ఐదో తరగతి విద్యార్థుల్లో మూడంకెల కూడికలు, తీసివేతలు రానివారు 26.87 శాతం మంది ఉన్నారని, 60 శాతం మంది విద్యార్థులకు భిన్నాలు, దశాంశాలు, నిష్పత్తులపై అవగాహన లేని దుస్థితి ఉందని వెల్లడించింది. మరో వైపుగా రాకెట్ వేగంతో దూసుకొస్తున్న కార్పొరేటీకరణ, ప్రైవేటీకరణలు వెర్రితలలు వేస్తూ, విద్యా మౌలిక లక్ష్యాలనే తారుమారు చేస్తున్న నేపథ్యంలో భారతదేశంలో ప్రాథమిక విద్యా వ్యవస్థను ఉద్ధరించడాని కంటూ 2020 జూన్ 24న ప్రపంచ బ్యాంకు (రాష్ట్రాల కోసం బోధన అభ్యాసం, ఫలితాలను బలోపేతం) "స్టార్స్" పేరుతో ఒక కార్యక్రమాన్ని ప్రకటించింది. మన విధాన నిర్ణేతలు ఈ దేశంలోని 20 శాతం ఉన్నత మధ్యతరగతి పట్ల తప్ప– విశాల జీవరాసులు, దళిత బహుజనుల పట్ల ఏ మాత్రం స్పృహలో లేరన్నది ఈ స్టార్స్ ప్రకటనలో స్పష్టంగా చూడవచ్చు. ఇది ప్రైవేటు అనుకూల లక్ష్యాలు గల అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు, బహుళజాతి సంస్థలు, ప్రపంచ బ్యాంకు కలిసి భారత విద్యా రంగాన్ని నిర్వీర్యం చేసే కుట్రలో భాగమైన మరో ప్రయత్నమే 'స్టార్స్'. దీనిని ప్రజాస్వామిక వాదులు, ప్రజాతంత్ర వాదులు తీవ్రంగా వ్యతిరేకించాల్సిన అవసరముంది.

**భారతదేశంలో ఉత్కృష్టమైన ప్రాచీన విద్యా విధానం**

ప్రపంచంలో అత్యంత ఉత్కృష్టమైన విద్యా విధానం భారతదేశంలో అతి ప్రాచీన కాలంలోనే విలసిల్లింది. అది మానసికోన్నతికి సృష్టి రహస్యాన్ని ఛేదించే అన్వేషణతో పాటు శాస్త్రీయ, లౌకిక, నైతిక భావనలు ఏర్పడడం లక్ష్యంగా మానవ మేధ అత్యున్నత స్థితికి సూచికగా నిలిచిన విజ్ఞానం ప్రాచీన భారతదేశానికి సొంతమైంది. ఈ నేపథ్యంలో ఈ దేశ ప్రజలు నాలుగు వేల సంవత్సరాలకు పూర్వమే విజ్ఞాన శాస్త్రం అందించిన ఫలాలను అనుభవించినారు. ఖగోళశాస్త్రం మొదలుకొని భాషాశాస్త్రం, వైద్య విజ్ఞాన శాస్త్రం, అణు సిద్ధాంతం, కాంతివంటి భౌతికశాస్త్ర అంశాలతో పాటు ఖనిజ శాస్త్రం, గణిత శాస్త్రం, రసాయన శాస్త్రం, నిర్మాణ శాస్త్రం, సముద్ర శాస్త్రం, అర్థశాస్త్రం మొదలైన సమస్త శాస్త్రాలలో మన ప్రాచీనులు సాధించిన ప్రగతిని, మేధస్సును గొప్పగా ప్రపంచ దేశాలకు అందించి మార్గనిర్దేశం చేశారు. ఇందుకు సింధ్ నాగరికత తొవ్వ కాలంలో అనేకానేకం. అనంతర కాలంలో ఆ అపూర్వ వారసత్వం, వైభవం విధ్వంసానికి గురైయింది. అద్భుతమైన జ్ఞానం, వికాసం దెబ్బతీయబడ్డాయి. కాలక్రమంలో భారతీయ ప్రశస్త విద్యావిధానం పాలనా, సామాజిక వ్యవస్థలు ధ్వంసం అయినాయి. అనంతరం నాగరికత, ఆధునికత, అవసరం పేరుతో ఇవ్వాళ మనం అనుసరిస్తున్న విద్యా విధానం భారతదేశంలో బ్రిటిష్–ఈస్ట్ ఇండియా కంపెనీకి అవసరమైన ఉద్యోగులను తయారు చేయడమే లక్ష్యంగా ప్రారంభమైంది. దీనికి మెకాలే ఉద్దేశపూర్వకంగానే ఆంగ్ల మానస పుత్రులను తయారు చేయాలనే ప్లాన్లో భాగంగానే ఇంగ్లిష్ విద్యను ప్రవేశ పెట్టినారు. ఆంగ్లేయులు తమ విద్యా బోధన ద్వారా జ్ఞనసంపదను దోచుకొని బానిస విద్యా విధానానికి బాటలు పరిచి అన్ని విధాలుగా సంపాదించుకున్నారు. ఆ తర్వాత వచ్చిన ఉడ్స్ – డిస్పాచ్ హంటర్ కమిషన్లు హార్ట్ రిపోర్టు, సార్జెంట్ ప్లాన్లన్నీ విద్యకు పరమార్థన్నీ విడమర్చి చెప్పాయి. ఈ కమిషన్ల ద్వారా భారతీయులకు ఒరిగింది లేదు. కానీ ఆంగ్లేయులు వారి భాషను మాధ్యమంగా చేయడం ద్వారా వారి సంస్కృతి, జీవన విధానాలే

ప్రామాణికమైనవనే భావాల్ని భారతీయుల మెదళ్లలో నాటారు. స్వాతంత్ర్యం పేరుతో అధికారమార్పిడి జరిగినప్పటికీ అదే విద్యా విధానంతో పాటు ఆ భావ దాస్యం ఆ పాశ్చాత్య నమూనాల ప్రామాణికత ఇంకా భారతీయ విద్యలో కొనసాగడం విచారకరం.

**భారతీయ విద్యా వ్యవస్థ ఇలా కావడానికి ప్రధాన కారణం**

విద్య విద్యార్థుల సృజనాత్మకతను అభివృద్ధి పరిచి లోకజ్ఞానాన్ని, బుద్ధి వికాసాన్ని పెంపొందించి, విజ్ఞానాభివృద్ధికి తద్వారా సమాజాభివృద్ధికి ఉపయోగపడే విధంగా ఉండాలి. కాని నేటి విద్యా విధానం అనేక సమస్యలతో అస్తవ్యస్తంగా, లోపభూయిష్టంగా ఉందని అందరూ అంగీకరిస్తున్న వాస్తవం. దీనికి ప్రధాన కారణం విద్యను లాభాపేక్షతో, వ్యాపారంగా భావించడం ఫలితంగా సగం పైగా జనాభా నిరక్షరాస్యతలో, అవిద్యలో మునిగి ఉంది. భారత విద్యారంగంలో ప్రపంచ బ్యాంక్ మార్గదర్శనంలో కార్పొరేటీకరణ, ప్రైవేటీకరణ వెర్రితలలు వేస్తూ విద్య మౌలిక స్వభావాన్నే మార్చింది. దీనిని సంస్కరించాల్సిన బాధ్యత ఈ ప్రభుత్వాలపై ఉన్నది. అధికార మార్పిడి జరిగి 70 సంవత్సరాలు గడిచిన తర్వాత కూడా ప్రజా ప్రయోజనాలే లక్ష్యంగా విద్య అమలు జరగడం లేదంటే కారణాలేమిటో లోతుగా పరిశీలించాల్సిన అవసరం కూడా ఉంది. ఇటీవల ప్రపంచ బ్యాంకు విధానాలను అనుసరిస్తున్న పాలకవర్గాలు విద్య నిర్వచనాన్ని సహితం ఉత్పత్తి ప్రక్రియలో నైపుణ్యత, ఉపాధి కోసం మాత్రమే అన్నట్టుగా మార్చినారు. మన చదువులు జ్ఞానానికి చిహ్నంగా కాకుండా జ్ఞాపకశక్తికి మాత్రమే ప్రతీకలుగా మారినాయి. ఫలితంగా మన విద్య మానసిక వికాసాన్ని, శాస్త్రీయ దృక్పథాన్ని, విలువలతో కూడిన చైతన్యాన్ని కానీ పెంపొందించలేకపోతున్నది. ఇటీవల ప్రజల చరిత్ర, సంస్కృతులను మార్చి అశాస్త్రీయ, మత చాందస భావాలు బలవంతంగా విద్యలో చొప్పించే ప్రయత్నం జరుగుతున్నది. యూరఫ్, చైనా, అమెరికాల్లో దేశ అవసరాలకు తగినట్టుగా వారు విద్యారంగాన్ని అభివృద్ధి చేసుకున్నారు. తద్వారా ఆ దేశాలు అభివృద్ధిలో అగ్రస్థానంలో ఉన్నాయి. ఫిన్లాండ్ ప్రభుత్వం అందరికి సమానమైన, నాణ్యమైన విద్యనందిస్తూ, విద్యారంగానికి అధిక ప్రాధాన్యత ఇవ్వడం వలన దశాబ్ద కాలంగా మానవ వనరుల అభివృద్ధిలో ప్రపంచంలోనే అగ్రస్థానంలో ఉంది. నిజానికి భారతదేశంలో విద్య రాజ్యాంగ సూత్రాలైన ప్రజాస్వామ్యం, లౌకికవాదం, సోషలిజం భావాలను అభివృద్ధి పరచాలి. ఆర్టికల్ 51 ప్రకారం ప్రతి పౌరుడు శాస్త్రీయమైన దృక్పథాన్ని అలవరుచుకోవాలి. అది కామన్ స్కూల్ విద్యావిధానం ద్వారానే సాధించాల్సి ఉండగా, భారతీయ విద్యా వ్యవస్థలో ప్రపంచ బ్యాంక్ చొరబడడంతో విశాలమైన భారతీయ విద్యా వ్యవస్థ తిరోగమన దిశగా ప్రయాణిస్తుంది.

**విద్య మౌలిక నిర్వచనాన్నే మార్చిన ప్రపంచ బ్యాంకు**

ప్రపంచ బ్యాంకు విశాలమైన విద్యా నిర్వచనాన్ని మార్చి, అంతర్జాతీయ మార్కెట్లో, పరిశ్రమల్లో ఉత్పత్తి కోసం నైపుణ్యం గల శ్రామికులను సృష్టించడం కోసం అవసరమైన జ్ఞానమే ప్రభుత్వ విద్యా బోధనలో ఉండాలని 1996లో విజన్ 2020 డాక్యుమెంట్‌లో స్పష్టంగా రాసుకుంది. విద్య పట్ల మౌలిక దృక్పథంలోనే ఇంత అపసవ్యమైన ప్రజా వ్యతిరేకమైన, దోపిడీ అనుకూలమైన వైఖరి తీసుకున్న విజన్ 2020 విద్యా రంగాన్ని ఎట్లా సంస్కరించ దలుచుకుంటుందో ఊహించడమేమి కష్టం కాదు. అంటే ఇక నుంచి విద్య కేవలం పెట్టుబడిదారులకు ఊడిగం కోసం మాత్రమే అని, అట్లాగే కంప్యూటర్ అప్లికేషన్లు, బయోటెక్నాలజీ వంటి ప్రత్యేక సాంకేతిక నైపుణ్యాలు కల్పించడం పట్ల శ్రద్ధ వహించాలి అని విజన్ 2020 డాక్యుమెంట్ తెలియజేస్తుంది. పరిశ్రమల అవసరాలకు తగినట్లుగా బోధనాంశాలు తయారు కావాలి. ఏ ఏ నైపుణ్యాలకు ఎంతెంత గిరాకీ ఉన్నదో కళాశాలలు తెలుసుకుంటూ ఉండాలని. ఏ నైపుణ్యానికి ఎంత జీతం వస్తుందో, ఎటువంటి ఉపాధి ఉద్యోగ అవకాశాలున్నాయో తెలుసుకుంటూ అందుకు తగినట్లుగా పాఠ్యాంశాల బోధనా పద్ధతులను రూపొందించుకోవాలి అని విజన్ 2020లో రాయబడింది. విద్యకు గల ఉదాత్త లక్ష్యాలను దీర్ఘకాలిక ప్రయోజనాలను మానవజాతి శ్రేయస్సును చిన్నాభిన్నం చేసి విద్యను కేవలం పెట్టుబడిదారీ, పారిశ్రామిక అవసరాలను తీర్చే ఒక సాధనంగా చూడడం విజన్ 2020 డాక్యుమెంట్ దుర్మార్గం. ఈ దుర్మార్గానికి గల కారణాలను పరిశీలిస్తే ఇటువంటి విద్య కేవలం ఒక సాంకేతిక నైపుణ్యాన్ని అందించే సాధనంగా భావించడం, విద్యకు కేవలం తక్షణ ప్రయోజనం కల్పించడం, పారిశ్రామిక లక్ష్యంగా ఉత్పాదకతను పెట్టుకోవడం ప్రధాన కారణం. ముఖ్యంగా విద్యారంగ ప్రైవేటీకరణ వల్ల విద్యారంగంలో దళితులకు, ఆదివాసీలకు, వెనుకబడిన కులాలకు రిజర్వేషన్లు పాటించవలసిన ప్రభుత్వం బాధ్యత నుంచి తప్పుకోవడం వంటి విధానాలకు పూనుకోవడం ప్రారంభం అయిన నేపథ్యంలో విద్య మౌలిక లక్ష్యం మారిపోయింది. ఇటువంటి విద్య నేర్చే వాళ్లలో సమాజ అవసరాల, పట్ల విలువలపట్ల సహజంగానే నిరాదరణ ఉంటుంది. అంటే ఇవాళ సమాజంలో కొనసాగుతున్న అసమానతల అగాథం మరింతగా పెరిగి కొన్ని కొన్ని వర్గాలు విద్యకు దూరమయ్యే స్థితిని ఇంకా బలంగా కొనసాగించే అవకాశముంది. ఇటువంటి అసమ సమాజ స్థితిని కొనసాగించడానికి విజన్ 2020లో చెప్పిన మాటలనే ప్రపంచ బ్యాంకు స్టార్స్ రూపంలో విద్యా వ్యవస్థకు మూలమైన ప్రాథమిక విద్యకు ప్రోత్సహం పేరుతో ముందుకు వస్తోంది.

**ప్రపంచ బ్యాంకుకు భారత ప్రాథమిక విద్యపై ప్రేమ ఎందుకు?**

ప్రపంచ బ్యాంకు జోక్యం భారతదేశంలో పరోక్షంగా 1983–84 నుండి ప్రారంభమైంది. మొదటిసారిగా కొంతమంది ముఖ్యమైన ప్రభుత్వ అధికారులకు శిక్షణ ఇవ్వడంతో మొదలైనది. అప్పటి నుండి వారి అభిప్రాయాలు మెల్లమెల్లగా దేశంలోకి విస్తరిస్తున్నాయి. 1994 నుండి భారతదేశంలో ప్రభుత్వ పాఠశాల విద్యను బలోపేతం చేయడంతో పాటుగా 'అందరికీ విద్య' అందించే దేశ సుదీర్ఘ లక్ష్యానికి మద్దతు ఇవ్వడానికి 3 బిలియన్లకు పైగా సహాయం అందించింది. సర్వశిక్షా అభియాన్‌కు 2004–05, 2018–19 మధ్య, పాఠశాలకు వెళ్లే పిల్లల సంఖ్య 219 మిలియన్ల నుండి 248 మిలియన్లకు పెరిగింది. దానికి కొనసాగింపుగా నేడు స్టార్స్‌తో ముందుకొస్తుందని ప్రభుత్వం వ్యాఖ్యానించినప్పటికీ ఇంతకుముందున్న పాక్షిక నియంత్రణ ఇప్పుడు పూర్తిగా ప్రాథమిక విద్యను నియంత్రించే స్థాయికి రావడం గమనార్హం.

పాఠ్య పుస్తకాలే ఎదుగుతున్న శిశువుకు తన పరిసరాల గురించి జ్ఞానాన్ని విస్తరిస్తాయి. తన పరిసరాలను, ఇంటిని, పట్టణాన్ని, దేశాన్ని

ప్రపంచాన్ని చూసే ఒక పద్ధతిని అలవాటు చేస్తాయి. భిన్న సందర్భాల్లో ఎట్లా స్పందించాలో నేర్పిస్తాయి. గతాన్ని ఒక పద్ధతిలో వ్యాఖ్యానించి భవిష్యత్తును కూడా నిర్ణయిస్తాయి. విలువలను రూపొందిస్తాయి. వైఖరులను, కౌశలాలను అభివృద్ధి చేస్తాయి. కొన్ని భావాలకు, దేశాలకు, సంస్థలకు, ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగానో, అనుకూలంగానో, స్థిరమైన అభిప్రాయాలను కలుగజేస్తాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే ఒక శిశువును ప్రస్తుత సాంఘిక వ్యవస్థను దానిలో తన స్థానాన్ని ఆమోదించే వ్యక్తిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తాయి అని లిటిజియో కాన్స్టాంటినో పేర్కొన్నారు.

కాగా ప్రపంచ బ్యాంకు భారతదేశంలో ప్రభుత్వ విద్యను ప్రోత్సహించడం పేరుతో, ఆదేశించడమే కాదు స్వయంగా ప్రాథమిక విద్య పాఠ్య పుస్తకాలను ప్రణాళికలను రాసిపెడుతుంది, పర్యవేక్షిస్తుంది, మూల్యాంకనం చేస్తుంది. ఈ మొత్తం ప్రక్రియల్లో ప్రపంచ బ్యాంకు కుటిలత్వం, మోసం, కుట్ర ఎలా ఉండబోతుందో అర్థం చేసుకోవచ్చు. ఈ ప్రపంచ బ్యాంకు నియంత్రిత విద్యా విధానం పూర్వ బ్రిటిష్ వారి కంటే అత్యంత ప్రమాదకరమైనది. ఈ విద్యా విధానం ద్వారా ప్రాథమిక దశనుండే బానిసత్వాన్ని నేర్పించే కుట్రే స్టార్స్ పథకం. శాస్త్రీయ ఆలోచనలు లేని మర మనుషులను తయారు చేసి అంతర్జాతీయ మార్కెట్లో కారుచవకగా భారత శ్రామికులను సంసిద్ధులను చేసే కుట్రే ఇది.

### స్టార్స్‌కు తల ఊపిన భారత ప్రభుత్వం

ప్రపంచ బ్యాంకు భారతదేశంలోని హిమాచల్‌ప్రదేశ్, కేరళ, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒడిశా, రాజస్థాన్ రాష్ట్రాల్లో "రాష్ట్రాల కోసం బోధన అభ్యాసం, ఫలితాలను బలోపేతం చేయడం" లేదా స్టార్స్ ప్రోగ్రామ్‌ను ఆమోదించాలని జూన్ 24న జరగాల్సిన ఒప్పందం అనేక అభ్యంతరాల నడుమ అనివార్య కారణాలవలన వాయిదా పడింది. దీని కోసం ప్రపంచ బ్యాంక్ 500 మిలియన్ డాలర్లను మంజూరు చేస్తానని గతంలోనే ఒప్పందం కుదుర్చుకుంది. దీనితో ఆరు రాష్ట్రాల్లో 1.5 మిలియన్ల పాఠశాలల్లో 250 మిలియన్ల (6, 17 సంవత్సరాల మధ్య) విద్యార్థులు, మెరుగైన అభ్యాస ఫలితాలను సాధించడంలో ఉపాధ్యాయులు కేంద్రంగా ఉన్నారని, 10 మిలియన్లకు పైగా ఉపాధ్యాయులు ఈ కార్యక్రమం నుండి ప్రయోజనం పొందుతారని, ఇది పైలెట్ ప్రాజెక్టని దీనిని అతి త్వరలో దేశం మొత్తానికి విస్తరింపచేయాలని ఇరువర్గాలు అభిప్రాయపడినాయి. మానవీయమైన విలువలున్న భారత విద్య ప్రపంచ బ్యాంకు కనుసన్నల్లోకి పోవడాన్ని, మార్కెటీకరించడాన్ని దేశవ్యాప్తంగా 1,400 మంది ప్రఖ్యాత విద్యావేత్తలు, కార్యకర్తలు, ఉపాధ్యాయులు ప్రపంచ బ్యాంకు సౌత్ ఆసియా రీజియన్ వైస్ ప్రెసిడెంట్ హార్టిగ్ షాఫర్కు ఒక లేఖను రాసినారు. ఈ ప్రాజెక్టు ఖరారు నిర్ణయాన్ని రుణాన్ని వాయిదా వేయాలని కోరారు. ఈ ప్రతికూల పరిస్థితిలో ఒప్పందం వాయిదాపడింది.

### విజన్ 2020 డాక్యుమెంట్ పరిణామ క్రమం – స్టార్స్

ప్రాథమిక, ఉన్నత విద్యారంగం వాటి యాజమాన్యాలు, బోధనాంశాలు, శిక్షణా పద్ధతులను మార్చడంతో సహా బలోపేతం చేయడం, పరివర్తన కలగజేయడం విస్తరించడం జరగవలిసి ఉందని ఆనాడే విజన్ 2020 డాక్యుమెంట్లో రాసిఉన్నది. దానినే తు. చ తప్పకుండ నెమ్మదినెమ్మదిగా కొనసాగిస్తూనే ఉంది. 1990 తర్వాత అధికారంలోకి వచ్చిన కేంద్ర ప్రభుత్వాలు పూర్తిగా ప్రపంచ బ్యాంక్ విధానాలకు అనుగుణంగా పరిపాలిస్తున్నాయి. ప్రపంచబ్యాంక్ 1990లో జిల్లా ప్రాథమిక విద్యా పథకం కు(డిపిఇపి) కొంతమేరకు స్పాన్సర్ చేసినది. 1993–2002 మధ్యకాలంలో ఈ పథకం 18 రాష్ట్రాల్లో సగం జిల్లాల్లో అమలు చేయబడింది. ఈపథకం సమగ్రంగా లేకపోవడంతో ప్రాథమిక పాఠశాల వ్యవస్థ నాణ్యత వేగంగా క్షీణించింది. ముఖ్యంగా ఎస్‌సిలు, ఎస్‌టిలు, ఓబిసిలు, ముస్లింలు,, సమాజంలోని ఇతర వర్గాలతో పాటుగా సామాన్య ప్రజలలో, ఈ పథకం విశ్వసనీయతను విస్తృతంగా కోల్పోవడం జరిగిన వాస్తవం కళ్ల ముందే ఉంది. పర్యవసానంగా, జిల్లా ప్రాథమిక విద్య పథకం(డిపిఇపి) స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుండి అనంతర దశాబ్దంలో మునుపటి దశాబ్దాల కంటే ఎక్కువ వేగంతో పాఠశాల విద్య ప్రైవేటీకరణ, వాణిజ్యీకరణ పెరిగింది. దీనితో ప్రపంచ బ్యాంకు ప్రధాన సైద్ధాంతిక ఎజెండా బయటపడింది. ఇది భారతీయులకు ఒక చేదు అనుభవం. దీనివలన భారత దేశంలో 6–14 సంవత్సరాల వయస్సున్న దాదాపు 20 కోట్ల మంది పిల్లలతో కూడిన పాఠశాల రంగం (1–8 తరగతులు)కార్పొరేట్ పెట్టుబడిదారుల కోసం చదువును 'మార్కెట్'గా మార్చడం, తద్వారా వాణిజ్యీకరించడం జరిగింది. ఈ లక్ష్యాన్ని సాధించడంలో, ప్రపంచ బ్యాంక్ భారత ప్రభుత్వాన్ని పూర్తిగా ఉపయోగించుకుంది. దీనితోపాటు అంతర్జాతీయ ద్రవ్య నిధి (IMF) విధించిన సర్దుబాటు సంస్కరణలు 'కార్యక్రమం, విద్యపై ప్రభుత్వ వ్యయాన్ని 1964లో కొఠారీ మొదలుకొని వివిధ కమిషన్లు ప్రతిపాదించిన విద్యపై 6 శాతం నిధులని కేటాయించకుండానే 1990 వ దశకం నుండి జిడిపిలో 4 శాతం నుండి క్రమంగా తగ్గించాలని భారత ప్రభుత్వాన్నీ బలవంతం చేస్తూ వస్తోంది. ఈ క్రమంలో 2003లో జిడిపిలో 3.5 శాతం నుండి క్రమంగా మరింతగా తగ్గుతూనే ఉంది.

### భారతీయ విద్య –ప్రపంచబ్యాంకు స్టార్స్ ప్రాజెక్ట్

ప్రపంచబ్యాంకు భారతీయ విద్యలో స్టార్స్ ప్రాజెక్ట్ రూపంలో మూడవ రౌండ్ జోక్యం చేసుకుంటున్న నేపథ్యంలో రాష్ట్రాల సామర్థ్యాన్ని పెంపొందించడానికి స్టార్స్ విధానం లోపభూయిష్టంగా ఉంది. మొదటగా స్టార్స్ విద్యా వ్యవస్థలో ప్రాథమికంగా మనిషి వికాసానికి అవసరమున్న సామర్థ్యాలను గుర్తించడంలోనే విఫలమైంది. అభ్యాసానికి మూలమైన జిల్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడ్యుకేషన్ అండ్ ట్రైనింగ్, జిల్లా, మండల ఎడ్యుకేషన్ కార్యాలయాలు మొదలుకొని, పాఠశాలల్లోని ఉపాధ్యాయుల వరకు విద్యా వ్యవస్థలో ప్రధాన ఖాళీలను భర్తీ గురించి కనీస ప్రస్తావన లేదు. ఏ పథకం విజయవంతం కావాలన్నా అభిప్రాయాలు కింది స్థాయి నుండి వికేంద్రీకరణ ద్వారా తీసుకునే నిర్ణయం ఉత్తమంగా ఉంటుంది. ఈ నిర్ణయం సమర్థవంతమైన నిధుల, వినియోగానికి అనుకూలంగాను, పారదర్శకంగాఉంటుంది. కానీ ఇట్లా నిర్ణయించకుండా కేంద్రీకృత ఉద్యోగస్వామ్యం నిర్ణయాలనే ప్రపంచ బ్యాంక్ ఆమోదించింది. ఇందులో సామాజిక జవాబుదారీతనాన్ని విస్మరించింది.

ఈ స్టార్స్ ప్రాజెక్టులో భౌతికంగా పర్యవేక్షణ లేకుండానే, ఇన్ఫర్మేషన్ అండ్ కమ్యూనికేషన్స్ టెక్నాలజీ (ఐసిటి) తో సేకరించిన దత్తాంశం ఆధారంగా ఫలితాలను విశ్లేషించాలని నిర్ణయించింది. పరిపాలనలో

వివిధ స్థాయిలలో వినడం, పర్యవేక్షించడం మూల్యాంకీకరణ అనంతరం విశ్లేసిస్తే ఫలితాలు రుజువర్తనగా ఉంటాయి. కానీ ఇన్ఫర్మేషన్ అండ్ కమ్యూనికేషన్స్ టెక్నాలజీకి మాత్రమే మద్దతు ఇచ్చినందున. సాంకేతికంగా వెనుకబడిన మన వ్యస్థలో ఇది లోపభూయిష్టంగా ఉంటుంది.

ఈ పథకం "ప్రైవేట్ కార్యక్రమాలకు విస్తరించడం", "ప్రభుత్వ పనులను తగ్గించడం" ద్వారా విద్యను స్థానిక అవసరాలకు తగ్గట్లుగా చేయలేకపోవడం. ప్రైవేటు యాజమాన్యానికి లాభాలను కూర్చడం. శక్తివంతగా స్థానికావసరాలను ప్రోత్సహించకపోవడం. ప్రాథమిక పరిపాలనను అవుట్సోర్సింగ్ చేయడం వలన ప్రజల భాగస్వామ్యాన్ని ప్రజాస్వామ్యబద్ధంగా పరిగణనలోకి తీసుకోకపోవడం, ప్రభుత్వ వ్యవస్థను మెరుగు పరచకుండా ప్రభుత్వ నిధులను ప్రైవేట్ జేబుల్లోకి తీసుకురావడానికి ఒక మార్గాన్ని సృష్టించడం వంటి వన్నీ స్టార్స్ ప్రాజెక్ట్ పత్రంలో పేర్కొన్న ప్రధానమైన లోపాలుగా అర్థం చేసుకోవచ్చు.

భారత ప్రభుత్వం పైన పేర్కొన్న వాస్తవాలను లోపాలను ఇతర ఆర్థిక వనరుల కొరత గురించి ప్రపంచ బ్యాంకును అస్సలు ప్రశ్నించడలేదు. ఏ రంగమైనా సామాజిక శ్రేయస్సు, భవిష్యత్ ప్రయోజనాల వంటి ప్రమాణాలతో కాక లాభనష్టాల ప్రాతిపదికపై మాత్రమే చూడాలని భావించే ప్రపంచ బ్యాంకు ఆలోచన విధానానికి సరిగ్గా సరిపోయిన ఈ పథకాన్ని ప్రభుత్వం గుడ్డిగా సమర్థించడం అమలుచేయాలనుకోవడం పైలెట్ ప్రాజెక్టు గా ముందుకు తీసుకురావడం స్వదేశీయతకు తూట్లుపొడిచి భారతీయ విద్యా సార్వభౌమాధికారాన్నీ ప్రపంచబ్యాంకు కు తాకట్టు పెట్టినట్లే అవుతుంది.

**భారత పరిస్థితులకు కామన్ స్కూల్ విద్యా విధానమే అనుకూలం**

భారత దేశానికి సరైన విద్య విధానం 1968 లో కొఠారీ కమిషన్ ప్రతిపాదించిన కామన్ స్కూల్ విధానమే. దీనిని దేశవాప్తంగా అమలు చేయాలని అనేక కమిటీలు చెప్పినప్పటికీ ఇప్పటివరకు ప్రభుత్వాలు దీన్ని అమలు చేయడం లేదు. ఎన్నో విషయాలలో కొత్త ఆలోచనలు చేస్తున్న ఈ తరుణంలో కొఠారీ కమిషన్ ప్రతిపాదించిన పిల్లలందరూ ఏ పరిసరాలలో నివసిస్తున్నారో అదే పరిసరాలలో ఒకటి లేదా రెండు కిలోమీటర్ల పరిధిలో ఉన్న బడికి మాత్రమే పోవాలనే కామన్ స్కూల్ విధానం, నైబర్హుడ్ స్కూల్ విధానాన్ని తప్పక పరిశీలించాల్సిన అవసరముంది. ఇది అమలు జరిగితేనే ప్రజలందరికి సమానమైన విద్య అందితుంది. కొఠారీ చూపించినట్లు దేశ బడ్జెట్ లో విద్యారంగానికి 6 శాతం నిధులు ఖర్చు చేయాలి. ఉపాధ్యాయుడిని, తరగతి గదిని మానవ సమాజం ఏ ప్రత్యామ్నాయం ద్వారా కూడా పూరించలేదు. ఉపాధ్యాయుడు అనే చిహ్నం ఒక సజీవ, సృజనాత్మక మానవ సంబంధం కావున ఖాళీగా ఉన్న ఉపాధ్యాయ పోస్టులన్నింటిని భర్తీ చేయాలి. తరగతికి ఒక ఉపాధ్యాయున్ని నియమించాలి. అత్యున్నతఫలితాలనుసాధించడంలో ఉపాధ్యాయులే కేంద్రంగాఉన్నారని గుర్తించి ఉపాధ్యాయులందరిని మానసికంగా మానవీయంగా సంసిద్ధులను చేయాలి. పాఠశాల అభివృద్ధికి అనుకూలమైన పర్యవేక్షణతో స్థానిక, మండల జిల్లా, రాష్ట్ర, స్థాయిలలో విద్యా సేవలను అందించడంపై మరింత నేరుగా దృష్టి పెట్టాలి మౌలికవనరులతోకూడిన కావలిసినన్ని పాఠశాలలు ఏర్పాటుచేయాలి. వివిధ రకాల యాజమాన్యాలు, సంస్థలు, సొసైటీల స్కూళ్లన్నింటినీ ప్రభుత్వ యాజమాన్యంలోకి తీసుకొని మౌలిక వసతులను సమకూర్చాలి. స్కూలు విద్య వరకు కామన్ స్కూల్ విధానం తప్ప వేరే మార్గం లేదని ప్రభుత్వాలు గుర్తించాలి.

**బట్టబయలయిన ప్రపంచబ్యాంకు కుతంత్రం**

ప్రపంచ బ్యాంకు స్థానిక రాష్ట్ర ప్రభుత్వాల ప్రమేయం లేకుండా కేంద్ర ప్రభుత్వం తో కూర్చుకున్న ఒప్పందం కేవలం నామ మాత్రంగా 14 శాతం నిధులను విద్యా వ్యవస్థకు కార్పొరేటెడ్ విద్యా వ్యవస్థ ద్వారా నేరుగా భర్తీ చేస్తుంది. ఇది భారత జనాభాలో దాదాపు 85 శాతం మందికి అందదు. ఇందులో ఎస్సిలు, ఎస్టీలు, ఓబిసిలు ముస్లింలు, డినోటిఫైడ్ తెగలు, వికలాంగులు, ముఖ్యంగా ఈ ప్రతి విభాగంలో మహిళలు ఉన్నారు. వివిధ సాకులతో వీరికి విద్య దూరమౌతుంది. పనితీరు అని పిలవబడే, "మెరిట్" ప్రత్యేక-ఆధారిత అంచనాలతో సంపన్నులకు మాత్రమే విద్య అందుతుంది. తక్కువ హాజరు పేరుతో ప్రభుత్వం సామాజిక న్యాయ కార్యక్రమాలను, రిజర్వేషన్ విధానాన్ని ఉపసంహరించుకొని స్కాలర్షిప్లు, ఫెలోషిప్లు రద్దు చేయబడుతాయి. 2009 విద్య హక్కు చట్టం ప్రకారం 25% ప్రవేశాలను ప్రైవేటు పాఠశాలల్లో ఆర్థికంగా వెనుకబడినపిల్లలకు అందివాల్సివుండగా. స్టార్స్ పథకంలో "సామర్థ్యాలు" మెరిట్ పై దృష్టి పెట్టడం వల్ల బలహీనవర్గాలకు నష్టం జరుగుతుంది. ఇప్పటికే భారతదేశంలో మార్కెట్ శక్తుల ద్వారా ప్రోత్సహించబడిన విద్య పిపిపి (పబ్లిక్ ప్రైవేట్ భాగస్వామ్యం) ప్రతికూల ప్రభావాన్ని చూపింది. గతం నుండి ప్రపంచ బ్యాంకు, కార్పొరేట్ రంగం ప్రోత్సహించిన కార్యక్రమాలు, పిపిపి వ్యూహాలతో విద్య ప్రైవేటీకరణ వల్ల భారతదేశంలో విద్య మరింత ఆర్థిక భారంగా మారింది. విద్య "మార్కెటీకరించబడిన తర్వాత ప్రభుత్వ విద్యా వ్యవస్థ నిర్వీర్యమైంది. విద్య వ్యాపారీకరణను ప్రోత్సహించడంతో పిపిపి నుంచి నాణ్యమైన విద్య అట్టడుగు, అల్పసంఖ్యాకులకు అందకుండాపోయింది.

**ముగింపు**

ప్రజా వ్యతిరేక, ప్రపంచ బ్యాంకు అనుకూల అభివృద్ధి కార్యక్రమాన్ని, ఆచరణ ప్రణాళికను ప్రకటించడమే ఈ స్టార్స్ లక్ష్యం. ప్రపంచ బ్యాంకు స్టార్స్ కార్యక్రమం భారతదేశం అట్టడుగు పాఠశాల విద్యా వ్యవస్థను దెబ్బతీస్తుంది. దీని ద్వారా పేదలకు చదువు అందదు. చదువుకునేవారికి కూడా చదువు అత్యంత ఖరీదు అవుతుంది. ప్రపంచ బ్యాంకు భారతదేశంలో 1990 ప్రవేశించి అనేక సంస్కరణలను చేసింది. అందులో ఆర్థిక, వాణిజ్య సంస్కరణలు ప్రధానమైనవి. ఈ నేపథ్యంలో ప్రపంచ వాణిజ్య సంస్థ దేశంలో విద్యతో పాటు 163 సేవలను వాణిజ్య అంశాలుగా గుర్తించింది. దీనితో విద్య వ్యాపారాంశాల జాబితాలోకి చేరింది. ఫలితంగా విద్యారంగంలోకి విదేశీ పెట్టుబడులు నేరుగా విరివిగా చేరడానికి అవకాశమేర్పడింది. బిర్లా అంబానీ కమిటీ విద్యను పరిశ్రమగా గుర్తించాలని ప్రకటించింది. దీనితో విద్య లాభ నష్టాల జాబితాలోకి చేరింది. ఇట్లా విద్య మౌలిక లక్ష్యమే తిరగబడింది. క్రమంగా విద్యలో ప్రైవేటు పెట్టుబడికి అవకాశాలు సుగమమైంది.

భారతదేశం లాంటి అధిక జనాభా గలిగి, అక్షరాస్యతలో వెనుకబడిన, పేదరికం అధికంగా ఉన్న దేశంలో విద్యను ఒక సామాజిక అంశంగా

# సిలబస్ కుదింపుకు కుటిల యత్నాలు

***విద్యను మతతత్వీకరించి, ప్రైవేట్‌పరం చేసి, వ్యాపార వస్తువుగా మార్చే దిశగా కేంద్ర ప్రభుత్వం అడుగులు వేస్తోందనీ, ఈ నేపథ్యంలోనే సిలబస్‌లో మార్పులు చేయడానికి ప్రయత్నిస్తోందనీ అంటున్నారు* బి.రామకృష్ణ**

కోవిడ్-19 వ్యాప్తి ఫలితంగా దేశంలో అలాగే ప్రపంచవ్యాప్తంగా అసాధారణ పరిస్థితి, ఆరోగ్య అత్యయిక పరిస్థితి కొనసాగుతున్న నేపథ్యంలో పాఠశాలలు మూతపడ్డాయని, తరగతి బోధనా దినాలకు నష్టం జరిగిందని, దానికి అనుగుణంగా 9 నుండి 12 తరగతుల సిలబస్‌ను రివైజ్ చేశారని 2020 జూలై 7న సెంట్రల్ బోర్డ్ ఆఫ్ సెకండరీ ఎడ్యుకేషన్ (సిబిఎస్ఇ) ఒక సర్క్యులర్‌ను విడుదల చేసింది. సాధించవలసిన అభ్యసన స్థాయిల ప్రాధాన్యతను దృష్టిలో పెట్టుకుని కీలకమైన భావనలను నిలిపి ఉంచుతూ సిలబస్‌ను హేతుబద్ధీకరణ చేయడం జరిగిందని సిబిఎస్ఇ తెలిపింది. మొత్తం 190 సబ్జెక్టులలో ప్రతిదానిలోను 30 శాతం వరకు సిలబస్‌ను తొలగించారని, వీటిని పరీక్షలకు పరిగణించరని చెప్పారు.

సిలబస్‌ను తగ్గించమని 1500 స్పందనలు వచ్చాయని, వారందరికీ మానవ వనరుల మంత్రిత్వ శాఖ మంత్రి రమేష్ పోఖ్రియాల్ ధన్యవాదాలు తెలిపాడు. హేతుబద్ధమైన మౌలిక పాఠ్యాంశాలను తొలగించడం సరైంది కాదు అంటున్న వాదనలను ఖండిస్తూ విద్యలో రాజకీయాలు వద్దని రాజకీయాలు మరింత విద్యావంతం కావాలని మానవ వనరుల మంత్రి ప్రకటించాడు. తమ రాజకీయ భావజాలానికి భిన్నమైన పాఠ్యాంశాలను తొలగిస్తూ ఈ మాటలు అనడం వారికే చెల్లింది. తద్వారా సిలబస్‌ను సిబిఎస్ఇ తనకు తానుగా చేసినవి కావని పాలక పార్టీ భావజాల ఆదేశాల మేరకు జరిగాయని స్పష్టమవుతున్నది.

హేతుబద్ధీకరణ (రేషనలైజేషన్) అనే పదం అర్థవంతమైనది. అయితే ఆ పేరు మీద ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో, నేటి రెండు తెలుగు రాష్ట్రాల్లో ఇతర అనేక రాష్ట్రాల్లో వేలకొద్ది ప్రభుత్వ పాఠశాలలను మూసివేయడం గత దశాబ్ద కాలానికి పైగా జరుగుతూనే ఉంది. దేశం మొత్తం మీద ఈ విధంగా గుర్తించబడిన ప్రభుత్వ పాఠశాలలు రెండున్నర లక్షలకు పైగానే ఉన్నాయని 2017లో కేంద్ర మానవ వనరుల మంత్రిత్వ శాఖ తెలిపింది. ఈ అనుభవాల దృష్ట్యా రేషనలైజేషన్ అంటేనే వ్యతిరేక భావాన్ని, ప్రమాదాన్ని సూచించేదిగా మారిందంటే ఆశ్చర్యపోవాల్సిన పరిస్థితి లేకుండా పోయింది. నేడు సిబిఎస్ఇ చెబుతున్న సిలబస్ రేషనలైజేషన్ దీనికి మరింత ఊతం చేకూరుస్తున్నది.

మచ్చుకు సైన్సు, సోషల్ పాఠ్యపుస్తకాలలో కత్తిరించిన కొన్ని పాఠాలను గమనిస్తే సిలబస్ రేషనలైజేషన్ ఎంత అర్థరహితమైనదో, ప్రమాదకరమైనదో అర్థమవుతుంది. కీలకమైన మౌలిక భావనలను అలాగే ఉంచుతూ సిలబసును తగ్గించామని చెప్పిన మాటల్లోని మోసం

స్వీకరించకపోవడం ప్రగతికి, వికాసానికి అవరోధంగా భావించాలి. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థలో విద్య వైద్యరంగాలు ప్రభుత్వమే నిర్వహించడం సాధారణమైనప్పటికీ, ప్రపంచ ప్రసిద్ధి పొందిన పెట్టుబడిదారీ ఆర్థికవేత్త ఆడమ్ స్మిత్ రాసిన తన జాతుల సంపద గ్రంథంలో కూడా అన్నిరంగాలకు మూలం విద్య అని విద్యారంగం అభివృద్ధిపై మిగిలిన రంగాలు ఆధారపడినాయి కాబట్టి ఏ రంగాన్ని ప్రైవేటీకరించినా గాని విద్యా వైద్య రంగాలను ప్రభుత్వ ఆధ్వర్యంలో నిర్వహించాలని సూచించడమంటే సమాజ అభివృద్ధిలో పెట్టుబడిదారులు కూడా విద్యారంగానికి ఇచ్చిన ప్రాధాన్యతను అర్థం చేసుకోవచ్చు. ప్రపంచ బ్యాంకు, భారత ప్రభుత్వం రెండూ స్టార్స్ ప్రోగ్రామ్‌ను ఆమోదించడానికి తహతహలేదు. యావత్ దేశంలోని ప్రజానీకం కరోనాతో తీవ్ర విపత్కర పరిస్థితులలో బిక్కుబిక్కుమంటూ బతుకుతున్న ప్రస్తుతతరుణంలో వారిని గట్టెక్కించడమే ప్రధాన ప్రాజెక్టుగా భావించాల్సిన పాలకవర్గాలు భారత సార్వభౌమాధికారాన్ని కాపాడడంలో కీలకమైన ప్రభుత్వ రంగసంస్థలు శాస్త్ర సాంకేతిక రంగతో పాటు రక్షణరంగాన్నికూడా ఇదే అదునుగా చూచి ప్రైవేటీకరణకు దారిమళ్లించింది. దీనితోపాటు ఇదే సమయంలో నిరసనలకు బహిరంగ సామూహిక వ్యతిరేకతలను అవకాశంలేని సమయంగా భావించి ప్రపంచ బ్యాంకు వత్తిడితో నేడు భారత దేశం అట్టడుగు పాఠశాల విద్యా వ్యవస్థను దెబ్బతీసే ఈ స్టార్స్ కార్యక్రమాన్ని అమలుచేయాలని భావించడం అత్యంత దుర్మార్గం. నిజానికి ప్రతి భారతీయ పౌరుడికి విద్య ఒక హక్కు, రాజ్యాంగం ప్రకారం ప్రాథమిక విద్య అందరికీ నిర్బంధంగా, ఉచితంగా అందించాలి. ఉన్నత విద్య అందరికీ తమ ప్రతిభ మీద ఆధారపడి అందుబాటులో ఉండాలి. మనిషి తన తెలివి తేటల్ని పూర్తిగా అభివృద్ధి చేసుకోడానికి వీలుగా విద్యాభ్యాసం కొనసాగిస్తు ఉండాలి. అందుకు ప్రభుత్వం సామాజిక అవసరాలకు తగిన అవకాశాలను కల్పించాలి. అప్పుడే ఆ మనిషికి మౌలికమైన స్వేచ్ఛ లభిస్తుంది. తద్వారా మానవ హక్కులను కాపాడుకోవచ్చు. అంతేగాని ప్రపంచ బ్యాంకు ఆశిస్తున్నట్లు అంతర్జాతీయ మార్కెట్లో అతి తక్కువ వేతనానికి శ్రామికులు లభించే విధంగా, భారత ప్రభుత్వానికి ఎటువంటి సామాజిక స్పందనలేని నిర్లిప్తత, నైపుణ్యంతోకూడిన శ్రామిక బాహుళ్యం మాత్రమే అవసరం అనుకుంటే. సదసద్వివేచనను కలిగించ వలిసిన విద్య భవిషత్ తరాల మెదడు మొద్దుబారి మరమనిషిగా మార్చలన్న ప్రపంచ బ్యాంకు కుట్ర వాస్తవం కానుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

తేలిపోతుంది. కీలకమైన వీటినే తొలగించడం ఎందుకు అనే విషయంలో శాస్త్రీయత, స్పష్టత లేదు. ఏ విద్యావేత్తలను, ఏ పాఠ్య ప్రణాళిక రూపకర్తలను సంప్రదించారో, దీని వెనుక జరిగిన మేధోమధనం వివరాలు చెప్పనేలేదు. కరికులం కమిటీ అంగీకారంతో అని మాత్రం ప్రస్తావించారు.

పిల్లల నిజజీవిత అనుభవాలకు స్థానం లేని అసంబద్ధమైన సిలబస్ భారంగా పరిణమిస్తుందని ప్రొఫెసర్ యశ్ పాల్ 1993లో లెర్నింగ్ విథౌట్ బర్డన్ అనే నివేదికలో స్పష్టం చేశాడు. ఆయన నేతృత్వంలో రూపొందిన పాఠ్యపుస్తకాల్లోని నిజ జీవిత అనుభవాలకు స్థానమిచ్చే కీలక భావనలను కరోనా సంక్షోభం ఆసరాగా తొలగించి వేసింది. ఇదే విషయాన్ని జాతీయ విద్యా శిక్షణా పరిశోధనా సంస్థ (ఎన్‌సిఇఆర్‌టి) ఒకప్పటి డైరెక్టర్ ప్రొఫెసర్ కృష్ణ కుమార్ ఎకనామికల్ పొలిటికల్ వీక్లీ పత్రికలో రాశాడు. ఈ మార్గంలోనే రాష్ట్రాలు కూడా కోతలు వేస్తాయని, బీజేపీ పాలిత రాష్ట్రాల్లో పక్కాగా ఇవే అంశాలపై వేటు పడుతుందని ఊహించడం తప్పు కాబోదు.

పదవ తరగతి సైన్స్‌లో అనువంశికత జీవ పరిణామం, మొక్కలు జంతువులలో నియంత్రణ సమన్వయం అనేవి తీసివేసారు. 12వ తరగతిలో జీవుల్లో ప్రత్యుత్పత్తి జీవపరిణామం, ఆవరణ వ్యవస్థ పర్యావరణ సమస్యలు శక్తి వనరులు వంటి కీలకమైన పాఠ్యాంశాలను తొలగించారు. జీవ పరిణామం ప్రత్యుత్పత్తి పాఠ్యాంశాలలోని శాస్త్రీయ విషయాలు మత చాందస భావజాలాలకు భిన్నమైనవి. జీవపరిణామ సిద్ధాంతాన్ని తన పరిశోధనల ద్వారా డార్విన్ ప్రతిపాదించిన సందర్భంలోనే క్రిస్టియన్ మతపెద్దలు తీవ్రస్థాయిలో వ్యతిరేకించారు.

ప్రపంచవ్యాప్తంగా కూడా అన్ని రకాల మత ఛాందసులకు గిట్టని సత్యాలివి. కేంద్రంలోని పాలక పార్టీ భావజాలం దీనికి భిన్నమైనది కాదు. మానవ సమాజ పరిణామ అధ్యయనంలో లూయీ హెన్రీ మోర్గాన్, అదనపు విలువ సిద్ధాంతకర్త మార్క్స్, జీవపరిణామ పరిశోధనలో డార్విన్ లు ప్రపంచ సమాజాన్ని తీవ్రంగా ప్రభావితం చేశారని ఎంగెల్స్ చెప్పాడు. జీవుల పుట్టుక వాటి పరిణామ దశలో గురించి వివరించే అనువంశికత జీవపరిణామ పరిశోధనా ఫలితాలు జగత్తంతా దైవ సృష్టి అనే దాన్ని సవాల్ చేస్తాయి. ప్రకృతిలో జరుగుతున్న మార్పులను సాక్ష్యాధారాలతో అర్థం చేయిస్తాయి. మూఢత్వం అంధవిశ్వాసాల నుండి వెలుగుల వైపు నడిపిస్తాయి.

సైన్స్ జీవశాస్త్రాలలో తొలగించిన ఈ విషయాలు మానవ పరిణామ వికాస దశలను శాస్త్రీయంగా వివరిస్తాయి. మానవ సమాజానికి పర్యావరణానికి మధ్య ఉన్న అవినాభావ సంబంధాలను ప్రకృతిలోని సమతుల్యతను పరిరక్షించుకోవలసిన ఆవశ్యకతకు సంబంధించి ముఖ్యమైన పరిజ్ఞానాన్ని అందిస్తాయి. ప్రపంచవ్యాప్తంగా ప్రబలి లక్షలాది మందిని బలిగొంటున్న కరోనా విపత్తుకు పర్యావరణ విధ్వంసానికి జన్యుమార్పిడి పంటలు జన్యుమార్పిడి జీవజాల ఉత్పత్తి వంటి వాటికి సంబంధం ఉన్నదని సైన్స్ గుర్తిస్తున్న సందర్భంలో అటువంటి పాఠ్యాంశాలు అవసరం మరింతగా ఉంటుంది.

జల వాయు కాలుష్యం, కాలుష్య కారకాలు, అణుధార్మిక వ్యర్థాలు, అడవుల నరికివేత, ఓజోన్ పొర విధ్వంసం గ్రీన్ హౌస్ ప్రభావం వంటివి తెస్తున్న వాతావరణ మార్పులు ప్రకృతిలోని జీవజాలం మానవ ఆరోగ్యంపై అవి చూపే తీవ్రమైన ప్రమాదకర ప్రభావాలను గురించి వివరించే పాఠం పర్యావరణ సమస్యలను పన్నెండవ తరగతి నుండి తొలగించారు. బహుళజాతి కార్పొరేట్ శక్తులు చేస్తున్న ప్రపంచ మార్కెట్ వ్యాపారాలు పర్యావరణాన్ని ప్రకృతిని ధ్వంసం చేస్తున్నాయి. వీటి అనైతిక పర్యావరణ వ్యతిరేక విధానాల ఫలితంగా జీవజాలంపై అందులో భాగంగా మానవ సమాజం మనుగడపై ప్రతికూల ప్రభావాన్ని కలుగజేస్తున్న విషయాలను పర్యావరణ పరిశోధనలు అధ్యయనాలు స్పష్టం చేస్తున్నాయి. ఈ పాఠ్యాంశంలోని భావనలు ప్రపంచ మార్కెట్ శక్తులకు పెట్టుబడికి వ్యతిరేక భావాలను కలిగించే అవకాశం ఉంటుంది కనుక వీటిని తొలగించారని అనుకోవడం సత్యదూరం కాదు కదా.

పెట్టుబడిదారి భావజాల సంస్కృతి సామాజిక నిర్మాణం ప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తున్న నేపథ్యంలో పర్యావరణ విధ్వంసం అనివార్యంగా మారుతున్నది. ఈ భావజాలానికి ఊడిగం చేయడంలో ప్రపంచ దేశాల పాలకవర్గాలు ముందంజలో ఉంటున్నాయి. ఇక్కడ మతానికి పెట్టుబడికి భలే సామరస్యం అంగీకారం సర్దుబాటు కుదురుతుంది. ఈ విషయంలో కేంద్రంలోని అధికారపార్టీ మినహాయింపు కాదు.

ఉన్నత సెకండరీస్థాయి (ఇంటర్మీడియట్) భౌతిక శాస్త్రంలో న్యూటన్ గమన నియమాలు లేకుండా ఉండటాన్ని ఊహించగలమా. ప్రకృతిలోని భౌతిక నియమాలకు సంబంధించి న్యూటన్ గమన నియమాలు ప్రపంచ విజ్ఞాన శాస్త్రానికి అతి కీలకమైన పరిజ్ఞానాన్ని చేర్చాయి. వీటిని పదకొండవ తరగతి భౌతికశాస్త్రం నుండి తొలగించారు.

మానవీయ కోణం లేని సైన్స్ వృథా అని కొఠారీ కమిషన్ అభిప్రాయ పడింది. మానవీయ విలువల స్థాపనకు సమానత్వానికి అట్టడుగు వర్గాల సముద్ధరణకు స్థానం ఇచ్చేలా సైన్స్‌ని అర్థం చేసుకోవడం అందుకోసం ఉన్నతస్థాయి పరిశోధనలు జరగడంగా కాకుండా ఉన్నత వర్గాల, పెట్టుబడిదారీ మార్కెట్ శక్తుల ప్రయోజనాలను నెరవేర్చేదిగా చేయడం సరైంది కాదు. ప్రజాస్వామిక విలువలను విస్తృత పరచడానికి కృషి చేస్తున్న సామాజిక శ్రేణులను మేధావులను కట్టడి చేస్తున్నారు. అందులో భాగంగానే సామాజిక శాస్త్రాల ప్రాధాన్యతను తగ్గించడానికి వాటిలోని మౌలికమైన భావనలను తొలగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రాజనీతి శాస్త్రానికి సంబంధించి 9వ తరగతిలో ప్రజాస్వామిక హక్కులు, పదవ తరగతిలో ప్రజాస్వామ్యం – వైవిధ్యం, జెండర్ మతం కులం, ప్రముఖమైన పోరాటాలు మరియు ఉద్యమాలు, ప్రజాస్వామ్యానికి సవాళ్ళు, సమాఖ్య తత్వం, స్థానిక ప్రభుత్వాల ఆవశ్యకత వాటి పెరుగుదల, పౌరసత్వం జాతీయవాదం లౌకిక వాదం, పొరుగు దేశాలైన పాకిస్థాన్, బంగ్లాదేశ్, నేపాల్, శ్రీలంక, మయన్మార్లతో సంబంధాలు, సామాజిక మరియు నయా సామాజిక ఉద్యమాలు, ప్రాంతీయ ఆకాంక్షలు అనే పాఠాలను తొలగించారు. చరిత్రకు సంబంధించి పదకొండవ తరగతిలో ఆరంభ సమాజాలు, సంచార సామ్రాజ్యాలు, సంస్కృతుల సంఘర్షణ, రైతులు జమిందారులు రాజ్యం, 12వ తరగతిలో వలసవాద నగరాలు, విభజనపై అవగాహన అనే పాఠ్యాంశాలను తొలగించారు. సిలబసులో ఉంచినారని సిబిఎస్ఇ చెప్పిన కీలకాంశాలలో వీటికి స్థానం దక్కలేదు. అంటే ఇవి ఉంచదగిన ముఖ్యమైన భావనలు కావని చెప్పకనే

చెబుతున్నారన్నమాట.

సెకండరీ, ఉన్నత సెకండరీ స్థాయిలో ప్రజాస్వామ్యం ప్రజాస్వామిక హక్కులు వాటికి ఎదురయ్యే సవాళ్లు, ప్రజాస్వామిక విలువలు సాధించుకోవడానికి జరిగిన ఉద్యమాలు చర్చించబడని సామాజిక శాస్త్రం సామాజిక శాస్త్రం అవుతుందా. ఇవి మౌలికమైన విషయాలు కావని ఏ పాఠ్యప్రణాళిక నిపుణుడైన చెప్పగలడా.

అధికార వికేంద్రీకరణ అనేది ఒక ప్రజాస్వామిక లక్షణం. స్థానిక ప్రభుత్వాల ఆవశ్యకత వాటి అభివృద్ధి అనే భావన ముఖ్యమైనది. భిన్న జాతుల సంస్కృతుల భిన్న భౌగోళిక సంబంధాలతో కూడి ఉన్న దేశంలో సమాఖ్యతత్వం అనేది పురోగామి లక్షణం. బిజెపి ప్రభుత్వం తెచ్చిన పౌరసత్వ సవరణ చట్టానికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా నిరసన ఉద్యమాలు ముందుకు వచ్చాయి. వీటిలో భాగంగా ఢిల్లీలో నిరసన తెలుపుతున్న వారిపై పోలీసులు విపరీతమైన నిర్బంధాన్ని ప్రయోగించారు. ఇదే సందర్భంలో కోవిడ్-19 ముందుకు వచ్చింది. దీన్ని అడ్డం పెట్టుకుని శాంతియుత నిరసన వ్యతిరేక గొంతులకు అవకాశం లేకుండా చేస్తున్నారు. ఇదే సందర్భంలో పౌరసత్వం పాఠ్యంశాన్ని తొలగించడాన్ని పౌరసత్వంపై చర్చ జరగకుండా దాని లోతుపాతులు తెలుసుకొనీయకుండా చేసే ప్రయత్నంగా చూడవచ్చు.

బ్రిటిష్ వలస పాలనకు అలాగే భూస్వామ్య విధానానికి, రాచరిక పాలనలకు, మత మూఢత్వాలకు, కుల వివక్షతకు వ్యతిరేకంగా అనేకానేక సామాజిక రాజకీయ సాంస్కృతిక సంస్కరణ ఉద్యమాలు వచ్చాయి. తమ స్వయం ప్రతిపత్తి కోసం దేశవ్యాప్తంగా అనేక చోట్ల ఆదివాసి ఉద్యమాలు వచ్చాయి. ప్రజలు అనన్య త్యాగాలు చేశారు. పడరాని పాట్లు పడ్డారు, ఎనలేని కష్టాలను చవిచూశారు. ఇదంతా కూడా చరిత్రలో రికార్డు అయిన విషయమే. అటువంటి న్యాయమైన సాహసమైన త్యాగపూరితమైన ప్రజాస్వామిక ఉద్యమాల ఆకాంక్షలు రాజ్యాంగంలోని ప్రవేశిక ఆదేశిక సూత్రాలు ప్రాథమిక హక్కుల రూపంలో కొంత మేరకు వ్యక్తీకరించబడ్డాయి. సమాఖ్యతత్వం, ప్రజాస్వామ్యం, సమానత్వం సామ్యవాదం లౌకికవాదం అనేవి రాజ్యాంగ మౌలిక విలువలు. ఇవాళ వీటికి ప్రమాదం ముంచుకొచ్చింది.

రాజ్యాంగాన్ని మార్చడం మనుస్మృతిని అమలు చేయడం అనే సంఘ్ పరివార్ ఎజెండాయే తమ ఎజెండా అని అప్పుడప్పుడు కొందరు బిజెపి ప్రజాప్రతినిధులు మంత్రులు బహిర్గత పరుస్తుంటారు. వెంటనే మరొకరు అది ప్రభుత్వ విధానం కాదని ప్రకటిస్తూ దాగుడుమూతలు ఆడుతుంటారు. ఈ క్రమంలో చూసినప్పుడు ప్రజాస్వామ్యం లౌకికవాదం సమాఖ్య తత్వం భావనలను పాఠ్యాంశాల నుంచి తొలగించడం వెనక ఉన్న ప్రమాదకర భావజాలం తేటతెల్లం కాకమానదు. ఒకే దేశం ఒకే పాలన ఒకే మతం ఒకే సంస్కృతి ఒకే భాష ఒకే నాయకుడు అనే సిద్ధాంత లక్ష్యాలను సాధించడానికి అంబేద్కర్ నేతృత్వంలో రూపొందించబడిన రాజ్యాంగం దానిలోని మౌలిక సూత్రాలు అడ్డం వస్తాయి. ఏకీకరణకు, కేంద్రీకరణకు పట్టంకట్టాలని అనుకునే వారికి ఈ విలువలు ఎందుకు నచ్చుతాయి. వాటిని ధ్వంసం చేయడమే లక్ష్యంగా పనిచేసే వాళ్లకు పాఠ్యాంశాలలో అవి ఉండడం సహించదు.

అఖండ భారత్ గురించి కలలు కనేవారికి సమాఖ్య విధానం గాని ప్రాంతీయ ఆకాంక్షలు గాని స్థానిక ప్రభుత్వాలకు అధికారాలు గాని నచ్చునివి గానే ఉండడం సహజమే. చరిత్రలో రాజుల భూస్వాముల దొరల పాలనకు వ్యతిరేకంగా జరిగిన రైతాంగ ఆదివాసీ పోరాటాలు ప్రజాస్వామిక విలువలకు దారులు వేశాయి. అటువంటి చరిత్రను విద్యార్థులు అభ్యసించకుండా చేయడం సరైంది ఎలా అవుతుంది.

జ్ఞానాన్ని నిజజీవిత సందర్భాలలో అన్వయించడం, సమాజంలోని సంక్లిష్టతలను, వ్యవస్థాగత అసమానతా మూలాలను హింసను ఆధిపత్యాలను, అశాస్త్రీయతలను, ప్రకృతిపై జరుగుతున్న విధ్వంసాన్ని విశ్లేషిస్తూ, సహజ సంపదలను ప్రజలందరూ సమంగా అనుభవించే, అందరికీ ఒకే విలువ ఆత్మగౌరవంతో కూడిన ఉన్నత సమాజానికి బాటలు వేసే దిశలో మేధోవికాసాన్ని పెంపొందించేందుకు విద్యావ్యవస్థ దోహదపడటంగా కాకుండా పరీక్షలకు సిద్ధపడేలా చేసేదిగా ఉండటం దురదృష్టకరం. అభ్యసనాని కంటే పరీక్షల్లో మంచి స్కోరు ఫలితాల పైనే దృష్టి పెడుతున్నారు.

ఉన్నత చదువుల్లో గాని ఉద్యోగాల్లో గాని ఆ ఫలితాలే ప్రామాణికం అవుతున్నాయి. పరీక్షల కోసం సిలబసును తగ్గించాలని అనుకుంటున్నారు కానీ నిజమైన అర్థంలో విద్యార్థి వ్యక్తిత్వ నిర్మాణానికి అవసరమయ్యే విషయాలు ప్రధానం కావడం లేదు. ఒకవేళ విద్యార్థులకు కరోనా సంక్షోభం సందర్భంలో ప్రత్యక్ష బోధనా దినాలు నష్టపోవడం వల్ల సిలబస్ భారం అయిందనిపిస్తే కనుక చివరి పాఠాలనో లేదా ప్రతి పాఠంలోని ప్రధాన భావనలకు నష్టం కలగకుండా పునరావృతం అయ్యే వాటిని దీర్ఘమైన వివరణలను, మౌలిక భావనలకు కొనసాగింపుగా ఉన్నత స్థాయిలో ఉండే అంశాలను మినహాయించడం గురించి ఆలోచన చేయవచ్చు. ఇది ఒక పార్శ్వం.

అయితే ప్రత్యక్ష తరగతి బోధన కోసం కోవిడ్-19 నిబంధనలను పాటిస్తూ ప్రస్తుత పాఠశాల యాజమాన్య పద్ధతులలో మార్పులు తీసుకురావడం దీనికి సప్లిమెంట్‌గా ప్రతి పేద విద్యార్థికి బోధనాభ్యసనను అందించేలా ఎలక్ట్రానిక్ పరికరాలను అందుబాటులో ఉంచడం అనేది మరో పార్శ్వం. ఇటువైపుగా ఆలోచిస్తున్న దాఖలాలు లేవు. ఆన్‌లైన్ తరగతులను నిర్వహించే పేరు మీద ప్రైవేట్ విద్యా సంస్థలు ఫీజులు వసూలు చేస్తూ విద్యా వ్యాపారాన్ని కొనసాగిస్తున్నాయి. దీనిని నిరోధించే ప్రయత్నాలు లేవు.

వివక్షతతో కూడిన విద్యా విధానం, విద్యా వ్యవస్థ నిర్వహణలో కేంద్రీకృత తత్వం, ఆన్‌లైన్ చదువులు, సిలబసులో తగ్గింపుల గురించి జాతీయ విద్యా విధానం 2020లో చర్చించారు. ఈ విధానం మొదటిసారిగా మోది ప్రధాని అయిన కాలంలోనే రూపుదిద్దుకున్నది. ఈ విద్యా విధానంలో కీలకాంశాలుగా విద్యా కేంద్రీకరణ, వ్యాపారీకరణ మత తత్వీకరణ అనే వాటిని గుర్తించవచ్చు. అందుకు అనుగుణంగానే సిలబస్ రేషనలైజేషన్ పేరుతో సిబిఎస్‌సి పాఠ్యాంశాలను తొలగించిందని అర్థం చేసుకోవచ్చు. భవిష్యత్తులో జాతీయ విద్యా విధానం 2020ను అమలు చేసేటప్పుడు సిలబస్‌ను తగ్గించే విషయంలో ఏయే మౌలిక భావనలను తొలగిస్తారో తెలపడానికి ప్రస్తుత కత్తిరింపులు ఉదాహరణగా నిలుస్తాయని అనుకోవచ్చు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఖైదీల ఆరోగ్య హక్కును భారత్ సమర్థిస్తోందా?

***జైలు మాన్యువల్‌లో ఖైదీల కోసం అనేక హక్కులు పొందుపరిచినా 70 శాతం విచారణ ఖైదీలతో నిండిన జైళ్లే హక్కుల ఉల్లంఘనకు పెద్ద నిదర్శనం అని అంటున్నారు* సంచితా కదమ్**

కోవిడ్-19ని మహమ్మారిగా ప్రభుత్వం గుర్తించి మార్చి 24న లాక్‌డౌన్ ప్రకటించిన కొద్ది రోజులకి, దేశవ్యాప్తంగా జైళ్లలో ఉన్న ఖైదీలకు ఎదురయ్యే ప్రమాదాన్ని దృష్టిలో ఉంచుకొని సుప్రీంకోర్టు కొన్ని ఆదేశాలు ఇచ్చింది. రాష్ట్రస్థాయిలో ఉన్నతస్థాయి కమిటీలను ఏర్పాటు చేయాలని, ఏయే విభాగాలకు చెందిన ఖైదీలను అత్యవసర పెరోల్ మీద విడుదల చేయాలో ఆ కమిటీ నిర్ణయించాలని సూచించింది. తక్కువ తీవ్రమైన నేరాలకు శిక్ష అనుభవిస్తున్నవారు, వృద్ధాప్యపు జబ్బుల మూలంగా కరోనాకు త్వరగా గురయే ఖైదీల వంటి వారి విడుదల పట్ల ఈ కమిటీలు సూచనలు చేయాలి. అలాంటి కమిటీలను ఏర్పాటు చేశారు. నిజానికి సామాజిక దూరాన్ని పాటించే అవకాశం లేకుండా ఖైదీలు కిక్కిరిసి ఉన్న జైళ్లలో నుండి కొంతమందిని విడుదల చేయడం కూడా జరిగింది.

ఇలాంటి విపత్కర స్థితిలో ఖైదీల ఆరోగ్యపు హక్కుకు స్పష్టమైన ప్రాధాన్యతను న్యాయస్థానం ఇవ్వడం హర్షించాల్సిన అంశం. అయితే ఇలాంటి మహమ్మారి లేని ప్రాంతాలలోని జైళ్లల్లో ఖైదీలకు ఉండే ఆరోగ్యపు హక్కు మాటేమిటి? వృద్ధుడైన రాజకీయ కార్యకర్త వరవరరావు నిర్బంధానికి సంబంధించి ఈ అంశం చర్చలోకి వచ్చింది. సాధారణంగా ఖైదీల హక్కులు ప్రసార మాధ్యమాల్లో జరిగే చర్చలలో రోజువారీ అంశంగా ఉండవు. మహారాష్ట్రలోని జైళ్లలో ఖైదీల పట్ల అనుసరిస్తున్న వైఖరిని పరిశీలిద్దాం.

**వరవరరావుకు సంబంధించి**

ఆయన ఆరోగ్య పరిస్థితి క్షీణించడంతో జులై 13న వరవరరావును అత్యవసరంగా జె.జె. ఆసుపత్రికి మార్చారు. ఆయన తన కుటుంబ సభ్యులతో ఫోన్‌లో మాట్లాడినప్పుడు ఆయన ఆరోగ్యం ఎంత విషమంగా ఉందో అర్థం చేసుకున్న వాళ్లు, వెంటనే విలేఖరుల సమావేశం పెట్టి ఆయనను తక్షణం మెరుగైన చికిత్స కోసం ఆసుపత్రికి తరలించాలని డిమాండ్ చేశారు. ఆయనను జె.జె. ఆసుపత్రికి తరలించినట్లు కూడా అధికారులు కుటుంబానికి తెలియజేయలేదు. కేవలం ఒక స్థానిక నాయకుడి జోక్యం కారణంగానే వారికి ఆ సమాచారం అందింది. ఇంతకు ముందు చేసినట్టుగానే ఇప్పుడు కూడా అరాకొరా వైద్యం చేయించి ఆయన్ని మళ్లీ జైలుకు తరలిస్తారనే భయం కుటుంబానికి ఉంది.

**మహారాష్ట్ర అనుభవం**

మహారాష్ట్ర జైళ్ల మాన్యువల్‌లోని నాలుగో అధ్యాయం 'జైలు ఆసుపత్రి'కి సంబంధించిన అంశాలను వివరిస్తుంది. ఖైదీలు ఆరోగ్యకరమైన మానవులుగా జీవించే పరిస్థితులు జైళ్లలో కల్పించడానికి అవసరమైన అనేక నిబంధనలు ఇందులో ఉన్నాయి. కాని వాస్తవం దీనికి పూర్తిగా భిన్నం. దేశవ్యాప్తంగా జైళ్లలో పరిస్థితులు అత్యంత దుర్భరంగా ఉన్నాయి.

ప్రతి జైలులో ఒక వైద్య అధికారి ఉంటాడు. అయితే అతడికి తాగునీటి నాణ్యతను పరిశీలించడం, జైలులో గదులు ఖైదీలు ఉండడానికి అనుగుణంగా ఉన్నాయో లేదో పరిశీలించడం, ఖైదీల ఆరోగ్యాన్ని ప్రతిరోజూ పరిశీలించడం వంటి అనేకమైన బాధ్యతలు ఉంటాయి.

ఖైదీలకు ఇవ్వాల్సిన ఆహారానికి సంబంధించిన కొన్ని నియమాలు న్నాయి. అనారోగ్యంగా ఉన్న ఖైదీలకు అదనపు ఆహార సదుపాయాన్ని కల్పించాలంటే మెడికల్ ఆఫీసర్ సర్టిఫికెట్ ఇవ్వాలి. జైలులో శానిటరీ వాతావరణం సక్రమంగా ఉండేటట్లు చూడడమూ ఆయన బాధ్యతే.

సెక్షన్ 1, నిబంధన 3(34) ప్రకారం ఖైదీ ఆరోగ్యస్థితిని బట్టి అతణ్ణి వైద్య సంబంధమైన కారణం మీద తక్షణం విడుదల చేయాలా వద్దా అనేది కూడా వైద్య అధికారే నిర్ణయించాలి. అలానే ఇతర రకాలైన చికిత్సల కోసంగానీ, ఆపరేషన్లకోసంగానీ జైలు బయట ఉండే ఆసుపత్రికి ఖైదీలను తరలించాలనే నిర్ణయం కూడా ఆయనే చేయాలి.

సెక్షన్ 2లో ఉన్న సాధారణ నిబంధనల ప్రకారం బలహీనులు, అనారోగ్యం నుండి కోలుకుంటున్నవారు, వృద్ధ ఖైదీలకు ప్రత్యేక సౌకర్యాలు కల్పించాలి. దీని ప్రకారం అలాంటి ఖైదీలను ఇతరుల నుంచి వేరుచేసి ఉంచాలి. వాళ్లకి ప్రత్యేకమైన ఆహారాన్ని ఇవ్వాలి. ఖైదీని జైలు ఆసుపత్రిలో చేర్చినా, బయట సివిల్ ఆసుపత్రిలో చేర్చినా అక్కడయ్యే ఖర్చును ప్రభుత్వమే భరించాలి. ఇలా, ఖైదీల ఆరోగ్యాన్ని కాపాడడానికి సంబంధించిన నిబంధనలన్నీ చూడడానికి చాలా ఆదర్శవంతంగా ఉంటాయి. అయితే వాటిని అమలు చేయడం పూజ్యం.

**నమూనా జైలు మాన్యువల్, 2016**

హోం మంత్రిత్వశాఖ విడుదల చేసిన ఈ మాన్యువల్‌లో ఖైదీల హక్కులను వివరించారు. అందులో 'ప్రాథమిక కనీస అవసరాల హక్కు' కింద వైద్యం కూడా ఉంది. దాని ప్రకారం ఖైదీలకు 'తగినతం ఆహారం, ఆరోగ్యం, వైద్యసదుపాయం, చాలినంత పరిశుభ్రమైన తాగునీరు, ఆరోగ్యకరమైన వాతావరణ కల్పన, పరిసరాల, వ్యక్తిగత పరిశుభ్రత, చాలినన్ని దుస్తులు, పడక సౌకర్యం వంటివి' ఉన్నాయి. 'నివాసం' అనే శీర్షిక కింద 'ఖైదీలు నివసించడానికి, ప్రత్యేకించి పడుకోవడానికి వుద్దేశించిన స్థలాలు ఆరోగ్యకరమైన జీవనానికి తగినట్లుగా ఉండాలి' అని ఉంది.

సెక్షన్ 4.07.4 ప్రకారం ఖైదీల ఆరోగ్యానికి సంబంధించిన బాధ్యత

అక్కడి వైద్యసిబ్బందిది. వైద్యపరమైన జాగ్రత్త అంటే రోగాలు రాకుండా జాగ్రత్త తీసుకోవడం, జైలు ఆసుపత్రిలో చేర్చినప్పుడు వాళ్లపట్ల సాధారణ జాగ్రత్తలు తీసుకోవడం.

**ఖైదీల ఆరోగ్య హక్కు గురించి న్యాయస్థానాలు ఏం చెప్పాయి?**

రసిక్‌భాయ్ రామసన్ రాణా కేసులో గుజరాత్ హైకోర్టు ఇలా వ్యాఖ్యానించింది. బరోడాలోని కేంద్ర కారాగారంలో శిక్షపడిన ఖైదీలు తీవ్రమైన జబ్బులతో బాధపతున్నడుప్పుడు కూడా వాళ్లను ఆసుపత్రికి తీసుకువెళ్లడానికి తగినంతమంది ఎస్కార్ట్ పోలీసులు లేరన్న నెపంతో ఆ ఖైదీలకు అవసరమైన తక్షణ వైద్య చికిత్సను నిరాకరించినందుకు, హైకోర్టు, జైలు అధికారులను, జైళ్ల ఐ.జి.ని, ప్రభుత్వ అదనపు ప్రధాన కార్యదర్శిని తప్పుబట్టింది. 2005లో తనంతట తానుగా స్వీకరించిన రిట్ పిటీషన్ విషయంలో గుజరాత్ హైకోర్టు, 'అన్ని కేంద్ర, జిల్లాస్థాయి జైళ్లల్లో ఇంటెన్సివ్ కేర్ యూనిట్లు, పరీక్షలు జరిపే లాబరేటరీలు, నిపుణులైన డాక్టర్లు, నర్సులు, వైద్య చికిత్సకు అవసరమైన అధునాతన పరికరాలు ఉండేటట్టు చూడాల్సిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వానిదే'నని ఆదేశించింది. మరొక కేసులో ఢిల్లీ హైకోర్టు తీర్పునిస్తూ తీహార్ జైలులో ఖైదీలకు ధ్యానసంబంధమైన థెరాపీని, ఖైదీలకు అవసరమైన మానసిక సలహాలను అందించడానికి తగిన ఏర్పాట్లు చేయాలని సూచించింది.

ఒక వ్యక్తి అమాయకుడైనా చట్ట ప్రకారం శిక్షించదగిన నేరస్తుడైనా అతని ప్రాణాల్ని రక్షించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదేనని సుప్రీమ్‌కోర్టు పరమానంద్ కటారా కేసులో ఒక చారిత్రాత్మక తీర్పునిచ్చింది. ఈ తీర్పు ద్వారా న్యాయస్థానం భారతదేశంలో ఖైదీల హక్కులకు సంబంధించిన ఒక పటిష్టమైన సంప్రదాయానికి పునాది వేసింది. ప్రత్యేకించి, భారత రాజ్యాంగంలోని 21వ నిబంధనలో ఉన్న వైద్యానికి సంబంధించిన ప్రాథమిక హక్కుకు ఇది రక్షణ కల్పించింది. ఖైదీలకు, ప్రత్యేకించి విచారణలో ఉన్న ఖైదీలకు ఉండే చట్టబద్ధమైన, రాజ్యాంగ బద్ధమైన హక్కుల గురించి సుప్రీమ్‌కోర్టు 2016లో మరొక చారిత్రాత్మక తీర్పునిచ్చింది. భారతదేశంలో జైళ్ల సంస్కరణలకు సంబంధించిన అంశాన్ని దీనిలో చర్చించారు. ఆ సందర్భంగా న్యాయస్థానం ఇచ్చిన ఆదేశాలకు అనుగుణంగా హోం మంత్రిత్వ శాఖ నూతన మోడల్ జైళ్ల నిబంధనావళి, 2016ను తయారు చేసింది.

**ఖైదీల ఆరోగ్య హక్కుకు సంబంధించి అంతర్జాతీయ ప్రమాణాలు**

మానవ హక్కులకు సంబంధించి అనేక అంతర్జాతీయ సంస్థలు విడుదల చేసిన డాక్యుమెంట్లల్లో, తగినంత వైద్య సౌకర్యం లేకపోవడాన్ని శారీరక హింసతో సమానంగా పేర్కొన్నాయి. పౌర, రాజకీయ హక్కులకు సంబంధించిన ఒడంబడికలో భాగంగా, ఖైదీల ఆరోగ్య హక్కును, ప్రజలపట్ల మానవత్వంతో వ్యవహరించాల్సిన హక్కులో భాగంగా అర్థం చేసుకోవాలని ఐక్యరాజ్యసమితి మానవహక్కుల కమిటీ సూచించింది. జబ్బుపడిన ఖైదీలకు ఇవ్వవలసిన చికిత్సలకు సంబంధించిన కొన్ని సాధారణ నియమాలను ఐక్యరాజ్యసమితి మానవహక్కుల కమిషన్ 1990లో ఆమోదించింది. అందులో ఇలా పేర్కొన్నారు. 'దేశంలో లభ్యమయ్యే ఆరోగ్య సేవలను పొందడానికి ఖైదీలకు తప్పక అవకాశం ఉండాలి. వారు ఖైదీలు కాబట్టి వారి పట్ల వివక్షతను ప్రదర్శించకూడదు.'

హింసను నిరోధించడానికి ఏర్పడ్డ యూరోపియన్ కమిటీ తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేసింది. 'తగిన స్థాయిలో వైద్య సౌకర్యాలు లేకపోతే అది త్వరగా 'అమానవీయమైన వైఖరి' కిందకు దిగజారి పోతుంది. చాలినంత, పట్టించుకోని వైద్యస్థితి అమానవీయమే కాక దుర్మార్గం కూడా అని ఇంటర్ అమెరికన్ మానవహక్కుల న్యాయస్థానం అనేక కేసుల్లో పేర్కొంది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ 'మానసిక ఆరోగ్యం-జైళ్లు' అనే పేరుగల ఒక సమాచార పత్రాన్ని విడుదల చేసింది. ప్రతిదేశంలోనూ జాతీయ మానసిక వైద్య విధానాలలో, ఖైదీల మానసిక అవసరాలకు సంబంధించిన ప్రణాళికలు కూడా ఉండాలని అందులో ఉంది. బయట ఉండే సాధారణ ప్రజలు మానసిక అస్వస్థతలకు గురయినప్పుడు ఎలాంటి వైద్య సౌకర్యాలు పొందుతున్నారో అవన్నీ ఖైదీలకు కూడా వర్తించాలని అందులో సూచించారు.

నేరాన్ని నిరోధించడం, నేరస్తుల చికిత్స అనే అంశాన్ని చర్చించిన మొదటి ఐక్యరాజ్యసమితి సమావేశం 'ఖైదీల చికిత్సకు సంబంధించిన కనీసపు ప్రామాణిక నిబంధనలను' 1955లో ఆమోదించింది. అందులో మిగతా అంశాలతోపాటు, 'ప్రతి సంస్థలోనూ మానసిక చికిత్సకు సంబంధించిన ఎంతో కొంత పరిజ్ఞానం ఉన్న, అర్హత కలిగిన ఒక వైద్య అధికారి కనీసం ఉండాలని' సూచించింది. అంతేకాక ప్రతి ఖైదీకి, అర్హతగల మానసిక వైద్య అధికారి అందుబాటులో ఉండాలని, జైలులోకి తీసుకున్నప్పుడు, ఆ తరవాత అవసరమైనప్పుడూ సాధ్యమైనంతవరకు ప్రతి ఖైదీని ఆ అధికారి పరీక్షించాలి. వాళ్లకి శారీరకమైన, మానసికమైన రుగ్మతలు ఏమున్నాయో తెలుసుకోవడం, వాటి చికిత్సకు అవసరమైన అన్ని చర్యలూ తీసుకోవాలని కూడా అందులో ఉంది. వీటితోపాటు, ఖైదీలకు ఇచ్చే ఆహార పదార్థాల నాణ్యత, పరిసరాల పరిశుభ్రత, వాళ్ల ఆరోగ్యాన్ని దెబ్బతీసే ఇతర అంశాలన్నింటినీ పర్యవేక్షించడం వైద్య అధికారి బాధ్యత అని అందులో చెప్పారు.

పౌర, రాజకీయ హక్కుల ఒడంబడిక ప్రకారం జీవించే హక్కును కాపాడడం కోసం, వ్యాధి నిర్ధారణకు, చికిత్స అందించడానికి తగిన వైద్యసౌకర్యాలు జైళ్లలో ఉండాలని ఐక్యరాజ్యసమితి మానవహక్కుల కమిటీ ప్రకటించింది. ఖైదీలు వ్యాధికి లోనైనప్పుడుగానీ, లేదా వాళ్లపట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం అవసరమైనపుడుగానీ ఈ సౌకర్యం ఉపయోగ పడాలి. అలాంటి సౌకర్యం లేకపోవడం అంటే, ఆ ఒడంబడికలోని నిబంధన 6(1) లో చెప్పినట్టుగా 'వైద్యసౌకర్యాలు తగినట్టుగా పనిచేయడం లేదని' అర్థం.

**భారతదేశంలో జైళ్లలో పరిస్థితి**

జైళ్ల సంస్కరణలకు సంబంధించి కొన్ని గణాంకాలను ఇండియన్ లా ఇనిస్టిట్యూట్, 'లా రివ్యూ' వాల్యూమ్ II, 2017లో ఒక పరిశోధనాత్మక పత్రం ప్రచురితమైంది. ఆ పత్రంలో ఢిల్లీలోని తీహార్ జైలులో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని జైళ్ల శాఖలో జరుగుతున్న సంస్కరణలను పరిశీలించింది. తీహార్ జైలులో వివిధ రకాల క్రీడలలో ఖైదీలు పాల్గొనడం, ఖైదీల విద్యకు అవకాశాలుండడం, న్యాయసహాయం, యోగా, లోక్ అదాలత్ వంటి సృజనాత్మక సంస్కరణ పథకాలు అమలవుతున్నట్లు అందులో సూచించారు.

# ఉ.సా. స్మృతి



**ఉ**ద్యమాల ఉపాధ్యాయుడుగా అందరికీ చిరపరిచితుడు ఉప్పుమావులూరి సాంబశివరావు (ఉ.సా.) గారు కొవిడ్‌తో జూలై 25న మరణించారు. 1970ల మధ్యలో అప్పటి యుసిసిఆర్ఐ (ఎం.ఎల్.) కార్యకర్తగా కొండమొదలు పోరాటంతో మొదలై, మార్క్సిస్ట్ లెనినిస్ట్ సెంటర్, ఎదురీత, దళిత బహుజన సమీకరణ కోసం అనేక ప్రయత్నాల నుంచి దేశీ దిశ దాకా ఐదు దశాబ్దాల పీడిత ప్రజా పక్షపాతం, అనేక ప్రజా ఉద్యమాలలో నిరంతర ఆచరణ, పాట, ఉపన్యాసం, రచనల వంటి విస్తృతమైన మేధో కృషి, మార్క్సు ఆలోచనలనూ, ఫులే, అంబేద్కర్ ఆలోచనలనూ కలిపి భారత సమాజ విముక్తి సిద్ధాంతం తయారు చేయాలని తీవ్రంగా ప్రయత్నించిన మేధావి, తెలుగు సమాజంలో గణనీయమైన గౌరవ ప్రతిష్ఠలను సంపాదించిన మంచి మనిషి. ఉసా 69 ఏళ్ల జీవితంలో 49 ఏళ్లపాటు ప్రజల పక్షాన ప్రత్యామ్నాయ విప్లవవాదిగా జీవించారు. అన్యాయాలకు గురైన వారి పక్షాన నిలబడి సిద్ధాంతాన్ని రూపొందించి ఆచరించారు. తెలంగాణ మాట ఎత్తని కాలంలో సామాజిక తెలంగాణపై స్పష్టత ఇవ్వాలని నినదించారు. కారంచేడు దురంతం నాటి నుంచి గడిచిన ముప్పై ఐదు సంవత్సరాలలో ఆయన పాల్గొనని ప్రజా ఉద్యమం లేదు. దళిత బహుజనుల మీద ఎక్కడ దౌర్జన్యం జరిగినా వెంటనే అక్కడికి చేరి అన్ని శక్తులను కలుపుకొని ఉద్యమం నిర్మించేవారు. విప్లవోద్యమంపై నిర్బంధాన్ని ఎప్పటికప్పుడు ఖండించేవారు. వీ

తమ రాష్ట్రంలోని అన్ని జైళ్లల్లో టెలివిజన్, రేడియో, వార్తాపత్రికలు, ఇండోర్ ఆటలు వంటి అనేక సౌకర్యాలు కల్పించామని ఆంధ్రప్రదేశ్ జైళ్లశాఖ అధికారిక వెబ్‌సైట్‌లో ఉంది. సెప్టిక్ టాయిలెట్లు, బాత్రూమ్‌లను 1:06, 1:10 నిష్పత్తిలో అన్ని జైళ్లల్లో కల్పించినట్లుగా కూడా ఉంది. ఈ సౌకర్యాలతోపాటు ప్రభుత్వ ఖర్చు మీద విశ్వవిద్యాలయాల నుండి డిగ్రీ, సర్టిఫికెట్ కోర్సులు చదువుకొనే అవకాశం కూడా కల్పించారు. అలానే ఖైదీలు ఎలాంటి పరిమితులు లేకుండా ఉత్తరాలు రాయవచ్చు, ఉత్తరాలు అందుకోవచ్చు.

పౌరసత్వ సవరణ చట్టానికి వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో ప్రభుత్వాన్ని విమర్శిస్తూ ప్రసంగించినందుకు 2020 జనవరి నుండి మధుర జైలులో ఉన్న డా. కఫీల్ ఖాన్, ఆ జైలులో ఉన్న భయంకరమైన దుస్థితి గురించి ఒక ఉత్తరం రాశారు.

'125 నుండి 150 మంది ఖైదీలకు ఒకే ఒక టాయిలెట్ ఉన్నది. కరెంటు కోత కారణంగా, అంతమంది ఖైదీలు ఒకేచోట ఉన్న కారణంగా వాళ్ల చెమట, మూత్రం కలిసి ఆ ప్రాంతాన్ని నరకమయం చేస్తున్నాయి. అది నిజంగానే నరకం. నేను ఏదైనా చదివే ప్రయత్నం చేస్తాను. కాని ఊపిరాడక దృష్టి కేంద్రీకరించ లేకపోతున్నాను. ఊపిరాడక కళ్లు తిరిగి పడిపోతానేమో అని కొన్నిసార్లు భయమేస్తుంది. అందుచేత ఎప్పుడూ మంచినీళ్లు తాగుతూ ఉన్నాను' అని అందులో రాశారు.

'534 మందిని నిర్బంధించడానికి అవకాశం ఉన్న జైలులో 1600 మందిని ఉంచారు. ఒక్కొక్క బ్యారక్‌లో కనీసం 100 నుండి 125 మంది దాకా ఉన్నాం. కేవలం 4 నుండి 6 వరకు మాత్రమే టాయిలెట్లు ఉన్నాయని' డా. కఫీల్ ఖాన్ ఆ ఉత్తరంలో పేర్కొన్నారు.

జాతీయ నేరాల నమోదు బ్యూరో (నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో) భారతదేశంలో జైళ్లకు సంబంధించిన గణాంకాలను విడుదల చేస్తుంది. తాజాగా 2018 రిపోర్టు విడుదలయింది. ఆ నివేదికల్లో జైళ్లలో ఎంతమంది ఉన్నారు, వాళ్ల వయసు, లైంగికత, విద్యార్హతలు, నివాసం, జాతీయత, మరణాల సంఖ్య, ఖైదీలకు వచ్చిన జబ్బులు వంటి గణాంకాలు ఉంటాయి.

2018 డిసెంబర్ 31 నాటికి 50 ఏళ్ల పైబడిన వయసు కలిగిన ఖైదీలు 61,621 (13.2 శాతం) మంది ఉన్నారు. 1,639 మంది సహజ మరణానికి గురయ్యారు. 149 మందివి అసహజ మరణాలు. ఈ 149 మందిలో 129మంది ఖైదీలు ఆత్మహత్య చేసుకున్నారు. ఐదుగురు ప్రమాదాలలో చనిపోగా, పదిమందిని తోటి ఖైదీలు హత్య చేశారు. ఒక ఖైదీ బయటి వ్యక్తులు చేసిన దాడిలో చనిపోయారు. 57 మంది ఖైదీల మరణానికి సంబంధించిన కారణం ఇప్పటికీ తెలియదు.

భారత జైళ్లలో విచారణలో ఉన్న ఖైదీల సంఖ్య ఎప్పుడూ ఎక్కువే. జాతీయ నేరాల నమోదు బ్యూరో గణాంకాల ప్రకారం 2018లో దేశం మొత్తం మీద ఖైదీలలో 69.4 శాతం మంది విచారణలో ఉన్న ఖైదీలే. 2016తో పోలిస్తే విచారణలో ఉన్న ఖైదీల సంఖ్య 10 శాతం పెరిగింది.

ఖైదీల ఆరోగ్యం గురించి ఈ గణాంకాలు పెద్దగా ఏమీ వెల్లడించవు. జైళ్లలో ఉండే వైద్య అధికారులు తమవంతు ప్రయత్నాలన్నీ చేసినప్పటికీ ఖైదీలు చనిపోయారా లేదా అని మనం నిర్ణయించలేం. నమూనా జైళ్ల మాన్యువల్‌ని గానీ, మహారాష్ట్ర జైళ్ల మాన్యువల్‌ని గానీ చూస్తే ఖైదీల వైద్య సౌకర్యాలకి సంబంధించి అంతర్జాతీయ నాణ్యాతా ప్రమాణాలను పాటిస్తున్నట్లే ఉంటుంది. అయితే వాటిని ఖచ్చితంగా పాటిస్తున్నారా, దేశవ్యాప్తంగా అన్ని జైళ్లలోనూ అమలుపరుస్తున్నారా అన్నది తెలియదు.

జైళ్ల నిర్వహణలోకి తొంగిచూసే అవకాశం మనకి లేదు. వాటి చుట్టూ దుర్భేద్యమైన అడ్డుగోడలు ఉంటాయి. లోపల ఏమి జరుగుతుందో తెలియదు. ఎవరో కొంతమంది ఖైదీలు ఇచ్చే ఒకటీ రెండు వాంగ్మూలాలు తప్ప ఎలాంటి వాస్తవమైన గణాంకాలని సేకరించడం అసాధ్యం. అలాంటివాటిని జైళ్లు విడుదల చేయవు. వాటిమీద అధ్యయనాలు కూడా లేవు. ఇప్పుడు ఆ అవసరం తలయెత్తింది. దుర్భేద్యమైన ఆ గోడల చాటున ఉన్న ఖైదీల మానవహక్కులను కాపాడే విషయంలో జైళ్ల అధికారులు ఎవరికీ బాధ్యత వహించని స్థితి ఉంది. అక్కడ నిజంగా ఏమి జరుగుతుందో తెలుసుకుంటే తప్ప నమూనా జైళ్ల మాన్యువల్‌లో ఉన్న అంశాలను అమలుపరచమని ఒత్తిడి తెచ్చే అవకాశం ఉండదు.

*(రచయిత సిటిజన్స్ ఫర్ జస్టిస్ అండ్ పీస్ కార్యకర్త)*

*(అనువాదం: సి.ఎస్.ఆర్. ప్రసాద్)* వీ

# కమ్యూనిజానికి ప్రేరణనిస్తున్న కరోనా వైరస్

*కరోనా వైరస్ సంఘీభావం, సామాజిక న్యాయం, అంతర్జాతీయత అనే విలువల అవసరాన్ని, అంటే కమ్యూనిజాన్ని ముందుకు తెచ్చిందంటున్నారు* **అలెక్సాండ్ర్ బుజ్గాలిన్**

*'దురదృష్టమనేదాని సహాయం లేకపోతే, సంతోషమనేదే ఉండదు'*
*- రష్యన్ సామెత*

కరోనా వైరస్ మహమ్మారి మన సామూహిక జీవనంలోని అత్యంత తీవ్రమైన సమస్యలనూ, దాని ప్రధాన వైరుధ్యాలనూ బట్టబయలు చేసింది. ఈ పరిణామపు ఒకానొక కోణాన్ని ప్రచార సాధనాలు విపరీతంగా పెంచి పోషిస్తున్నాయి. అదేమంటే మనం ఒకరిని చూసి ఒకరం భయపడుతున్న స్థితికి చేరాం. అంతర్జాతీయ సంబంధాలన్నీ తెగిపోతే బాగుండునని కలలు కంటున్నాం. ఒకరితో ఒకరం సంబంధాలు లేకుండా ఉండాలనుకుంటున్నాం. ప్రతి అంశంలోనూ మనం చైనా వాళ్ల (లేదా అమెరికన్ల, ఇటాలియన్ల, రష్యన్ల, మనం ఎవరి పేరు పెట్టదలచుకుంటే వారి) చెయ్యి ఉందని అనుమానిస్తున్నాం. ఇక్కడి నుంచి ఒక్క అడుగువేస్తే ఇక మనం చేరేది జాత్యహంకార వాదానికే. ఒక 'నూతన ప్రపంచం' ఆవిర్భవిస్తున్నదని, ఆ ప్రపంచంలో ఒకరితో ఒకరు చేతులు కలపడానికి భయపడడం మాత్రమే కాదు, మొత్తంగా ఏ ఒక్కరి గురించి అయినా ప్రతి ఒక్కరూ భయపడే పరిస్థితికి చేరుతున్నామని అప్పుడే కొందరు అంటున్నారు.

అయితే ఈ నాణానికి మరొక ముఖం ఉంది. ఎంత పెద్ద మొత్తంలో డబ్బు పెట్టినా కొనలేని ఎన్నో వస్తువులు ప్రపంచంలో ఉన్నాయనీ, 'మార్కెట్ అదృశ్య హస్తం' మీద ఆధారపడి పరిష్కరించలేని అత్యంత కష్టతరమైన సమస్యలెన్నో ఉన్నాయనీ, జనానికి 'హఠాత్తుగా' తెలిసివస్తున్నది. అంతే కాదు, ఆ సమస్యలను మనం ఒంటరిగా పరిష్కరించలేమని కూడ తెలిసివస్తున్నది. మన ప్రపంచమంతా ఒకటేననీ, దాన్ని రక్షించడానికి అందరమూ కలిసి పని చేయవలసిందేననీ తెలిసివస్తున్నది. క్వారంటైన్‌లూ, కలవకుండా ఉండడాలూ ఎంత ముఖ్యమైనప్పటికీ, ఈ మహా విపత్తును ఓడించాలంటే మనందరమూ కలిసి, ప్రపంచమంతా ఒకటిగా, ఉమ్మడిగా పనిచేయవలసిందేననీ తెలిసివస్తున్నది. క్వారంటైన్ అనేది మనను మనం రక్షించుకునే సాధనమూ కాదు, ప్రతి ఒక్కరినీ రక్షించడానికి అనివార్యమైనదీ కాదు.

ఈ సాధారణ అభిప్రాయాలను దాటి, వాస్తవాలను గ్రహించి, అక్కడి నుంచి ఆ వాస్తవాల పరిణామాలేమిటో గుర్తించడానికి ప్రయత్నించవలసి ఉంది. ఈ సమస్యను పరిష్కరించే వ్యూహాన్ని కనిపెట్టాలంటే ఈ సమస్య సారాంశాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించవలసి ఉంది.

**ఎవరికి వారు ఒంటరిగా ఉండడం.... సంఘీభావానికి దారి**

మొదటి వాస్తవం: మనం మన స్నేహితుల గురించి కూడ భయపడడం మొదలుపెట్టాం. ఇంటర్నెట్ మీద ఒక విషాద పరిహాసం చలామణీలో ఉంది: 'మిత్రులారా, ఈ కష్టకాలంలో మనం ఒకరి నుంచి ఒకరం వీలైనంత దూరంగా ఉండాలి' అని అది పిలుపునిస్తున్నది.

కాని ఒక భిన్నమైన ధోరణి కూడ ఉన్నది. 'ఎవరికి వారే' అనే వ్యక్తిగత వినియోగదారు హేతుబద్ధ మార్కెట్ స్వభావం గురించి నిన్నటి దాకా బోధిస్తుండినవాళ్లు కూడ ఇప్పుడు 'మనందరమూ ఒకే మునిగి పోతున్న పడవలో ఉన్నాం' అని అర్థం చేసుకోవడం మొదలుపెట్టారు.

మన కళ్లముందరే కొన్ని విషయాలు మారిపోతున్నాయి. అన్నిచోట్లా మార్పు జరుగుతున్నదని కాదు. అయినా, పెద్దవారికి సాయపడాలనీ, స్వచ్ఛంద సంస్థల పనిలో భాగం పంచుకోవాలనీ యువకులలో తపన కనబడుతున్నది. నిన్నటిదాకా ఎక్కడో ఒక చిత్రమైన మినహాయింపుగా మాత్రమే ఉండిన ఈ ధోరణి ఇవాళ ఒక విస్తృతమైన ధోరణిగా మారింది. ఇటాలియన్లు సాయంత్రం ఆరు గంటలకల్లా తమ వరండాలలో నిలబడి వైద్య సిబ్బందికి ప్రశంసలు అందిస్తున్నారు. ఒకరికొకరు పాటలు పాడుకుంటున్నారు. మాస్కో స్టేట్ యూనివర్సిటీ విద్యార్థులు 65 ఏళ్లు దాటిన తమ ప్రొఫెసర్లకు సహాయం అవసరమైతే సంకోచించవద్దని చెపుతున్నారు. యువజనుల సంస్కృతిలో పరస్పర సహాయం నిత్యకృత్యమై పోయింది. ఒకప్పుడు వామపక్ష శిబిరాల్లో మాత్రమే ఉండిన పరస్పర సహాయం ఇవాళ విస్తృత ప్రజాసమూహాల్లో కనబడుతున్నది. ప్రజల జీవితాల్లో నిన్నటివరకూ ప్రధాన స్వభావంగా ఉండిన వ్యక్తివాదం ఇవాళ ఇంకెంత మాత్రమూ నెలరోజుల కింద కనబడినంత పవిత్రంగా కనబడడం లేదు.

మహా మాల్‌లన్నీ ఖాళీ అయిపోయాయి. సరుకులు కొంటూ కాలం గడపడం అనేది లేకుండా వాస్తవంగా జీవితాలు గడపవచ్చునని మనం హఠాత్తుగా గుర్తించడం మొదలుపెట్టాం. మార్కెట్‌లోకి వచ్చిన కొత్త కారు కొనడం కోసమే జీవించడమనేది ఏమంత గొప్ప విషయం కాదనీ, బహుశా తెలివితక్కువ తనమనీ తెలిసివస్తున్నది. కుటుంబమంతా కలిసి పుస్తకాలు చదువుకోవచ్చుననీ, సినిమాలు చూడవచ్చుననీ తెలిసివస్తున్నది. కొత్త సామాజిక వాతావరణంలో వినియోగదారీ సమాజపు ఎండమావులు కదిలిపోతున్నాయి, కరిగిపోతున్నాయి, చెల్లాచెదురైపోతున్నాయి.

కాని, ఆగండి, మనమింకా కమ్యూనిజం విజయానికి చేరలేదు. కాని పాత సోవియట్ యుగంలో 'వాస్తవంగా ఉనికిలో ఉండిన సోషలిజం' అంతమైపోయిన తర్వాత, మొట్టమొదటిసారిగా కోట్లాది మంది మనుషులు డబ్బుకూ, ఘనత వహించిన బ్రాండ్లకూ, అత్యాధునిక జీవన శైలికీ భిన్నమైన సంగతుల గురించి తీవ్రంగా ఆలోచించడం

ప్రారంభించారు. తమ జీవితాలను పోటీలేని ప్రపంచంలో, సంఘీభావం విలసిల్లే ప్రపంచంలో సాగించగల అవకాశాల గురించి ఆలోచించడం ప్రారంభించారు.

అవును, చివరికి ఉదారవాద రాజకీయవేత్తలు కూడ ఆ పదం ఉచ్చరించడానికి ఇంకెంతమాత్రమూ భయపడడం లేదు. ఆ పదం సంఘీభావం.

ఎందుకు? ఎందుకంటే జీవితం సంఘీభావాన్ని కోరుతున్నది గనుక. అందరికీ వ్యతిరేకంగా ఒక్కరి పోరాటం అనే భావన, మార్కెట్ అదృశ్యహస్తం అనే భావన ఈ మహమ్మారి సమస్యను పరిష్కరించబోవడం లేదు. ఈ మహమ్మారికి వ్యతిరేక పోరాటం ప్రధానంగా మార్కెటేతర చర్యలను కోరుతున్నది. అందరినీ సమానంగా చుట్టుముట్టిన ఈ ఉత్పాతానికి ప్రధాన ప్రతిఘటన శక్తులు రాజ్యం చేపట్టవలసిన నియంత్రణ, ప్రజా కార్యక్రమాలు, పరస్పర సహకారం, వ్యక్తిగత నిగ్రహం, ఉమ్మడి సమస్యల పరిష్కారంలో వ్యక్తిగత అహంకారాలను వదులుకోవడం. శతాబ్దాలుగా ఉదారవాదులు లేదు లేదని చెపుతున్న సామాజిక సమష్టి ప్రయోజనం ఎంత వాస్తవమో ఇవాళ ప్రతి ఒక్కరికీ తెలిసివస్తున్నది.

కాని!

కాని ఆధునిక జాతి రాజ్యాలు ప్రజల సమష్టి కార్యాచరణ ద్వారా సమస్యలను పరిష్కరించడానికి పూనుకోవు. ఇప్పటివరకూ ప్రపంచ శక్తుల గుప్పెట్లో ఉన్న ప్రపంచ మార్కెట్ ఆ పని చేయడం అంతకంటె ఎక్కువ అసాధ్యం. ఆ పని అత్యధిక ప్రజానీకపు ప్రయోజనాలకు అనుకూలమైన కార్యాచరణ. అది ద్రవ్య పెట్టుబడి ప్రయోజనాలనూ, చమురు, ప్రచార సాధనాలు, వగైరా కార్పొరేషన్ల ప్రయోజనాలనూ తీర్చడానికి చేపట్టవలసినది కాదు. ఇవాళ ప్రపంచమంతటా ఒక దృశ్యం స్పష్టంగా బైటపడుతున్నది. అదేమంటే ఎక్కడైతే ప్రభుత్వ రంగం బలహీనంగా ఉన్నదో, ఎక్కడైతే రాజ్యం సామాజిక ప్రయోజనాల కోసం కాకుండా ఒక అత్యల్పసంఖ్యాక వ్యాపార, అధికార ప్రయోజనాలకోసం పనిచేస్తున్నదో, అక్కడ అతి ఎక్కువ మంది జీవితాలను వైరస్ బలిగొంటున్నది.

ప్రత్యామ్నాయం సుస్పష్టమే. అది రాజ్యమూ పౌర సమాజమూ కలిసి అత్యంత కీలకమైన వ్యవస్థలలో ప్రణాళికాబద్ధమైన, ప్రత్యక్ష (మార్కెటేతర), సంఘీభావ చర్యలు తీసుకోవడం. ఆ చర్యల వల్ల మొట్టమొదట ఆరోగ్య రంగం, సామాజిక భద్రత, మౌలిక సౌకర్యాలు, విద్యుత్ సరఫరా, ప్రజల సహకారయుత ఉత్పాదక సామర్థ్యం వికసిస్తాయి. ఇక్కడ మనం తప్పనిసరిగా ప్రభుత్వ, ప్రైవేటు కార్పొరేషన్లను సాహసికంగా సామాజికీకరించే వైపు అడుగులు వేయాలి. సమాజ ప్రయోజనాల కొరకు నిర్వహణ అనే లక్ష్యంతో ప్రజా నియంత్రణ, పారదర్శక నిర్వహణ అమలు కావాలి. మార్కెట్ వ్యవస్థల ఆదేశాలను తప్పనిసరిగా బద్దలుకొట్టాలి. మనం స్పష్టమైన, పారదర్శకమైన, కొత్త నిబంధనలు రూపొందించి, వాటిని కచ్చితంగా, క్రమబద్ధంగా పాటించే మార్గంలో ముందుకు సాగాలి. సాధారణ ప్రజా ప్రయోజనాలను నెరవేర్చడమే లక్ష్యం కావాలి. అంటే ఇక్కడ మనం సొంత ఆస్తి పవిత్రత సూత్రాన్ని, లాభాలను ఇతోధికంగా పెంచుకోవడంలో ఉన్న ప్రయోజనాలను రెండో స్థాయికి నెట్టివేయాలి.

ఈ పనులను ఏ రాజ్యాలు చేస్తాయి, ఎంతవరకు చేస్తాయి అనేది ఆయా రాజ్యాల పౌరుల మీద ఆధారపడి ఉంటుంది. అలాగే ఈ చర్యలు తీసుకొమ్మని మన అధికార వర్గాలను మనం ఎంత స్పష్టంగా, ఎంత నిర్విరామంగా, ఎంత క్రియాశీలంగా కోరుతామనే దానిమీద ఆధారపడి ఉంటుంది. గతంలో ఆదర్శవంతులైన వామపక్షవాదులు ఇచ్చిన ఊహావాద నినాదం, 'లాభాల కోసం కాదు, ప్రజల కోసం' అనేదాన్ని ఇవాళ తిరిగి వినిపించవలసి ఉన్నది. ప్రస్తుత మహమ్మారి అన్నిటికన్న ముందుకు తీసుకువచ్చిన అంశం ఇదే.

**ఈ వైరస్ 'ప్రజాస్వామికమైనది' – అంటే సామాజిక న్యాయం ప్రతి ఒక్కరి ప్రయోజనం**

రెండో వాస్తవం: ఈ వైరస్ తనదైన పద్ధతిలో ప్రజాస్వామికమైనది. ప్రతి ఒక్కరికీ అది సోకుతుంది. ప్రభుత్వం నడిపే మంత్రులు, తళుకు బెళుకుల తారలు, కోటీశ్వరులు, బిచ్చగాళ్లు, అందరూ. ఈ వైరస్ అందరినీ సమానంగా చూస్తుందనిపిస్తుంది. కాని అన్ని రకాలుగానూ సమానం చేయదు. అన్ని విషయాలనూ జయించడానికి డబ్బుకు ఉన్న సామర్థ్యం మీద ఈ మహమ్మారి ఒక సవాల్ విసిరింది, కాని ఇంకా జవాబునివ్వలేదు. గతంలో లాగనే, ప్రపంచంలో ఇంకా భిన్నమైన సంబంధాల వ్యవస్థే ప్రాబల్యంలో ఉంది. కొందరు ఇంకా విలాసాలలోనే జీవిస్తున్నారు. అత్యంత సమర్థమైన పరిస్థితుల్లో చికిత్స పొందగలుగుతున్నారు. కాగా కోట్లాది మంది కనీసమైన మందులకు అవసరమైన డబ్బు లేని స్థితిలో ఉన్నారు. వాళ్లంతా ప్రపంచపు 'అంచులలో' పేదదేశాల పౌరులు మాత్రమే కాదు. వారిలో నెలకు పది పదిహేను వేల రూబుళ్లు సంపాదించే కోట్లాది మంది రష్యన్ ప్రజలూ ఉన్నారు, మన మహామహా నగరాలకు వలస వచ్చినవారూ ఉన్నారు.

ఈ ప్రపంచ మహమ్మారి విచిత్రం ఏమంటే, బిచ్చగాళ్లు వైరస్ బారినపడినప్పుడు ప్రతిఒక్కరూ మరణాంతక ప్రమాదంలో చిక్కక తప్పదు. ఆ భయంలో వ్యవస్థా నిర్వాహకులకు కూడ మినహాయింపు లేదు. మనం ఆ సమస్యను అందరమూ కలిసి, అందరి కొరకూ పరిష్కరించనైనా పరిష్కరించాలి. లేదా అందరికందరమూ ఇతోధిక ప్రమాదంలో అంతమైపోవడమైనా జరుగుతుంది. ఈ సమస్యను పరిష్కరించడంలో అందరికందరమూ చేతులు కలపాలంటే, ఇతరుల కన్న వందలరెట్లో వేలరెట్లో ఎక్కువ సంపద ఉన్నవారు కనీసం తమ సంపదలో గణనీయమైన భాగాన్ని ఈ కృషికి ఇవ్వాలి. ఇది అనివార్యం. ఇది కేవలం నైతిక సమస్య కాదు. మహమ్మారిని అధిగమించాలంటే అది అత్యవసరం. మహమ్మారిని అధిగమించడానికి అవసరమైన నిధులను కోటీశ్వరులూ శతకోటీశ్వరులూ ఇవ్వవలసిందే. వాళ్లు ఆ పని చేయవలసింది తమ పెట్టుబడులపై, మదుపులపై కోత విధించి కాదు, తమ సొంత వినియోగాన్ని తగ్గించుకుని ఇవ్వాలి. ఇక్కడ విధించే ఆంక్షలు అత్యవసరమైనవి. ఎందుకంటే తద్వారా మాత్రమే ఎవరికీ ఇబ్బంది ఎవరికీ పెద్ద నష్టం కలగదు. చివరికి మహాచోరులకు కూడ దీనితో పోయేదేమీ లేదు. కేవలం ఈ మహమ్మారి రోజుల్లో వాళ్లు తమ కొత్త విహార నౌకలు కొనే ఆలోచనలను, తమ మహా భవనాల అలంకరణ ఆలోచనలను పక్కన పెడితే చాలు.

మొన్నటి చలికాలంలోనే పెట్టుబడి ప్రయోజనాల కన్న సమాజ ప్రయోజనాలకు ప్రాధాన్యత ఇవ్వడం అసాధ్యమేనా అని ఒక తీవ్రచర్చ

జరిగింది. నిజానికి అప్పటికి ముసుకువస్తున్న ఆర్థిక సంక్షోభం అటువంటి విషయాల మీద కొత్త ఆలోచనలు చేయడానికి ప్రజలను పురికొల్పవలసింది. కాని, అప్పటి చర్చల్లో, రష్యన్ సామెత చెప్పినట్టు, వండిన కోడి ఎవరినీ పొడవలేదు. కాని ఇప్పుడది పొడుస్తున్నది. పెట్టుబడి యజమానులు తమ లాభాల గురించి పూర్తిగా మరిచిపోయారని అనలేను. తమ ఆదాయాలను ఈ అంటువ్యాధి మీద పోరాటానికి అప్పగించాలనే భావాలతో మునిగి తేలుతున్నారనీ అనలేను. కాని కొన్ని ప్రతీకాత్మక చర్యలు జరిగాయి. వాస్తవమేమంటే, లాభాలను మరిచిపోవడం జరగనే లేదు.

ఇప్పుడు కూడ, పెట్టుబడి యజమానులు ప్రపంచ జనాభాలో సగానికి ఈ అంటువ్యాధి అంటినా సరే అని సిద్ధంగా ఉన్నారు గాని, తమ విదేశీ ఆర్థిక స్థావరాల మీద నిషేధం విధించడానికి గాని, తమ సొంత ఖర్చులలో ఒక పెద్ద భాగాన్ని ప్రజా అవసరాలు తీర్చడానికి మళ్లించడానికి గాని సిద్ధంగా లేరు. కాని వీళ్లు తమ సంపదలో కొంచెమైనా పంచుకునేలా ఒత్తిడి తేవడం అవసరమని అశేష ప్రజానీకం అర్థం చేసుకుంటున్నారు. చివరికి రాజ్యం కూడ ఆ విషయం అర్థం చేసుకుంటున్నది. ఈ మహా సంపన్నులకు సేవ చేయడమే దానికి ఇప్పటివరకూ తెలిసింది. కాని ఇప్పుడు మాత్రం దాని వెన్నెముకలో ఒక చిన్న గగుర్పాటు కలుగుతున్నది. పౌరుల జీవితాల పట్ల తన బాధ్యతను గుర్తు తెచ్చుకొమ్మని ఆ గగుర్పాటు సూచిస్తున్నది. ఈ వ్యవహారంలో రాజ్యపు నిష్క్రియనూ, తాత్సారాన్నీ మనం ఎప్పటికీ క్షమించలేం. ఈలోగా, మహమ్మారులూ క్వారంటైన్‌లూ నిండిన ప్రపంచంలో జీవించడం కన్న తమ ఆదాయాలలో, చివరికి ఆస్తులలో కూడ ఒక భాగాన్ని ఇతరులతో పంచుకోవడం మంచిదని కోటీశ్వరుల, శతకోటీశ్వరుల పరివారాలలోని కొందరు వ్యక్తులైనా గుర్తిస్తున్నారు.

సామాజిక చైతన్యంలో తలెత్తుతున్న ఈ మార్పు సాపేక్షిక నిర్ణయాత్మక చర్యలకు దారి తీయగలదా లేదా అనేది మళ్లీ మనమీదనే ఆధారపడి ఉంటుంది. రష్యన్ ఫెడరేషన్‌తో సహా ఎన్నో రాజ్యాలు తొలి పిరికి అడుగులు వేస్తున్నాయి. ప్రస్తుతానికైతే తమ పౌరుల శ్రమతో పోగుపడిన సంస్థల నిలువల నుంచి ఖర్చుపెడుతున్నాయి గాని, ఈ స్థితి మారవచ్చు. అయితే, ఏది ఏమైనప్పటికీ ఈ సమస్య జాతి రాజ్యాలు తమంతట తాము ఏదో చేస్తే పరిష్కారమయ్యేది కాదు.

**సరిహద్దుల మూసివేత... అంతర్జాతీయతకు నాంది**

మూడో వాస్తవం: ఈ మహమ్మారి మానవజాతి అంతటికీ సమస్య. అది మనలో ప్రతి ఒక్కరిపైనా ప్రత్యక్షంగా ప్రభావం చూపుతుంది. ప్రతి ఒక్క దేశంలోని పౌరులలో ప్రతి ఒక్కరి ప్రయోజనాల కోసం ప్రపంచమంతటా ఈ సమస్యను పరిష్కరించవలసి ఉన్నదని వైరస్ చూపింది. సువిశాలమైన చైనాలో గాని, అత్యంత చిన్న దేశమైన మోల్డావియాలోగాని, మన సొంత రష్యాలో గాని ఎక్కడా మనం వైరస్ నుంచి తప్పించుకుని బతకలేం. విచిత్రమేమంటే, సరిహద్దుల మూసివేత, క్వారంటైన్‌లు, ఒంటరి జీవితాలు అవసరమైనవే అయినప్పటికీ, అవి కేవలం వైరస్ అంతర్జాతీయ వ్యాప్తిని తగ్గించే సాధనాలు మాత్రమే. చైనాలో అమలుచేసిన క్వారంటైన్ చైనీయులకు మాత్రమే కాదు, మన రష్యన్లతో పాటు, యావత్ ప్రపంచ ప్రజలకూ అత్యంత కీలకమైన అవసరమని రుజువైంది. తమ దేశ సరిహద్దులు మూసివేయడం ద్వారా చైనీయులు సమస్యను పరిష్కరించడంలో మనం సంసిద్ధులం కావడానికి సహకరించారు. అదే ఇటలీకి కూడ వర్తిస్తుంది. ప్రతి దేశానికీ వర్తిస్తుంది. ఏదో ఒక అద్భుతం జరిగి మనం ఈ వైరస్‌ను రష్యాలో ఆపివేయడం జరిగినా, మానవాళిని ఈ వైరస్ నుంచో, భవిష్యత్తులో రానున్న వైరస్‌ల నుంచో రక్షించినట్టు కాదు. తద్వారా మనను మనం సురక్షితం చేసుకున్నట్టు కాదు. ఎందుకంటే రానున్న వైరస్, లేదా మరేదో ప్రపంచ సమస్య అంతర్జాతీయ విమానాశ్రయాలలో అవరోధాల దగ్గర ఆగిపోదు.

ప్రజల మధ్య స్నేహ సంబంధాల, అంతర్జాతీయతా సూత్రాల కీలక అవసరాన్ని ఈ వైరస్ చూపింది. ఈ మహమ్మారికి చికిత్స చేయడానికి అవసరమైన ఔషధాలలో ఒకటి అంతర్జాతీయ సంఘీభావం. ఇది పరిస్థితి అత్యంత క్లిష్టంగా ఉన్న దేశాలకూ ప్రాంతాలకూ సహాయం అందించడం మాత్రమే కాదు. తమ సమస్యలను తామే పరిష్కరించుకోలేనంత పెద్ద స్థాయిలో పేదరికం ఉన్న దేశాలకూ, ప్రాంతాలకూ సహాయం అందించడం కూడ ఇందులో భాగమే. మనం కేవలం మన ప్రయోజనాల కోసం మాత్రమే ఆలోచిస్తున్నప్పటికీ వారికి సహాయం చేయడం అవసరం.

బహుశా ఇక్కడ ప్రధాన విషయం, ఈ సందర్భంలో వైరస్‌కు వ్యతిరేక పోరాటంలోని అన్ని విజయాలూ, అన్ని నూతన ఆవిష్కరణలూ, వాక్సిన్ సృష్టించడానికీ ఉన్న అన్ని రకాల మార్గాలూ, తదనంతర చర్యలూ, వాక్సిన్, దాన్ని ఉత్పత్తి చేయడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానమూ అన్నీ కూడ మానవాళి అంతటికీ చెందినవిగా గుర్తించాలి. ఎటువంటి ధర లేకుండా, ఎటువంటి పరిమితులు లేకుండా మానవాళి అంతటితో పంచుకోవాలి. ఈ వాక్సిన్‌ను ఎవరు ఎక్కడ సృష్టించినప్పటికీ దాని మీద ప్రైవేటు మేధో హక్కుల ఆంక్షలు ఉండగూడదు.

జాతీయవాదం, అభివృద్ధినిరోధక ప్రజారంజకత్వం అద్దుకున్న నయా ఉదారవాద 'క్రీడా సూత్రాల' క్షేత్రంలో అటువంటి నిర్ణయానికి అవకాశం ఉందా? ఈ ప్రశ్న నిన్న అడిగినా నేను 'లేదు' అని జవాబు చెప్పి ఉండేవాణ్ని. కాని మన కళ్ల ముందే పరిస్థితి మారిపోతున్నది. అతి వేగంగా మారిపోతున్నది. ఒక హాస్యాస్పదమైన ఉదాహరణ ఇస్తాను. రష్యాలో జనం ఛలోక్తులను ఇష్టపడతారు. అత్యధిక ప్రజానీకపు మానసిక ఉద్వేగాలకు, ప్రజాభిప్రాయానికి అవే పెద్ద సూచికలు. అవి సర్వేల కన్నా విశ్వసనీయమైనవి. కరోనావైరస్ గురించి సామాజిక వ్యాఖ్యలూ ఛలోక్తులూ గత రెండు వారాలుగా విపరీతంగా ప్రజల్లో చలామణీ అవుతున్నాయి. వాటిలో ఒకే ఒక్కటి మీతో పంచుకుంటాను. అది మాకు యూరప్ నుంచి వచ్చింది. 'తళుకు బెళుకుల తారలకూ ఫుట్ బాల్ క్రీడాకారులకూ మీరు నెలకు లక్షల యూరోలు ముట్టజెపుతారు. జీవశాస్త్రవేత్తలకు నెలకు రెండువేల యూరోలివ్వడానికి గింజుకుంటారు. ఇప్పుడేమో మీకో వాక్సిన్ కావాలని మాదగ్గరికి వచ్చారా? వెళ్లండి ఆ తారల దగ్గరికే. వాళ్లు మీకోసం ఒక వాక్సిన్ తయారు చేస్తారేమో చూడండి' అని ఒక శాస్త్రవేత్త అన్నాడట.

ఈ పరిహాసంలో, అటువంటి పరిహాసాలన్నిటిలో లాగనే, ఒక విషాదకరమైన తలకిందుల వాస్తవం పొడసూపుతున్నది. తారలు, మార్కెట్ డెరైవేటివ్‌లు, బ్రాండ్లు, సరికొత్త వేలం వెర్రి మోజులు, అతి ప్రదర్శనలు వంటి ఎన్నో ప్రేరణా వస్తువుల తయారీ ద్వారా తన మనుగడ

కొనసాగించుకుంటున్న ఇటీవలి పెట్టుబడిదారీ విధానపు ప్రపంచం, వైరస్ వంటి సమస్యను అడ్డుకోవడానికి గాని, పరిష్కరించడానికి గాని తనకు శక్తి సామర్థ్యాలు లేవని రుజువు చేసుకున్నది. (వేలాది, లక్షలాది మందిని వ్యాధి పీడితులను చేసే, మరణాంతకం చేసే ఈ వైరస్ ను సృష్టించి ప్రపంచం మీదికి వదిలింది కూడ అదే కావచ్చు.) ఈ ప్రపంచాన్ని మార్చక తప్పదు. ఈ మహమ్మారి దాడి చేసిన సందర్భంలో గత ఇరవై సంవత్సరాలలో రెండో పెద్ద ప్రపంచ స్థాయి ఆర్థిక సంక్షోభం ప్రారంభం కాబోతుండింది. అది కూడ ఈ ఫలితాన్నే పరోక్షంగా సూచించింది. ఇప్పుడు మహమ్మారి దాన్నే ప్రత్యక్షంగా సూచిస్తున్నది.

ముగింపుగా చెప్పాలంటే, సంఘీభావం కోసం, న్యాయం కోసం, అంతర్జాతీయత కోసం వెలువడుతున్న ఆకాంక్షలన్నీ ఒక కొత్త సమాజ ఆవిర్భావపు తొలి సూచనలు. ఈ కొత్త సమాజం ఆవిర్భావం కొరకు రెండు శతాబ్దాలుగా పెనుగులాడుతున్నది. అనేక హింసలు భరించింది. అనేక వైరుధ్యాల గుండా పయనించింది. ఎంతో నెత్తురూ చెమటా కార్చింది. జన్మనెత్తడానికి రెండు శతాబ్దాలుగా ప్రయత్నిస్తున్నది. నూట యాభై సంవత్సరాల కింద మార్క్స్, ఎంగెల్స్‌లు దాన్ని 'స్వేచ్ఛా ప్రపంచం' అని పిలిచారు. దాన్ని కమ్యూనిజం అంటారు. దాని అసలు పేరు అదే. దాని సారాంశంలో ఉన్నవి మూడు అంశాలు: సంఘీభావం, న్యాయం, అంతర్జాతీయత.

వాటితో పాటు మరొక అంశం ఉంది. అది స్వేచ్ఛ. చారిత్రక అభివృద్ధి నియమాలను తెలుసుకునే స్వేచ్ఛ. ఆ సూత్రాలకు అనుగుణంగా ప్రపంచాన్ని మార్చడానికి స్వేచ్ఛ. ప్రపంచాన్ని మార్చడానికిదే సమయం. రేపు అని కూచుంటే చాల ఆలస్యమైపోవచ్చు. ఇవాళే మనం కచ్చితంగా స్థిరంగా వామపక్షం వైపు కదలకపోతే, మన మీద రేపు దిగబోయేది ఫాసిజం అనే మహా గత్తర. అది కరోనా వైరస్ మహమ్మారి కన్న మరింత భయంకరమైనది.

ఇవాళ మనం మరొకసారి ఎంచుకోవలసిన కర్తవ్యం 'కమ్యూనిజమా, బర్బరత్వమా' అనే ప్రత్యామ్నాయాలే.

తాజా కలం: ఈ వ్యాసానికి మూలాలు గత రెండు మూడు రోజులుగా ఆల్టర్నేటివ్స్ మూవ్ మెంట్‌లో నా సహచర కామ్రేడ్స్ ల్యుద్మిలా బులావ్కా, ఆండ్రే కొల్గానొవ్, నటాల్యా యాకొవ్లెవా తదితరులతో జరిగిన సంభాషణల ఆలోచనల్లో ఉన్నాయి. ఆ ఆలోచనలన్నిటినీ నేను ఈ వ్యాస రూపంలో ఒక సాయంత్రం అక్షరాల్లో పెట్టాను. ఆ సాయంత్రమే, ఈ వ్యాస రచన అయిపోయాక, ఇంటర్నెట్ మీద నేను దాదాపు ఇదే అంశం మీద రెండు వ్యాసాలు చూశాను. ఒకటి సుప్రసిద్ధ స్లొవేనియన్ మేధావి స్లావొజ్ జిజెక్ రాసినది, మరొకటి ఉక్రేనియన్ కార్యకర్త యూరీ లాతీష్ రాసినది. ఆ తర్వాత మార్చ్ 28న రష్యన్ పబ్లిక్ టెలివిజన్‌లో 'రైట్ టు నో' కార్యక్రమంలో మాట్లాడుతూ సెర్గీ కుర్గిన్యాన్ ఇవాళ మన మీద పేరుకుపోయిన సమస్యలను పరిష్కరించాలంటే ఏకైక మార్గం సోవియట్ స్త్రీ పురుషులు మళ్లీ జన్మించవలసిన అవసరమే అన్నారు.

అది ఒక మంచి సూచన.

మళ్లీ ఒకసారి ప్రపంచాన్ని కమ్యూనిజం అనే భూతం ఆవహిస్తున్నది!

(ప్రొఫెసర్ అలెక్సాండ్ర్ వ్లదిమిరొవిచ్ బుజ్గాలిన్ రాజకీయార్థ శాస్త్రవేత్త, తత్వవేత్త. మాస్కో స్టేట్ యూనివర్సిటీ రాజకీయార్థశాస్త్ర అధ్యాపకులు. ఇరవై సంవత్సరాలుగా ఆల్టర్నేటివ్స్ అనే పత్రికను, ఆ పత్రిక కేంద్రంగా ఆల్టర్నేటివ్స్ మూవ్ మెంట్ అనే ఆలోచనా బృందాన్నీ నడుపుతున్నారు.)

(అనువాదకుడి మాట: తెలుగు పాఠకులకు అందాలనే కోరికతోనే ఈ అద్భుతమైన వ్యాసాన్ని అనువదించాను. అయితే ఎంత నచ్చిన విషయంలోనైనా ఒక నచ్చని అంశం ఉంటుంది. ఎంత నచ్చని విషయంలోనైనా ఒక నచ్చిన అంశం ఉంటుది. తొంభై తొమ్మిది నచ్చిన అంశాలున్న చోట కూడ ఒక నచ్చని అంశం ఉండవచ్చు. తొంభై తొమ్మిది నచ్చని అంశాలతో పాటు ఒక నచ్చిన అంశం ఉండవచ్చు. అలా ఈ వ్యాసం అనువాదంతో పాటు రెండు అంశాలు సూచించాలని నాకు అనిపిస్తున్నది.

1) సంఘీభావం, న్యాయం, అంతర్జాతీయత, స్వేచ్ఛ అని స్థూల స్థాయిలో పూర్తిగా అంగీకరించదగిన అంశాలు చర్చించిన ఈ వ్యాసం వర్గపోరాటాన్ని, వర్గపోరాట అవసరాన్ని ప్రస్తావించకపోవడం ప్రధాన లోపమని నాకనిపిస్తున్నది. కరోనా వైరస్ మహమ్మారి ప్రస్తుత పాలనా నియమాలను మార్చడాన్ని ఆకాంక్షిస్తున్నదంటే అర్థం ఈ పాలకవర్గాలను కూలదోయమనే ఆదేశాన్ని ఇస్తున్నదనే. మరి పాలకవర్గాలు తమ అధికారాన్ని ఎలా వదులుకుంటాయి, ఎలా మారుతాయి? వర్గపోరాటం తప్ప మరొక మార్గమేదీ లేదు. ఆ పోరాటం ఎలా జరుగుతుందనే అంశం చర్చనీయం కావచ్చు, భిన్నాభిప్రాయాలుండవచ్చు. కాని వర్గపోరాట ప్రస్తావన కూడ లేకపోవడం ఉచితం కాదు.

2) బుజ్గాలిన్ కూడ 'నయా ఉదారవాద' అనే మాట వాడడం, అలాగే బూర్జువా, పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద అని వాడవలసిన చోట 'ఉదారవాద' అని వాడడం నాకు ఆశ్చర్యం కలిగించింది. పెట్టుబడిదారీ విధానం ప్రారంభదశలో, స్వేచ్ఛా వ్యాపార దశలో, భూస్వామ్య వ్యతిరేక దశలో 'ఉదారవాద' విలువల్ని ప్రచారం చేసింది. అప్పుడు దాన్ని ఉదారవాద అని పిలవడం కొంతైనా ఉచితం కావచ్చు, కాని అది వలస వాద, సామ్రాజ్యవాద, గుత్తాధిపత్య, ద్రవ్య పెట్టుబడి దశల్లో ప్రవేశించాక ఆ ఉదారవాద విలువలన్నిటినీ వదులుకుంది. భూస్వామ్యంతో మిలాఖత్తయింది. కుళ్లిపోయి మరణశయ్య మీదికి చేరింది. అంటే పందొమ్మిదో శతాబ్దం చివరికే దానిలో 'ఉదారవాదం' ఏమీ మిగలలేదు. ఇక 1970ల తర్వాత రాజ్య నియంత్రణలు రద్దు కావాలనీ, స్వేచ్ఛా వ్యాపారానికి అనుమతించాలనీ మళ్లీ ఒకసారి ద్రవ్యపెట్టుబడి నినదించడం మొదలుపెట్టినప్పుడు దాన్ని 'నయా ఉదారవాదం' అనడం మొదలైంది. పాతదీ ఉదారవాదం కాదు, స్వేచ్ఛావ్యాపారం అన్నంత మాత్రాన కొత్తది నయా ఉదారవాదమూ కాదు. కాని సామ్రాజ్యవాద సంస్థలూ, ప్రచార సాధనాలూ ప్రారంభించిన ఈ 'నయా ఉదారవాదం' అనే మాట చాల మంది అనాలోచితంగా స్వీకరించారు. మార్క్సిస్టు పరిభాషలో సామ్రాజ్యవాదం అనదలచుకోని మార్క్సిస్టు మేధావుల దగ్గరి నుంచి పత్రికల భాషతో ప్రభావితమయ్యే అమాయకుల దాకా ఎందరో ఈ మాటను పరిశీలించకుండా వాడుతున్నారు. 'సామ్రాజ్యవాదం' అనే మాట వాడడానికి భయపడే పార్లమెంటరీ కమ్యూనిస్టులు 'నయా ఉదారవాదం' అనే మాట ఎక్కువగా వాడుతున్నారు. ఈ వ్యాసంలో బుజ్గాలిన్ కూడ అదే వాడారు గనుక అనువాదంలో నేను అదే ఉంచాను గాని, ఈ వివరణ అవసరం అనుకున్నాను.)

*(రష్యన్ నుంచి ఇంగ్లిష్: రెన్ (ఫే క్లార్క్; తెలుగు: ఎన్ వేణుగోపాల్)* వీ

# కరోనా వెనుక కనిపించని నిజాలు

***కరోనా వ్యాధి కన్నా దాని పట్ల భయం ఎక్కువ ప్రమాదకరంగా ఉందనీ, దాని వెనుక సామ్రాజ్యవాద మార్కెట్ ప్రయోజనాలు దాగి ఉన్నాయనీ అంటున్నారు* చుంచు శ్రీశైలం**

***Capitalism is the root cause of all the problems***
***– Marx***

ఏ నినాదం వెనుక ఎవరి ప్రయోజనాలు దాగి ఉన్నాయో తెలుసుకోలేనంత కాలం ప్రజలు మోసపోతూనే ఉంటారు
– లెనిన్

జరుగుతున్న ప్రతీ సంఘటనను అనుమానించాల్సిందే.
– బుద్ధుడు

కరోన వైరస్‌కు కొవిడ్19 అనే పేరు పెట్టి ప్రపంచ మహమ్మారిగా ప్రకటించిన నేపథ్యంలో పైన తెలిపిన మార్క్స్, లెనిన్, బుద్ధుడి వ్యాఖ్యానాల వెలుగులో ప్రజా కోణంలో చేయవలసిన అనుమానాలు కానీ, జరగవలసిన పరిశీలనలు కానీ కనీస మాత్రంగా అయినా జరగకపోవడం చాలా బాధాకరం. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుఎచ్ఒ) ప్రకటించినట్లుగా ప్రపంచంలో ఉన్న అన్ని దేశాలు, ప్రజలు నమ్ముతున్నట్లుగా ఈ వైరస్ నిజానికి అంత ప్రమాదకరమేనా? ప్రచారంలో ఉన్నంత భయంకర మైనదేనా? మానవాళి ఉనికికే ఇది పెను సవాలు విసురుతుందా? ఇది నిజంగానే ప్రపంచ మహమ్మారా? దీని వెనుక ఏమైనా (మానవ) శక్తులు దాగి ఉన్నాయా? ఇలా అనేక ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కోవలసి ఉంది. ఈ పనిని అభ్యుదయ వాదులు, ప్రజా సమస్యల విశ్లేషకులు, పరిశీలకులు, మేధావులు మార్క్సిజం కోణంలో పూర్తిచేయాల్సిన అవసరం ఉంది. ఇది తక్షణ కర్తవ్యం.

కరోన వైరస్ గురించి సృష్టించబడ్డ భయాలు, అబద్ధాలు, అర్థ సత్యాలు, అపోహలలో కొట్టుకపోయామంటే పెట్టుబడిదారీ విధానం లాభాపేక్షను, దోపిడీ కాంక్షను తక్కువగా అంచనా వేశామనే భావించాలి. కరోన వైరస్ సహజమైనదా లేక సృష్టించబడ్డదా అనే చర్చ అప్రస్తుతం, దాని మూలంగా లేదా దాని పేరుతో సృష్టించబడ్డ భయాల (అతి తీవ్ర భయాలు) మీద అంతకంటే ఎక్కువ తీవ్రమైన చర్చలు, విశ్లేషణలు పెద్ద ఎత్తున లేవనెత్తాల్సిన అవసరం ఉంది. ఆ కోణంలో చూసినప్పుడు కరోన వైరస్ మూలంగా ఏర్పడ్డ భయాలు పెట్టుబడిదారీ విధానం సృష్టి మాత్రమే. గతంలో ప్రజలకున్న అవసరాలను, కొన్నిసార్లు అవసరాలను సృష్టించి కూడా (అవసరం లేని వస్తువులను కూడా నిత్యావసర వస్తువులు గా మార్చడం) లాభాలను ఆర్జించడం దాని లక్షణం. ప్రజలలో ఉండే సహజ భయాలను (ఉదా: నమ్మకాలు, విశ్వాసాలు, ప్రాణభయం మొదలైనవి) ఆసరాగా చేసుకుని దోపిడీకి పాల్పడడం జరుగుతూ వస్తుంది. కానీ, ప్రస్తుతం భయాలను సృష్టించి, ఆ భయాలను లాభాలుగా మార్చుకునే, ప్రజల శ్రమను చట్టబద్ధంగా దోచుకునే మహదావకాశాన్ని పొందడానికి వాడుకున్న (సృష్టించబడిన) ఆయుధమే ఈ వైరస్. అంటే సహజ భయాలు తెచ్చే లాభాల కంటే కృత్రిమ భయాలు తెచ్చే లాభాలు అనేక రెట్లు ఎక్కువ, తక్షణమైనవి. ఈ రోజు పెట్టిన పెట్టుబడి రేపటికల్లా, కుదిరితే ఈ రోజు సాయంత్రానికే లాభాలుగా, ఇంకా వీలైతే ముందే పెట్టుబడి, లాభాలు కూడా సమకూరే (అడ్వాన్స్‌లు, ఆర్డర్లు ద్వారా) వ్యాపారం ఫార్మా రంగంలో జరుగుతున్న విషయాన్ని గమనించాలి. కృత్రిమ భయాలు, తక్షణ లాభాలు అనేవి పెట్టుబడిదారీ విధానం ఉచ్ఛ స్థితిగా పరిగణించాలి. సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానం అత్యున్నత దశ అనడం కంటే వేల రెట్లు ఎక్కువైన (గతం కంటే) తక్షణ సంపదను తెచ్చిపెడుతున్న ప్రస్తుత పరిస్థితినే అత్యున్నత దశగా మార్చుకోవాల్సి వస్తుంది. కరోన వైరస్ పేరుతో సృష్టించబడ్డ భయాలు ఇప్పటికే ఆ పనిని పూర్తి చేయడంలో పెట్టుబడిదారుల బొక్కసాలు నింపడంలో నిమగ్నమయ్యాయి.

మొట్టమొదట వైరస్‌ను గుర్తించగానే ప్రపంచ ఆరోగ్య సంస్థ చేసిన పని ప్రపంచ మహమ్మారిగా ప్రకటించడం. ఈ ప్రకటనకు ముందు ప్రపంచ దేశాలతో గానీ, వైద్యరంగంలో నిపుణులతో గానీ, జీవ శాస్త్రవేత్తలతో గానీ, వైరాలజిస్టులతో గానీ సంప్రదించకపోవడమే కాకుండా వైరస్‌పై ప్రాథమిక అధ్యయనం కూడా లేకుండా వ్యాప్తి రేటు, రికవరీ రేటు, వ్యాధి లక్షణాలు, మరణాల రేటు, వైద్య సంసిద్ధత, ఔషధ సంసిద్ధత వంటి ఏ ఒక్క విషయం మీద కూడా స్టడీ చేయకుండా కేవలం వ్యాప్తి ఎక్కువగా ఉంటుందన్న ఒకే ఒక్క కారణాన్ని చూపి ఏకంగా ప్రపంచ మహమ్మారిగా ప్రకటించడం అనేక అనుమానాలకు తావిస్తోంది. గతంలో వచ్చిన సార్స్ (9. 6 శాతం), హంట (22 శాతం), ఎబోలా (70 శాతం మరణాలు రేటు), రొటా వంటి వైరస్‌లను మాత్రం చాలా తేలికగా తీసుకొని కేవలం 2 నుంచి 3 శాతం మరణాల రేటు (ఏ ఒక్క మరణం అయినా బాధకరమే కానీ వైద్య పరిభాషలో ఈ రేటు చాలా స్వల్పం) ఉన్న ఈ వైరస్‌ను మానవాళి ఉనికినే తుడిచి పెట్టేస్తుంది అన్నంత భయాన్ని వైరస్ కంటే వేగంగా ఎక్కువగా వ్యాప్తి చేయడం వెనుక పనిచేసిన శక్తులేవో ప్రపంచానికి తెలియాల్సి ఉంది.

అలాగే ప్రపంచంలో సంపన్న దేశాలు, అభివృద్ధి పథంలో ఉన్న దేశాలు అయిన అమెరికా, బ్రిటన్, ఇండియా, బ్రెజిల్, రష్యా, మెక్సికో, స్పెయిన్, చిలీ, ఇరాన్, దక్షిణాఫ్రికాలలో మాత్రమే వైరస్ దానితో పాటు భయాలు తీవ్రంగా వ్యాపించడానికి గల కారణాలు కూడా ఆలోచించాలి. పేద దేశాల్లోని ప్రజలు ఆరోగ్యం కోసం లక్షల్లో ధారబోయగల సామర్థ్యం లేకపోవడమే అనే వాదన కొట్టిపారేయాల్సింది ఏం కాదు.

నిజానికి ప్రతీ రోజూ వేర్వేరు వ్యాధులతో ఎంతోమంది మరణిస్తున్నారు. క్యాన్సర్, నిమోనియా వంటి ఇతర వ్యాధుల తో ప్రతీ రోజు జరిగే మరణాలు కరోన మరణాల కంటే ఎక్కువే. కానీ అవేవి ప్రస్తుత మరణాల లాగా ఏ రోజుకారోజు ప్రకటించబడడం లేదు. ఇది గుర్తించాల్సిన విషయం. అలాగే వైరస్ వల్ల జరుగుతున్న మరణాల్లో 60 శాతం కంటే ఎక్కువ గుండె సంబంధిత కారణాలతో జరుగుతున్నాయి. దీనికి ప్రధాన కారణం భయాందోళనకు గురికావడమే. మానసిక ఒత్తిడి, భయం అనేవి రోగనిరోధక శక్తిని తగ్గించడమే కాకుండా హైపర్ టెన్షన్, గుండె నొప్పి, గుండె పనితీరు దెబ్బనడానికి కారణమవుతాయన్న విషయం తెలిసిందే. అంటే ప్రజల్లో నెలకొన్న భయాలను తొలగించినట్లైతే ప్రస్తుత మరణాలను సగానీకంటే ఎక్కువగా తగ్గించే అవకాశం ఉంది. ప్రస్తుత వైరస్ సోకిందన్న భయం కంటే, దాని తర్వాత ఎదుర్కోవాల్సిన పరిణామాలు మరింత భయభ్రాంతులకు గురిచేస్తున్నాయి.

భౌతిక దూరం స్థానంలో ప్రయోగించిన సామాజిక దూరం చాలా దూరం ముందుకెళ్లి సామాజిక వెలిగా మారింది. పాలు, నీళ్లు, కూరగాయలకు కూడా ఇబ్బందులు ఎదుర్కొంటున్న దుస్థితి దాపురించింది. సాధారణ వ్యాధులకు సైతం చికిత్స చేయడానికి వైద్య సిబ్బంది వెనుకడుగు వేయాల్సి రావడం, కళ్లముందే ప్రాణం పోతున్నా, నడిరోడ్డు మీదే పడిపోయి చనిపోతున్నా స్పందించలేని అమానవీయత సృష్టించబడింది. కుటుంబ సంబంధాలు, బంధుత్వాలు, స్నేహాలు, మానవ సంబంధాలన్నీ మంట కలిసిన స్థితిలో ప్రపంచం దూసుకుపోతుంది. పెట్టుబడిదారీ విధానానికి కావాల్సిన మానవ సంబంధాల విచ్ఛిన్నతను కరోన వైరస్ పేరుతో పరిపూర్ణం చేశారు.

వైరస్ గురించి ప్రపంచ ఆరోగ్య సంస్థ గానీ, వివిధ దేశాధినేతలు గానీ, వైద్య నిపుణులు గానీ మొదట నుంచి చేస్తున్న ప్రకటనలు, సూచనల్లో ఎన్నో వైరుధ్యాలు కనపడుతున్నాయి. అందులో మొదటిది వైరస్ సోకిన 80 శాతం మందికి అది వారికి సోకిన విషయం తెలియకుండానే తగ్గిపోతుందని ప్రకటించారు. ఇది ఎంతో అసంబద్ధమైనది, సందేహాస్పదమైనది. 80 శాతం మందికి తమ శరీరంలోకి వచ్చి ఏ హాని చేయకుండా వెళ్లిన విషయం కూడా గుర్తించలేనప్పుడు ఆ వైరస్‌ను ప్రపంచ మహమ్మారి అనడం హాస్యాస్పదంగా ఉంది. ఇది జలుబు వైరస్ లక్షణం. అది కూడా వ్యాప్తిరేటు చాలా ఎక్కువ, రోగనిరోధక శక్తి ఎక్కువగా ఉన్న వ్యక్తులలో ఈ వైరస్ ప్రవేశించిన విషయం గానీ, తగ్గిపోయిన విషయం గానీ గుర్తించడం జరగదు. తీవ్రమైన నిమోనియాగా మారితే తప్ప ప్రాణాంతకం కాదు. కుటుంబంలో ఒక్కరికీ జలుబు చేస్తే దాదాపుగా మిగతా సభ్యులందరికీ వ్యాపించడం మనందరికీ అనుభవంలో ఉన్న విషయమే. ఇప్పటికీ దీనికి పూర్తి స్థాయిలో ఔషధం లేదా వాక్సిన్ లేకపోవడం, ఏ మందులు వాడకుండా ఉన్నప్పటికీ నిర్దిష్ట కాలం తరువాత దానంతట అదే తగ్గుముఖం పట్టడం వంటి పోలికలు చూసినప్పుడు జలుబును కూడా మహమ్మారిగా అయినా ప్రకటించాలి లేదా కరోనను సాధారణ జలుబు గానో లేక నిమోనియా గానో గుర్తించాలి.

కరోన వైరస్ సోకిన ఒక వ్యక్తికి వైద్యం అందించిన కొన్ని రోజుల తర్వాత అతని శరీరంలో వైరస్ లేకుండా (నెగిటివ్) పోతుంది. దానర్థం సాధారణ భాషలో వైరస్ చంపబడింది. అంటే వైరస్ మీద వైద్యం కోసం వినియోగించబడ్డ మందులు పనిచేసినట్లే. అయినప్పుడు వైరస్‌కు మందు లేదని చెప్పడం సందేహం కలిగిస్తుంది. ఒకవేళ మందు లేదనేది నిజమైతే ఏ మందులు ఇవ్వకపోయినా నిర్దిష్ట కాలం తర్వాత నెగిటివ్‌గా వచ్చే అవకాశం ఉందనే కదా అర్థం. ఇదొక ముఖ్యమైన వైరుధ్యం.

అలాగే కరెన్సీ నోట్ల చెలామణి ద్వారా వైరస్ వ్యాపిస్తుంది కానీ, వార్తా పత్రికల ద్వారా వ్యాపించదు అని ప్రకటించారు. ఇది మరొక వైరుధ్యం. దీని వెనుక గల వ్యాపార కోణం కూడా అర్థం చేసుకోవచ్చు. కరెన్సీ నోట్లను నియంత్రించడం ద్వారా పెట్టుబడిదారులకు అనుకూలమైన డిజిటల్ కరెన్సీ వినియోగం పెంచుకోవడం ఈ వైరుధ్యం వెనుక దాగిన ప్రయోజనం అయి ఉండవచ్చు. అదే సమయంలో వార్తా పత్రికలు నియంత్రణ వల్ల ఇప్పటికిప్పుడు వచ్చే ప్రయోజనం లేకపోగా తాము సృష్టించిన భయాలు, ఆందోళనలు ఎప్పటికప్పుడు ప్రజల్లోకి చేరాలంటే పత్రికల అవసరం ఎంతైనా ఉందనేది వారి అభిప్రాయం. అలాగే వైరస్ సోకిన వ్యక్తి లాలాజలం ద్వారా అంటే దగ్గడం, తుమ్మడం, చీదడం ద్వారా విడుదల అయ్యే తుంపర్లు బయటి వస్తువుల మీద అతుక్కుని వేరొక వ్యక్తి వాటిని తాకడం ద్వారా శరీరంలోకి ప్రవేశించడం జరుగుతుందని ప్రకటించి, ప్రస్తుతం గాలి ద్వారా కూడా వ్యాప్తి చెందుతుందని ప్రకటిస్తున్నారు. ఇది మరొక వైరుధ్యం. గాలి ద్వారా వ్యాప్తి అంటే ఒక వ్యక్తి శ్వాసక్రియలో జరిగే శాతం ఉచ్వాశ నిశ్వాస (ముక్కు ద్వారా విడుదల అయిన గాలి) ల ద్వారా గాలి పీల్చిన వారికి కూడా సోకుతుందనేది దీని సారాంశం. ఇదే కనుక నిజమైతే ఇప్పటికే ప్రపంచ వ్యాప్తంగా 90 శాతం మందికి సోకి ఉండాల్సింది. ప్రజల్లో వైరస్ పట్ల భయం తగ్గుతుందన్నప్పుడల్లా దానిని పెంచే ఉత్ప్రేరకాలుగానే ఈ పరస్పర వైరుధ్య, హాస్యాస్పదమైన ప్రకటనలు విడుదలవుతున్నట్లుగా భావించాల్సి వస్తుంది.

ఇంకా మొదట ప్రకటించిన వైరస్ లక్షణాలు కేవలం నాలుగు. అవి పొడి దగ్గు, జలుబు, జ్వరం, గొంతునొప్పి. ఈ లక్షణాల జాబితాలోకి ఒక్కొక్కటిగా చేరుస్తూ సాధారణ అనారోగ్య లక్షణాలు అన్నింటినీ వైరస్ లక్షణాలుగా మార్చేశారు. ఇవాళ తలనొప్పి, ఒళ్లునొప్పులు, కళ్లుతిరగడం, నీరసం, రుచి వాసన గుర్తించలేకపోవడం, వాంతులు, విరేచనాలు, ఛాతినొప్పి వంటివన్నీ కరోన లక్షణాలుగా ముందుకు తెచ్చారంటే ప్రజలు ఏ చిన్న అనారోగ్య సమస్యనైనా కరోన గానే అనుమానించి హాస్పిటల్స్‌కి వెళ్లాల్సిన పరిస్థితి సృష్టించబడింది. జలుబు చేసినప్పుడు వాసన గ్రహణశక్తి, జ్వరం వచ్చినప్పుడు రుచిని గ్రహించే శక్తిని కోల్పోవడం పోషకాహారం లోపం వల్ల నీరసం సర్వ సాధారణం అనే వాస్తవాన్ని కూడా ఆలోచించలేని భయానక స్థితిలోకి మనుషులందరూ కూరుకుపోయారు. ఎంతగా అంటే భూమి మీద పుట్టిన ప్రతి మనిషి, జ్ఞానం తెలిసిన పసిపిల్లలతో సహా, నాగరిక సమాజానికి సుదూరంగా కొండ ప్రాంతాల్లో జీవించే ఆదివాసులతో సహా కరోన పేరును ఉచ్చారణ చేసిన వాళ్లే. ప్రపంచ వ్యాప్తంగా ఇంత వేగంగా, సూటిగా కచ్చితంగా ప్రజల్లోకి వైరస్ భయాన్ని చొప్పించడానికీ ఉపయోగించిన ఆయుధమే లాక్ డౌన్.

పునరుక్తి

# బడ్జెట్ అంటే ఏమిటి?



*ఆగస్ట్ 30 వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు **వి. హనుమంతరావు** పుట్టిన రోజు. ఈ ఆగస్ట్ 30కి ఆయనకు 95 సంవత్సరాలు వచ్చి ఉండేవి. 1940లలో ప్రారంభించి 2016 డిసెంబర్ 13న మరణించే వరకు ఆగకుండా నిరంతరం ప్రజాపక్ష ఆలోచనాపరుడిగా, రచయితగా, ఆర్థిక విశ్లేషకుడిగా ఆయన సాగించిన ప్రయాణం వీక్షణంకు ఆదర్శం. ఎన్నో పుస్తకాల రచనతో పాటు, మరెన్నో పుస్తకాలు కాగలిగిన వ్యాసాలతోపాటు ఆయన కనీసం ఆరు పత్రికలతో సన్నిహితం సంబంధంలోనూ, డజన్ల కొద్దీ పత్రికలకు రచనలు చేస్తూనూ ఉన్నారు. 2003లో ఆయన ప్రారంభించిన వీక్షణం ఆయన పుట్టిన రోజు సందర్భంగా ఆయన స్మృతిలో 2015 ఫిబ్రవరి సంచిక నుంచి ఈ వ్యాసాన్ని పునర్ముద్రిస్తున్నది.*

**బ**డ్జెట్ల సీజన్ వచ్చేసింది. ప్రజలంతా ఏం పన్నులు వేస్తారోనని భయపడే సీజన్ కూడా ఇదే. విభజన ముందు ఆంధ్రప్రదేశ్‌లో ఈ భయం ఉండేదికాదు. ఎందుచేతనంటే సంవత్సరం పొడవునా ఎపుడుపడితే అప్పుడు పన్నులు వేయడం అలవాటు. పన్నులు విధించేది ప్రజలకు సౌకర్యాలు కలగజేయడానికని చట్టం చెబుతుంది. కాని ప్రపంచ బ్యాంకు పుణ్యమా అంటూ అవే సైకర్యాల కల్పనకోసం యూసర్ ఛార్జీల పేరుతో ఎడా పెడా వడ్డించడం ప్రారంభమైంది. ఇవికాక పార్లమెంటులో కేంద్ర బడ్జెట్‌లో వడ్డింపులు మనది హిందూ దేశమని బిజెపి పాలకులు అంటున్నారు కాని పన్నుల భారతం అంటే సరిగ్గానప్పుతుంది. ఇలా ఇటు రాష్ట్రం, అటు కేంద్రం వడ్డీస్తూ పోతున్నాయంటే ప్రజలుగా మన చేతకాని తనం అనే చెప్పాలి. స్వతంత్ర పోరాటంలో మనతాతలు, తండ్రులు పన్నులు చెల్లించబోమంటూ పన్ను నిరాకరణ ఉద్యమాలను నడిపి జైళ్ల కెళ్లారు. మనమేమో ఎందుకు లెండి. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది.

బడ్జెట్ అంటే చాలా మందికి ఎలర్జీ. దాని నిండా ఏవేవో గణాంకాలు, శాతాలు, కూడికలు, తీసివేతలు ఉంటాయి. ఏమీ అర్థం కావు. నాకు అలాగే అనిపించేది. మరికొంత మందికి ప్రభుత్వం తప్పుడు లెక్కలిస్తుంది, అలాంటి లెక్కల ఆధారంగా వ్యాసాలు రాయడమేమిటి ప్రజలను తప్పుదారి పట్టిస్తాయని అంటారు. కాని ఆ అంకెలను అర్థం చేసుకోగలిగితే మన తలరాత ఎలా ఉండబోతుందో అర్థమైపోతుంది. అసలు బడ్జెట్ అంటే ఏమిటి? ఉదాహరణకు మీ ఇంటో మీ అమ్మాయికి వివాహం చేయాలి. ఎంత ఖర్చుచేయాలి. మీ దగ్గర డబ్బు చాలదు. ఏం చేయాలి. ఎవరి వద్ద అప్పు తేవాలి? ఏ ఖర్చు తగ్గించాలి అంటూ లెక్కలు వేసుకొంటూ రాలేదా? బడ్జెట్ అంటే అంతే. ఇది మీ వ్యక్తిగత బడ్జెట్, ప్రభుత్వం మొత్తం రాష్ట్రానికి, దేశానికి ఎంత ఆదాయం, ఎంత ఖర్చు, లేటూ, మిగులూ అని లెక్కలువేస్తుంది. అదే బడ్జెట్. కొంచెం వివరాల్లోకి పోదాం.

ఈ ద్రవ్య వ్యవహారాలను అర్థం చేసుకోవాల్సినపుడు వచ్చే

---

లాభాల వేటలో సృష్టించబడ్డ భయాలు వ్యాపారాలుగా మారి తక్షణ లాభాలను ఆర్జించడంలో బహుళజాతి కంపెనీలు, ఫార్మా కంపెనీలు, కార్పొరేట్ వైద్య రంగం, రసాయన పరిశ్రమలు పోటి పడుతూ శరవేగంగా దూసుకుపోతున్నాయి. గతంలో దేశాల మధ్య లాభాల వేటలో సాగిన ఆయుధ పోటీ స్థానంలో ఇప్పుడు ఔషధాలు వచ్చి చేరాయి. 1000 రూపాయల మందులతో నయమయ్యే వ్యాధిని, 5 లక్షల రూపాయలకు పెంచేసింది కార్పొరేట్ వైద్యం. పదుల సంఖ్యలో బాధితులు ఉన్నప్పుడు ప్రజా వైద్యంను అందించిన ప్రభుత్వాలు, వేలల్లో లక్షల్లో ప్రజలు బాధితులుగా మారే క్రమంలో చేతులెత్తేసి, కార్పొరేట్ దోపిడీకి మార్గం సుగమం చేశాయి. సంపన్నులకు కార్పొరేట్ వైద్యం, లేని వాడికి అరకొర వసతుల మధ్య ఉన్న ప్రభుత్వ వైద్యం అందిస్తూ, సామాన్యుడికి అందనంత ఎత్తులో కరోన వైద్యాన్ని ఇప్పటికే నిలబెట్టారు. మరొక వైపు కరోన మందు, వాక్సిన్ ల పేరుతో ఫార్మా కంపెనీల పోటీ, మందులను బ్లాక్ మార్కెట్టుకు తరలించే దందా కూడా అప్పుడే మొదలైంది.

ఒక సర్వే ప్రకారం గతంలో సంవత్సరానికి దేశంలో 70 లక్షల లీటర్ల శానిటైజర్ ఉపయోగించగా, ప్రస్తుతం ఒక్క నెలలోనే అంతకు మించి వినియోగిస్తున్నారంటే ఒక్క శానిటైజర్ వల్లే ఎన్ని కోట్ల వ్యాపారం జరుగుతుందో ఊహించవచ్చు. గతంలో కంటే అనేక రెట్లు వినియోగం పెరిగిన సబ్బులు, హాండ్ వాష్‌లు, మాస్కులు, మందుల వల్ల జరుగుతున్న వ్యాపారం దీనికి అదనం. రాబోయే కొద్దిరోజుల్లోనే కరోన షాపింగ్ మాల్స్ రూపొంది ప్రజల రక్తాన్ని జలగల్లా పీల్చడం కూడా జరుగుతుంది. ఇది మాత్రమే కాకుండా కరోన పేరుతో విద్యా రంగంలో డిజిటల్, ఆన్‌లైన్ తరగతుల నిర్వహణ పేరుతో మొబైల్ ఫోన్ల పరిశ్రమలు, టెలికాం కంపెనీలు లాభాలు పొందే ప్రయత్నాలు ముమ్మరం చేయడం, దీనికి ప్రభుత్వాలు సహకరించడం మూలంగా ప్రభుత్వ విద్యారంగ వినాశనానికి బాటలు పరుస్తున్నారు. ఇప్పటికైనా వైరస్ పట్ల ప్రజల్లోకి చేర్చబడ్డ అనవసర భయాలను పోగొట్టేలా ప్రభుత్వాలు, మీడియా, రచయితలు, మేధావులు, విశ్లేషకులు కృషి చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు, టిపిటిఎఫ్ జిల్లా కౌన్సిలర్, మహబూబాబాద్)*

వీ

సంవత్సరంలో ఎంత ఆదాయం, ఎంత ఖర్చు అని లెక్కలు వేస్తుంది. ఆదాయంలో రెండు ప్రధాన పద్దులను ఖర్చులో మూడు ప్రధాన పద్దులను లెక్కవేస్తారు. ఆదాయంలో రెవెన్యూ రాబడి, మూలధన రాబడి అని విభజిస్తారు. రెవెన్యూ రాబడి కింద కేంద్ర పన్నుల్లో వాటా, సొంత పన్నుల రాబడి, పన్నేతర రాబడి, సహాయ గ్రాంట్లు అనే నాలుగు ఉప పద్దులుంటాయి. మూలధన రాబడి కింద బహిరంగ మార్కెట్ రుణాలు, తాత్కాలిక రుణాలు, కేంద్ర ప్రభుత్వం నుంచి రుణాలు, ఇతర రుణాలు వగైరా ఎనిమిది ఉప పద్దులుంటాయి. అయితే ఈ పన్నులు ఎన్ని, ఏవేవి ఉండాలో నిర్దిష్టమైన సూత్రాలు గాని, ప్రాతిపదికలు గాని ఏమీలేవు. అయితే సాధారణంగా ద్రవ్య విధానానికి సంబంధించిన సైద్ధాంతిక అవగాహన ప్రకారం రెవెన్యూ రాబడి అంటే ఏ ఏటి కాయేడు తాత్కాలికంగా వచ్చేది గాను, మూలధన రాబడి దీర్ఘకాలికమైన దానిగాను గుర్తించడం జరుగుతుంది. కాని ఈ సైద్ధాంతిక అవగాహన కూడా ఈ మధ్య కాలంలో కచ్చితంగా అమలులోకి రావడంలేదు.

ఇక వ్యయం కింద ఉండే మూడు ప్రధాన పద్దులు ప్రణాళికా వ్యయం, ప్రణాళికేతర వ్యయం, మూలధనం చెల్లింపులు అనేవి. అయితే మోడీ ప్రభుత్వం ప్రణాళికనే రద్దుచేసింది. దాని స్థానే వచ్చిన నూతన విధానం ఇంకా నిర్దిష్టమైన స్వరూపం తీసుకోలేదు. ఈ మౌలికమైన, సరళమైన ఆదాయ వ్యయాలను సంక్లిష్టంగా మార్చి రెవెన్యూ లోటు, ద్రవ్య లూటు, ప్రాథమిక లోటు, బడ్జెట్ లోటు వంటి వేర్వేరు భావనలను సృష్టించి లోటు పరిణామాన్ని మసిపూసి మారుడుకాయ చేయడానికికే ఈ గందరగోళం ఉపయోగపడుతుంది. అలాగే ఉన్నా ద్రవ్య వ్యవహారాలను అర్థం చేసుకోవడానికి ఈ భావనల మీద ప్రభుత్వం బడ్జెట్ గణాంలు ఇచ్చే అంకెల మీద ఆధారపడక తప్పదని గ్రహించాలి.

ద్రవ్య వ్యవహారాల గురించి, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య విషయాల్లో సాగుతున్న పరిణామాల గురించి విశ్లేషించబోయే ముందు రాష్ట్ర స్థూల ఉత్పత్తి రాష్ట్ర నికర ఉత్పత్తి, తలసరి ఆదాయం వంటి భావనలను పరిశీలించాలి. జాతీయదాయం జాతీయోత్పత్తి, రాష్ట్ర నికర ఉత్పతి, తలసరి ఆదాయం వంటి విషయాలను గురించి అర్థం చేసుకోవాలి. జాతీయాదాయం, జాతీయోత్పత్తి అనే దేశానికంతా వర్తించే భావనలను రాష్ట్రానికి వర్తింపచేసి రాష్ట్ర స్థూల ఉత్పత్తి (జిఎస్‌డిపి) అనే భావనను, దానిలో పునారావృతమైన పద్దులను, విలువల చేర్పులను తొలగించి రాష్ట్ర నికర ఉత్పత్తి (ఎన్ఎస్‌డిపి) అనే భావనను తయారు చేశారు. ఈ నికర ఉత్పత్తిని జన సంఖ్యతో భాగించినప్పుడు వచ్చే అంకెను తలసరి ఆదాయం అంటారు.

ఒక సంవత్సర కాలంలో ఒక రాష్ట్రంలో జరిగిన అన్ని కార్యకలాపాలలో ఉత్పత్తి అయిన సరకుల సేవల విలువల మొత్తాన్ని స్థూల ఉత్పత్తి అనవచ్చు. అయితే ప్రతీ సరుకులోను, సేవలలోను, మరెన్నో సేవలలోను మరెన్నో సేవలు, సరుకులు, సేవలు నిక్షిప్తమై ఉంటాయి. అటువంటప్పుడు వాటి విలువలు లెక్కింపులో పునరుక్తికి గాని విస్మరణకు గాని అవకాశం ఉంటుంది. అంతేకాక రాష్ట్రాలకు మధ్య సరకుల సేవల రవాణాకు, వినిమయానికి ఎంతో అవకాశముంది. అది కూడా స్థూల ఉత్పత్తి లెక్కింపులో ప్రభావం చూపుతుంది. మరొక విషయం ప్రతీ సంవత్సరం ఉత్పత్తి మొత్తం అదే స్థాయిలో ఉంటుంది కాని ధరల పెరుగుదల వల్ల ఉత్పత్తి మొత్తం విలువ పెరుగుతుంది. అందువల్ల జిడిపి పెరుగుతుంది. కాని వాస్తవంలో పెరగదు. ఈ అంకెలు మొత్తం ఆర్థిక వ్యవస్థను పరిగణలోకి తీసుకొని అసమానతలను అస్పష్టం చేసి సగటు అంచనాలకు వస్తాయని, అందువల్ల కొన్ని వేల మంది సంపన్నుల ఆస్తులను, కొన్ని కోట్ల మంది ఆస్తిలేని నిరుపేదల ఆస్తులను ఒకేగాటన కట్టి మొత్తం సమాజం స్థూల ఆదాయంగా ప్రకటించి, తలసరి ఆదాయాన్ని లెక్కవేస్తాయి. అందువల్ల ఏ ఆదాయం లేని నిరుపేదల సగటు ఆదాయం వాస్తవంలో పెరగకపోయినా, భావనాత్మకంగా పెరుగుదల చూపిస్తుంది. ఇటువంటి భావనాత్మక పెరుగుదలల ఆధారంగా గుండు గుత్త మొత్తం అంకెల ద్వారా పెరుగుదల రేట్లను లెక్కకట్టినప్పుడు కూడా విశ్వసనీయత తగ్గుతుంది. ఒక ఆర్థిక వ్యవస్థ ప్రగతిని ఇటువంటి అభివృద్ధి రేటుతో గుర్తించడం జరుగుతుంది కాని ఆ అభివృద్ధి రేట్లు నిజంగా అట్టడుగు ప్రజానీకం జీవిత ప్రమాణాలకు సూచికలు కాజాలవు. ఈ అంకెల గారడిలను, భావనల అవాస్తవికతను అవిశ్వసనీయతను దృష్టిలో ఉంచుకొంటూనే, అంతకన్నా సవ్యమైన అంకెలు, భావనలు, సఖ్యాత్మక వ్యక్తీకరణలు లేకపోవడంవల్లే వాటి మీదనే ఆధారపడి ద్రవ్య వ్యవహారాలను విశ్వసించాల్సి ఉంది.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ విషయానికి వస్తే మొట్ట మొదటి ఆదాయం కింద రెండు ప్రధాన పద్దులుంటాయి. వాటిలో మొదటిదైన రెవెన్యూ రాబడి కింద కేంద్ర పన్నుల్లో వాటా, సొంతపన్ను రాబడి, పన్నేతర రాబడి, సహాయక గ్రాంట్లు అనే నాలుగు ఉప పద్దులుంటాయి. కేంద్ర పన్నుల్లో రాష్ట్రాల వాటా అనేది భారత రాజ్యాంగపు ఫెడరల్ వ్యవస్థలో నిర్మాణంలో భాగం. అయిదేళ్లకు ఒకసారి కేంద్ర ప్రభుత్వం నిఆయమించే ఆర్థిక సంఘం సిఫార్సుల మేరకు రాష్ట్రాలకు ఎంత వాటా ఇవ్వాలనేది నిర్ణయిస్తుంది. కేంద్ర ప్రభుత్వం ప్రధానంగా ఆదాయ పన్ను, సెంట్రల్ ఎక్సైజ్ సుంకాలు, కార్పొరేట్ పన్నుల మొదలయిన పన్నులు వసూలు చేస్తుంది. ఈ పన్నులన్నిటిలోనూ రాష్ట్రాకు వాటా ఉంటుంది. ఇక నాలుగో ఉప పద్దు అయిన సహాయక గ్రాంటులు కూడా రాష్ట్రానికి కేంద్రం నుంచి అందేవే. ఈ సహాయ గ్రాంట్లు ప్రధానంగా ప్రణాళికేతర గ్రాంట్లు, కేంద్ర ప్రణాళిక అమలుకు గ్రాంట్లు, కేంద్ర ప్రతిపాదిత ప్రణాళిక పథకాలకు గ్రాంట్లు అనేవి నాలుగు రకాలుగా ఉంటాయి. ప్రణాళికా సంఘం రద్దుతో, కేంద్రం నుంచి వచ్చే నిధుల్లో ఎటువంటి మార్పులొస్తాయో వేచి చూడాలి. అంతేకాక కేంద్రం నిధుల కొరతతో కుస్తీ పడుతున్న పరిస్థితులు కూడా రాష్ట్రాలకు వచ్చే ఆదాయం ప్రభావితం అయ్యే అవకాశం ఉంది. అమెరికా నుంచి వచ్చే ఒత్తిళ్లు ఉండనే ఉన్నాయి. సహాయ గ్రాంట్లు కేంద్రం ఇష్టా రాజ్యంగాను, దయా దాక్షిణ్యాల మీద నడుస్తున్నాయి.

రాష్ట్రం విధించే పన్నులో పన్నేతర రాబడి అనే పద్దు రాష్ట్ర ప్రభుత్వం పోగుచేసుకొన్న సొంత ఆదాయ వనరులకు, సృష్టించుకొన్న ఆస్తులకు సూచిక. పన్నేతర ఆదాయం ప్రధానంగా రాష్ట్ర ప్రభుత్వం సృష్టించుకొన్న ఆస్తులు, పన్నేతర ఆదాయం తగ్గిందంటే ఆస్తుల సృష్టిలో ప్రభుత్వం వైఫల్యాన్ని సూచిస్తుంది. ఈ వైఫల్యం పెరగడం మీద దృష్టి సారించకపోతే, ఆదాయ వనరుల సృష్టికోసం పన్నులు పెంచడం, సామాన్యుడు మరింత భారాన్ని మోయాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. పన్నేతర రాబడిని విడదీసి విశ్లేషిస్తే ప్రభుత్వం ఇచ్చే రుణాల మీద వడ్డీలు, ప్రభుత్వం వివిధ పరిశ్రమల్లో పెట్టిన పెట్టుబడులపై లాభాలు, డివిడెండ్లు ఉంటాయి.

అలాగే సాధారణ సర్వీసులు అంటే పబ్లిక్ సర్వీస్ కమీషన్, పోలీసు, జైల్లు, స్టేషనరీ ముద్రణ, పబ్లిక్ వడ్డీ, ఇతర పరిపాలనా సర్వీసులు, విరాలాలు, వసూళ్ల లాంటి వాటి నుంచి వచ్చే రాబడి ఉంటాయి. అదే విధంగా సాంఘిక సర్వీసులు అంటే విద్య, క్రీడలు, కళలు, సంస్కృతి, విద్య, వైద్యం, ప్రజారోగ్యం, కుటుంబ సంక్షేమం, నీటి సరఫరా, పారిశుధ్య, గృహ నిర్మాణం, పట్టణాభివృద్ధి, సమాచారం, కార్మిక ఉద్యోగ వసతి, సాంఘిక బాధ్యత, సంక్షేమం లాంటి సాంఘిక సేవా రంగాల నుంచి వచ్చే రాబడి. నాల్గవ ఉప పద్దు అయిన ఆర్థిక సర్వీసుల కింద పశు సంరక్షణ, పందుల సం....? పాడి పరిశ్రమాభివృద్ధి, మత్స్య పరిశ్రమ, అడవుల సంరక్షణ, వన్య ప్రాణుల, సహకారం, ఇతర వ్యవసాయ కార్యక్రమాలు, భారీ, మధ్యతరహా చిన్న నీటితరహా పారుదల, విద్యుచ్ఛక్తి, గ్రామీణ, చిన్నతరహా పరిశ్రమలు, ఓడరేవులు, ఏర్పాటు కారణంగా మొదలైన వాటి నుంచి వచ్చే రాబడి ఉంటుంది. సాధారణంగా పన్నేతర రాబడి కింద ఉండే అన్ని పద్దులూ ఈ కార్యక్రమాల నుంచి రాబడి తగ్గుతుండడంతో, ఈ సేవలన్నింటి మీద యూజర్ ఛార్జీలు వసూలు చేయాలని ప్రపంచ బ్యాంకు సూచించిన మేరకు రాష్ట్ర ప్రభుత్వం ఆ ఛార్జీలు వేయడం, ప్రతి సంవత్సరం కొత్త కొత్త యూజర్ ఛార్జీలు వసూలు చేస్తోంది. అంటే సామాన్యుల మీద మరిన్ని భారాలు మోపడమే.

**వ్యయం**

ఇక వ్యయానికి వస్తే ఈ వ్యయం రెండు రకాలుగా ఉంటుంది. దీన్ని కూడా రెవెన్యూ వ్యయం, మూలధన వ్యయం అనే ఉండు పద్దుల కింద చూపిస్తారు. రెవెన్యూ వ్యయాన్ని ఉత్పాదక (అభివృద్ధి) వ్యయం, అనుత్పాదక వ్యయం అని విభజించే సాంప్రదాయం కూడా ఉంది. అభివృద్ధి కార్యక్రమాలపై పెట్టే ఖర్చునూ భౌతిక వనరుల రూపంలోని మూలధనాన్ని పెంపొందించడానికి చేసే ఖర్చును వ్యవసాయం, నీటి పారుదల, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి మొదలైన వాటి రూపంలో భౌతిక మూలధనాన్ని పెంపొందించే ఖర్చును విద్య వైద్య ప్రజారోగ్యం, క్రీడలు, పారిశుధ్యం వంటి వాటి రూపంలో మానవ వనరులను అభివృద్ధి చేయడానకి చేసే ఖర్చును ఉత్పాదక వ్యయంలో చూపడం ఆనవాయితి. అనుత్పాదక వ్యయం, అభివృద్ధేతర వ్యయం అనే పద్దు కింద రుణాలు తిరిగి చెల్లింపులు , పరిపాలనా సేవలు, పన్ను వసూళ్ల వ్యయం, ఇతర ఖర్చులు అనే నాలుగు పద్దులుంటాయి.

సాధారణంగా ప్రభుత్వ వ్యయాల్లో కొన్ని వ్యయాలు ఈ నిర్వచనాలకు లొంగవు. ఒక వ్యయాన్ని ఉత్పాదక వ్యయంగా చూపడానికి ఎన్ని అవకాశాలున్నాయో, అనుత్పాదక వ్యయం అనడానికి అన్ని అవకాశాలున్నాయి. ఈ గందర గోళం ఎలా ఉన్నా, ఈ విభజన పద్దులు స్థూలంగా ఆర్థిక వ్యవస్థలోని ద్రవ్య సంబంద పరిణామాలను అర్థం చేసుకోవడానికి పనికొస్తాయి. విద్య, వైద్యం లాంటి సామాన్య మానవుని కనీస అవసరాల గురించి కేటాయింపులు బారెడు, అవి కూడా అందకుండా పోతున్న విషయం ఆనాడు, ఈనాడు ఉందని ద్రాక్షగానే ఉండి పోయాయి. గత 15 రోజులుగా స్వైన్ ఫ్లూ గురించి ఎంత నిర్లక్ష్యం చేశారంటే, ఒక మంత్రిని ఆ శాఖ నుంచి తప్పించాల్సి వచ్చిన పరిస్థితి ఏర్పడింది. పదుల మంది చనిపోయారు. విద్య గురించి చెప్పాలంటే అయిదారు క్లాసు బాల బాలికలు రెండో తరగతి పుస్తకం కూడా చదవలేక పోతున్నారని గత వారంలో పత్రికల్లో వార్తలొచ్చాయి. సామాజిక సేవలన్నీ పేదలకు అందుబాటులోకి రావడం లేదు.

వ్యవసాయం నీటి పారుదల గురించిన బడ్జెట్ కేటాయింపుల గురించిన కేటాయింపుల గురించి గణాంకాలు విశ్లేషించుకొన్నపుడు కొన్ని విషయాలు గమనంలో ఉంచుకోవాలి. 1. ఈ పద్దుకు కేటాయించిన సొమ్మంతా కేవలం పంట పండించడానికి చేసిన కేటాయింపు మాత్రమే కాదు, పశు సంరక్షణ మత్స్య శాఖా, సహకారం, పందులు, కోళ్లు, కొక్కిరాయలు, అడవులు, తిండి గింజలు, వ్యాపారపంటలు, ఎరువులు, పురుగు మందులు, విత్తనాలు, వ్యవసాయ టెక్నాలజీ, పాడి పరిశ్రమ ఇలా ఎన్నో ఉప పద్దులుంటాయి. వ్యవసాయ రంగానికి ముఖ్యావసరం వ్యవసాయ రుణాలు. ఈ రుణాల సంగతి చెప్పాలంటే అమ్మ పుట్టిల్లు మేనమామకు చెప్పినట్లవుతుంది. వ్యవసాయానికి బ్యాంకులిచ్చే రుణాల్లో సింహభాగం ధన వంతులైన రైతులే కాజేస్తారు. వ్యవసాయ యాంత్రీకరణ పేరుతో లక్షల రూపాయల రుణాలు తీసుకొంటారు. కొత్త ప్రభుత్వం రుణమాఫీ పథకం కింద మాఫీ చేస్తే లాభపడేది వీరే. చిన్న, సన్నకారు రైతులకు బడ్జెట్ కేటాయింపుల్లో ఎంగిలి చెయ్యి విదిలించినంత మాత్రమే ముదుతుంది. రిజర్వు బ్యాంకు వార్షిక నివేదికల్లో ఏయే స్థాయి రైతులకు ఎంత మంది రైతులకు ఎంతెంత రుణం ముట్టింది అనే గణాంకాలు ఉంటాయి.

నీటి పారుదలకు కేటాయింపులు భారిగానే కనపడతాయి. అయినా కేటాయింపులు ఎంత అరకొరగా ఉంటాయంటే సంవత్సరాలు, దశాబ్దాలు గడిచినా నిర్మాణం జరుగుతూనే ఉన్నాయి. చెరువులు తవ్వడానికి కూడా ప్రపంచ బ్యాంకు నుంచి రుణం తెచ్చుకోవాల్సిన పరిస్థితి. నాగార్జున సాగర్ నిర్మాణానికి పైసా అప్పుతేకుండా నిర్మించగలిగాం కాని పూడికలు తీయడానికి ప్రపంచ బ్యాంకు ముందు చేయి సాచాల్సి వచ్చింది. ఈ విదేశీ రుణాల గురించి అమెరికా నాయకులు ఏమని అన్నారో చూడండి.

'అభివృద్ధి చెందుతున్న దేశాలకు చేస్తున్న సహాయంలో చాలా కొద్ది మొత్తం మాత్రమే ఆ దేశాల్లో ఉండిపోతుంది. సహాయం చేసిన మొత్తం సమారుగా అంత ధనవంతమైన దేశాలకు తిరిగి ఇచ్చేస్తుంది. ప్రపంచ బ్యాంకు మనీ మార్కెట్లను మొత్తంగా చూసి ఏ దేశంలో మిగుల్లున్నాయి, వీటినెలా ఆకర్షించాలి అని ప్రపంచ బ్యాంకులో ఉన్న మనం చూస్తుండాలి.'

– మెక్‌నమారా, అమెరికన్ మాజీ సెక్రెటరీ

'సహాయం మాటున నిలువుదోపిడీ అమెరికాలో 20 లక్షల ఉద్యోగాలు అభివృద్ధి చెందుతున్న దేశాలకు చేసే ఎగుమతుల మీదా ఆధారపడి ఉన్నాయి. ... సహాయాన్ని అందించే అంతర్జాతీయ ఆర్థిక సంస్థలకు అమెరికా ఇచ్చే ప్రతీ డాలరు, ఆ సహాయాన్ని అందుకొన్న దేశాలు అమెరికా ఉత్పత్తులు సేవలు కొనుక్కోవడానికి రెండు డాలర్లు ఖర్చు చేస్తాయి. కేవలం ప్రపంచ బ్యాంకుకు అమెరికా అందించే ప్రతీ డాలరుకు తిరిగి అమెరికాకు తొమ్మిదిన్నర డాలర్లు తిరిగి అమెరికాకు తొమ్మిదిన్నర డాలర్లు కాంట్రాక్టులు కొనుగోళ్ల, వడ్డీ చెల్లింపులు, ఆపరేషన్ ఖర్చుల రూపంలో అమెరికా ఆదాయంలోకి వచ్చి చేరుతుంది.

– టైమ్స్ పత్రిక

ఇదీ క్లుప్తంగా బడ్జెట్ కథా కమామిషు.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

# మెకనాస్ గోల్డ్ కోసం మనుషుల వేట

*కోవిడ్ లాక్‌డౌన్ కారణంగా ఐదు నెలలుగా తన వాళ్లను ఎవరినీ కలవలేక, చివరికి న్యాయవాదులను కూడా కలవలేక చదువుకోవడానికి పత్రికలూ, పుస్తకాలూ దొరకక, రాసే అవకాశాలు లేక, మానసిక స్థితి దెబ్బతిని* **వరవరరావు** *మే చివరిలో ఆస్పత్రి పాలయ్యారు. ఎన్ఐఎ కుట్రల వల్ల ఆస్పత్రి నుంచి హడావుడిగా విడుదల చేయించి, ఆరోగ్యం బాగుందని తప్పుడు ధృవీకరణ పత్రాలతో బెయిల్ నిరాకరించారు. ఆ తర్వాత ఆరు వారాలకు ఆయనకు కోవిడ్ వ్యాధి సోకిందని ప్రభుత్వ ఆస్పత్రి నిర్ధారించింది. అయినా బెయిల్ నిరాకరించాలని ఎన్ఐఎ కుట్రలు కొనసాగిస్తోంది. ఈ నేపథ్యంలో ఆయన అరెస్ట్‌కు ముందు 2018 మే సంచికలో వీక్షణంకు రాసిన వ్యాసాన్ని పునర్ముద్రిస్తున్నాం.*

**ఈ**సారి ఎండలు శివరాత్రి దాకా కూడా ఎదురు చూడలేదు. ఉగాది వసంతం కన్నా ముందే ఉగ్రగ్రీష్మం అడవిలో నిప్పులవాన కురిసింది. అది దక్కన్ పీఠభూమి నదుల్లోకి నీళ్లు తెచ్చేది కాదు. కన్నీళ్లు తెచ్చేది. నెత్తుర్లు పారించేది. నెత్తుర్లను సలసల రగిలించేది. గుండెలవిసి పోయే సంఘటనలు. గుండెలు ఇంద్రావతి, శబరి, గోదావరి పరీవాహ ప్రాంతంలో నెర్రెలు వారిన రేగడి నేలల్లో వెయ్యి ముక్కలై పరచుకొని వేనోళ్ల నినదించిన కాలం.

మార్చ్ 2 తెలంగాణ ఛత్తీస్‌ఘడ్ సరిహద్దుల్లో చర్ల–బీజాపూర్‌లో పదిమంది అమరులయ్యారు. వాళ్లలో స్వామి (ప్రభాకర్ – వరంగల్) తప్ప అందరూ ఆదివాసులు. ఏడుగురు మహిళలు. ఏభై వసంతాలు పూర్తి చేసుకున్న నక్సల్బరీ నేపథ్యంలో, చైనా శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం ఇచ్చిన స్ఫూర్తితో మహత్తర చర్చ (గ్రేట్ డిబేట్) ముగిసి మెన్షివిజాన్ని మట్టికరిపించిన బోల్షివిక్ పార్టీ నిర్మాత లెనిన్ నూరేళ్ల పుట్టినరోజు (ఏప్రిల్ 22న) ఎనభై దేశాల్లో ఏర్పడిన సిపిఐ (ఎంఎల్) ఏభయ్యవ ఆవిర్భావ దినం ప్రారంభమైన రోజు గడ్చిరోలి జిల్లా బోరియా అటవీ ప్రాంతంలో భారీ ఎన్‌కౌంటర్ జరిగి ఇప్పటికే 16 మంది మావోయిస్టులు చనిపోయారు. ఈ సంఖ్య ఇంకా పెరుగొచ్చని, మావోయిస్టులు ప్రతిదాడులకు పాల్పడే అవకాశం ఉన్నందున గాలింపు కొనసాగిస్తున్నట్లు పోలీసులు తెలిపారు. అంటే ఇది ఏకపక్ష దాడి అని. భామ్రాగడ్ తాలూకాలోని తాడ్‌గడ్‌కు సమీపంలోని అడవుల్లో పెరిమిలి దళం సమావేశం అయిందనే పక్కా సమాచారంతో మహారాష్ట్ర నక్సల్స్ కార్యకలాపాల వ్యతిరేక పోలీసు బృందం సి–60 కమాండోలు ఈ దాడి చేశారు. ఈ సమాచారం ద్రోహి ఇచ్చిందే కావచ్చు. మీడియాలో వస్తున్నట్లు సెటిలైట్ సహాయంతో మావోయిస్టుల కదలికలను కనిపెట్టినందు వల్ల కావచ్చు.

ఇప్పటికే కేంద్ర అర్ధసైనిక బలగాలు (సిఆర్‌పిఎఫ్, బిఎస్ఎఫ్ మొదలైనవి) ఆయా రాష్ట్రాలు ఏర్పాటు చేసిన సి–60, గ్రేహౌండ్స్ వంటివి మానవరహిత ఇజ్రాయిల్ యుద్ధ విమానాలను, హెలికాప్టర్లను, డ్రోన్ కెమెరాలను, జార్ఖండ్ వంటి అటవీ ప్రాంతంలో కార్గిల్ యుద్ధంలో వాడిన రాకెట్ లాంచర్‌లను కూడా మావోయిస్టుల పేరుతో మావోయిస్టులనే కాదు ఆదివాసులను కూడా వందల సంఖ్యలో గాలింపు చర్యలు, ఎన్‌కౌంటర్‌ల పేరుతో చంపడానికి ఉపయోగిస్తున్నారు. ఇప్పుడు తాజాగా శాటిలైట్ (ఉపగ్రహం) తీసిన ఫొటోల సహాయంతో ఇంద్రావతి నది ఒడ్డున మావోయిస్టుల కదలికలను పోల్చుకొని మరి రెండు సి–60 బలగాలను రప్పించుకొని దాడిచేశారని మీడియా కథనాలు. గతంలో నల్లమల అడవుల్లో అప్పటి అవిభక్త ఎపి కమిటీ కార్యదర్శి మాధవ్, అతని ఎనిమిది మంది సహచరులను కూడా నిమ్మిచెట్టు లోయలో నడుస్తుండగా ఇట్లాగే శాటిలైట్ ఫొటోలతో కనిపెట్టి చంపారని వార్తలు వచ్చాయి. అయితే ఇటువంటి ప్రచారాలు – ద్రోహులు, కోవర్టులు ఇచ్చిన సమాచారంతో కాదని చెప్పడానికి – మంద్రస్థాయి యుద్ధంలో భాగంగా చేసే అవకాశం ఉంది. ఎందుకంటే ఇది ఏకకాలంలో భౌతిక స్థాయిలోనే కాకుండా మానసిక స్థాయిలో కూడా నిర్వహించే సైకలాజికల్ వార్.

అంతకన్నా ముఖ్యంగా ఈ మూడు నదుల పరీవాహ ప్రాంతంలోనే కాదు, తూర్పు, మధ్య భారతాల్లో – ముఖ్యంగా జార్ఖండ్, ఒడిశా, ఛత్తీస్‌ఘడ్, మహారాష్ట్ర, ఎఒబి, తెలంగాణ, ఆంధ్రల అటవీ సరిహద్దుల్లో జరుగుతున్న అన్ని ఎన్‌కౌంటర్లలో కూడా నూటికి తొంబై మంది ఆదివాసులే. వాళ్లు మావోయిస్టు పార్టీ సభ్యులు, దళ సభ్యులు, మిలిషియా, గ్రామ రక్షక దళాలు, దండకారణ్య ఆదివాసీ క్రాంతికారీ మహిళా సంఘటన్‌కు చెందిన వాళ్లు కావచ్చు. జనతన సర్కార్ ఏరియాలలో నివసించే ఆదివాసులు కావచ్చు. బహుళజాతి కంపెనీలు భారీ ఎత్తున తలపెట్టిన మైనింగ్, రైల్వే లైన్లు, భారీ నీటి ప్రాజెక్టులు, ఉక్కు ఫ్యాక్టరీల నిర్మాణాలు, బేస్ క్యాంపులు, అడుగడుగునా ఉన్న పోలీసు క్యాంపుల దగ్గర నివసించే సాధారణ ఆదివాసులు కావచ్చు. కనుకనే మనకు చాలా సందర్భాల్లో డివిజన్ స్థాయి నుంచి జిల్లా పైస్థాయి నాయకుల పేర్లు, అందులోనూ ఆదివాసేతరుల పేర్లే తప్ప ఆదివాసుల పేర్లు కూడా పూజారి కాంకేడ్ ఎన్‌కౌంటర్ సంఘటనలో వలె మావోయిస్టు పార్టీ ప్రకటిస్తే తప్ప తెలియవు. మావోయిస్టు పార్టీ స్థానిక ప్రజా ప్రతినిధులపై ఒత్తిడి పెడితే తప్ప, స్థానిక ఆదివాసీ ప్రజలు వందల సంఖ్యలో పోలీసు స్టేషన్ల ముందు ధర్నాలు చేస్తే తప్ప వాళ్ల మృతదేహాలు కూడా అప్పగించరు.

పూజారి కాంకేడ్ ఎన్‌కౌంటర్‌లో స్వామి (ప్రభాకర్) మృతదేహాన్ని ప్రజాసంఘాల, అమరుల బంధుమిత్రుల సంఘం సహాయంతో ఆయన

కుటుంబ సభ్యులు తెచ్చుకున్నా భద్రాచలం ప్రభుత్వ ఏరియా ఆసుపత్రి శవాగారంలో మిగిలిన ఆదివాసుల మృతదేహాలను బీజాపూర్, సుకుమా జిల్లాలలో ఆ అమరుల గ్రామాల ప్రజల ఆందోళన వల్లనే చర్లకు అటు ఇటు ఉండే ప్రజాప్రతినిధులు కదిలి వాళ్ల కుటుంబ సభ్యులకు అప్పగించక తప్పలేదు. అవన్నీ జనతన సర్కార్ గ్రామాలు కావడం వల్ల అమరుల ప్రతి గ్రామంలో అంతిమ యాత్రలు సంస్మరణ సభలు జరిగాయి.

కాని ప్రకృతి సంపదను బహుళజాతి కంపెనీలకు దోచిపెట్టడానికే దళారీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అత్యంత ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో, భీకరమైన ఆయుధాలతో, విస్తృతమైన సమాచార నెట్‌వర్క్‌తోనైనా సరే చేస్తున్న నిర్విచక్ష దాడుల్లో అమరులవుతున్న ఆదివాసుల పేరు, ఊరు తెలియడం కూడా కష్టం. ఈ ఎండలకు అడవిలో అమానుష నిర్లక్ష్యానికి గురయిన మృతదేహాలు కూడా మాంసపు ముద్దలుగా చూసినపుడు కన్నపేగులయినా, కట్టుకున్న వారయినా, కన్నబిడ్డలైనా పోల్చుకోవడం కష్టం.

భామ్రాగడ్‌లో గాలింపు చర్యలకు పొరుగున ఉన్న తెలంగాణ, ఛత్తీస్‌గఢ్ పోలీసు బలగాలను రప్పించినట్లు, ఎన్‌కౌంటర్ కూడా కొనసాగుతున్నట్లు, మృతుల సంఖ్య 25కు పెరుగవచ్చునని కూడా మహారాష్ట్ర పోలీసు అధికారి చెప్పాడు.

23వ తేదీ సోమవారం మధ్యాహ్నం గడ్చిరోలీ చేరుకున్న ఒక ఛానెల్ రిపోర్టర్‌ను తాజా సమాచారం కోసం అడిగితే పదహారు మృతదేహాలను మండుతున్న ఎండల్లో మీడియా ప్రతినిధులు చూడడానికి పడేసారని, అందులో ఇప్పటికైతే చల్లగరిగె విజేందర్‌ను మాత్రమే పోల్చుకున్నారని చెప్పాడు. అతని మృతదేహాన్ని రక్తబంధువులకు, స్థానిక ప్రజలకు అప్పగిస్తే ఈ సాయంత్రానికే వాళ్లు తిరిగి రావచ్చు. పోలీసులు ఇచ్చే సమాచారం ప్రకారమే మిగతా పదిహేను మందిలో ముగ్గురు మహిళలతో సహా అందరూ ఆదివాసులే. వారిలో సాయినాథ్ (34) అనే ఆదివాసీ కూడా డివిజన్ స్థాయికి ఎదిగిన వాడని కూడా పోలీసులే చెప్పారు. మరొక ఆదివాసీ మావోయిస్టు రాజేశ్‌ను కూడా గుర్తించినట్లు చెప్పారు.

సంఘటనా స్థలంలో మూడు ఎకె-47లు, భారీ ఎత్తున పేలుడు సామగ్రి, విప్లవ సాహిత్యం పోలీసులకు దొరికిందన్న దానిని బట్టే అక్కడ నాయకత్వ స్థాయి వాళ్లు ఉన్నారని చెప్పడం తప్ప పోలీసులు రెండు రోజులు గడిచినా వారి పేరు, ఊరు వంటి గుర్తింపులే ప్రకటించలేక పోతున్నారు. ఇది ఉద్దేశపూర్వకమూ కావచ్చు. లేదా ఇద్దరు డివిజన్ స్థాయి నాయకులు, మరొకరు మినహా మిగిలిన వారంతా పార్టీ పిలుపుపై గానీ, పార్టీని కలవడానికి గానీ వచ్చిన సాధారణ ప్రజలు కావచ్చు. సి-60 కమాండోలు అక్కడ సంచరిస్తున్న సాధారణ ప్రజలపై అనుమానంతో కాల్పులు జరిపి ఎన్‌కౌంటర్ ప్రకటించడమూ కావచ్చు.

ఎన్‌కౌంటర్ ప్రకటించిన రెండవ రోజు ఏప్రిల్ 23న కూడా మృతదేహాలను స్వాధీనం చేసుకునే ప్రయత్నాలు ఇంకా జరుగుతున్నాయని, భారీ వర్షాలు వాటికి అడ్డంకిగా ఉన్నాయంటున్నారు. అడవిలో వర్షాలు - బయట బండలు పగిలే ఎండలు!

ఏభై రోజుల్లో రెండో అతిపెద్ద ఎన్‌కౌంటర్ గురించి ప్రజలు ఆందోళన చెందుతూ వివరాల కోసం, గుర్తింపు కోసం, మృతదేహాలను రక్త బంధువులకు అప్పగించడం కోసం తీవ్ర ఆందోళనకు, నిరీక్షణకు గురవుతుండగానే గడ్చిరోలి జిల్లాలోనే రాజారాం ఖాండ్లా అడవిలోని జిమాల్ గుట్ట ప్రాంతంలో సోమవారం ఏప్రిల్ 23న మరో ఎన్‌కౌంటర్ జరిగినట్లు, అందులో ఎంత మంది మరణించారో కచ్చితంగా చెప్పలేకపోయినా కనీసం నలుగురు మరణించారని ఐజి చెప్పాడు.

ఛత్తీస్‌ఘడ్ సుకుమా జిల్లాలో పూస్‌పాల్ సమీపంలో ఏప్రిల్ 22 ఆదివారం రాత్రి మరో ఎన్‌కౌంటర్ జరిగిందని అందులో ఐదుగురు మావోయిస్టులు మరణించారని మరో వార్త.

ఎన్‌కౌంటర్లు ఎన్నయినవి? ఆది, సోమవారాల్లో, ఏప్రిల్ 22, 23 తేదీల్లోనే ఒకటి, రెండు, మూడు.

ఎందరు మరణించారు? 16+4+5=25

ఎందర్ని గుర్తించారు? పోలీసులైతే ముగ్గర్ని - మృతుల కుటుంబాలలో ఒక్క విజేందర్ కుటుంబం మాత్రమే అతని మృతదేహాన్ని స్వాధీనం చేసుకోవడానికి వెళ్లగలిగింది.

విజేందర్ పేద దళిత కుటుంబం నుంచి ఆర్‌వైఎల్‌లోకి వచ్చి గాజర్ల సోదరుల ప్రభావంతో విప్లవోద్యమంలోకి ఇరవై ఏళ్ల క్రితం వెళ్లి డివిజన్ స్థాయి నాయకుడయ్యాడు. రెండో డివిజన్ కమిటీ నాయకుడు సాయినాథ్ ఆదివాసీ. అతనితోపాటు రాజేశ్ పేరు మాత్రమే పోలీసులు ప్రకటించారు. మిగతా ఇరవై ముగ్గురు ఆదివాసులు కేవలం సంఖ్య. ఊరు, పేరు ఇప్పటికైతే తెలియదు. మనుషులకు, ఆదీవాసీ మానవులకు ఎంత గుర్తింపు? బహుశా వీళ్లు ఓటర్ల జాబితాలో కూడా ఉండరు. ఆధార్ కార్డులూ ఉండవు.

కశ్మీర్‌లో ఇటువంటి స్థితినే అభివర్ణిస్తూ ఇన్నా మాలిక్ అనే కవయిత్రి 'బాధితులు' అనే గుర్తింపు సభ్య సమాజం నుంచి నిరాకరిస్తూ ఒక కఠోర వాస్తవాన్ని కవితా రూపంలో వ్యక్తపరుస్తుంది. కశ్మీరులో అనునిత్యం, ప్రతిక్షణం అమలవుతూ అతి సాధారణమని భావించబడుతున్న హింస గురించి టివి స్టూడియోలో విశ్లేషణలు, రాజ్య ఆమోదిత చర్చలు, నిషేధిత ప్రసంగాలు ఏవీ ప్రజల నైసర్గిక హృదయ స్పందనలను, ఆక్రోశ, ఆగ్రహాలను పట్టుకోలేక పోతున్నాయని, భావోద్వేగ వాహిక అయిన కవిత్వమైనా పట్టుకోగలదేమో ప్రయత్నించాలి అంటుంది.

*(నాట్యానికి) ఇద్దరు చాలా ఇద్దరు చాలా?*
*త్వరలో నువ్వు గ్రహిస్తావు ముగ్గురు కావాలని*
*కనురెప్పలు కొట్టే ఇంతలోనే*
*అది నెత్తురోడుతున్న*
*బీభత్స శరీరాల గుట్ట అవుతుంది*
*వర్తులాకారంగా తిరుగుతున్న*
*కెమెరాల ముందు*
*పూర్తి నగ్నంగా*
*మామూలు కన్ను చూడలేనంతగా*
*ప్రపంచం*
*రాజ్యానంద నృత్యాలకు*
*మౌనసాక్షిగా మిగులుతుంది*
*ఇక్కడ, ఇక్కడే*
*జాతి*
*తన నిధులను వెతుక్కోవడానికి*
*వస్తుంది*

# ఇజ్రాయెల్ దురాక్రమణ కొనసాగింపు

***సామ్రాజ్యవాద దేశాల వెన్నుదన్నుతో ఇజ్రాయిల్ పాలస్తీనా భూభాగం దురాక్రమణకు పెద్ద ఎత్తున దాడులు చేస్తోందనీ, తమ న్యాయమైన హక్కుల కోసం పాలస్తీనా ప్రజలు నిరంతరం పోరాటం సాగిస్తున్నారనీ అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

ఏడు దశాబ్దాల కాలంగా పాలస్తీనా ప్రజలు తమ మాతృభూమి కోసం చేస్తున్న పోరాటం కొనసాగుతూనే ఉంది. సామ్రాజ్యవాద శక్తులు ప్రత్యేకించి అమెరికా సామ్రాజ్యవాదులు పాలస్తీనాపై అన్నిరకాల దాడులు చేయటానికి ఇజ్రాయెల్ పాలకులకు తమ సంపూర్ణ మద్దతును అందజేస్తూ పాలస్తీనా ప్రజలపై అన్ని తరహాల నేరాలకు పాల్పడుతున్నారు. మరోవైపున పాలస్తీనా ప్రజలను చీల్చి వారి పోరాటాన్ని బలహీనపరచటం ద్వారా వారిని ఓ నిస్సహాయ స్థితికి నెట్టాలని, ఆ స్థితిలో ఇజ్రాయెల్ పాలకులకు ఎక్కువ అనుకూలంగా ఉండే ఓ పరిష్కారాన్ని పాలస్తీనా ప్రజలపై రుద్దేందుకు సామ్రాజ్యవాదులు ప్రయత్నిస్తున్నారు. పాలస్తీనాలో కొన్ని ప్రాంతాలలో హమస్, మరికొన్ని ప్రాంతాలలో పాలస్తీనా అథారిటీ పాలన సాగిస్తున్నాయి. అయితే ఈ ప్రాంతాలన్నీ ఇజ్రాయిల్ పాలకులచే నిరంతరాయంగా దాడులకు, దురాక్రమణలకు గురవుతున్నాయి.

1948లో ఇజ్రాయెల్ పాలకులు బలప్రయోగంతో లక్షలాది మంది పాలస్తీనియులను గెంటి వేసి జెరూసలేం పశ్చిమ ప్రాంతాన్ని ఆక్రమించుకున్నప్పటి నుంచి ఇప్పటివరకు నడచిన ఇజ్రాయెల్ చరిత్ర అంతా దాడులు, దౌర్జన్యాలు, పాలస్తీనియుల ఊచకోతలు, వారి భూముల ఆక్రమణలు, స్వాధీనాలు, విధ్వంసాలు, ప్రజల ఆస్తులు, చారిత్రక కట్టడాల పేర్ల మార్పు వంటి వాటితో నిండిపోయింది. వివక్షాపూరిత ఇజ్రాయెల్ ప్రభుత్వాలు పాలస్తీనియులపై సాగించని అకృత్యం లేదు. వారికి ఒక దేశం అంటూ లేకుండా చేసింది. గత ఏడు దశాబ్ధాలుగా పాలస్తీనియులపై ఇజ్రాయెల్ సాగిస్తున్న ఈ దాష్టీకాలను ఎంత ఖండించినా తక్కువే. ఇజ్రాయెల్ పాలస్తీనియులను పెద్దయెత్తున ఊచకోత కోసినప్పుడు, వారిపై క్రూరమైన దాడులకు తెగబడినప్పుడు అంతర్జాతీయ సమాజం మేల్కొంటున్నది. తరువాత ఇజ్రాయెల్‌తో ఎప్పటిలానే వ్యవహారాలు కొనసాగిస్తోంది.

అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ గత జనవరి 28న ఇజ్రాయెల్ ప్రధానమంత్రి బెంజమన్ నెతన్యాహూతో కలిసి వైట్‌హౌస్ విలేకరుల సమావేశంలో ట్రంప్ 'పశ్చిమాసియా నూతన శాంతి ప్రణాళిక'ను ఆవిష్కరించారు. అయితే చర్చలకు పాలస్తీనా నాయకులను ఎవరిని ఆహ్వానించలేదు. ట్రంప్ అల్లుడు, సీనియర్ సలహాదారు జారెడ్ కుష్నర్ నేతృత్వంలోని బృందం ఈ ప్రణాళికను రూపొందించింది. దశాబ్ధాలుగా కొనసాగుతున్న వివాదానికి ఇది శాంతియుత పరిష్కారం కానే కాదు. రెండు పక్షాల్లో ఒకదానికి అన్యాయం చేసే డీల్ ఇది. ఒక పక్షానికి అన్యాయం చేస్తూ, మరోపక్షం తన దురాక్రమణను విస్తరించడానికి అవకాశం కల్పించే పథకం ఇది. అంతర్జాతీయ చట్టాల ప్రకారం తమకు హక్కులేని పాలస్తీనా భూభాగాల్లో ఇజ్రాయెల్ తిష్టవేసే అవకాశం కల్పించడమే ఈ పథకం లక్ష్యం.

ఈ శాంతి పథకం శతాబ్దంలో అత్యుత్తమ శాంతి పథకంగా ట్రంప్ చెబుతున్నప్పటికీ, నిజానికి ఇది 1967 యుద్ధంలో ఇజ్రాయెల్ ఆక్రమించుకున్న భూభాగాలపై ఇజ్రాయెల్‌కు సార్వభౌమాధికారం

---

ఈ కవితకు ఒక తాజా కలం ఉంది. 'ఖాజీ గుండ్ ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు మరణించారు అని విన్నప్పుడు మృతుల సంఖ్య 46. ముగ్గురని విన్నప్పుడు...

ఇది బుర్హాన్ వనీని ఎన్‌కౌంటర్ పేరుతో భారత సైన్యం కాల్చినప్పుడు రాసిన కవిత. ఇక్కడి నుంచీ వరుసగా ఆమె 'మృత్యువు గురించి ఒక కవిత' అని రాస్తూ అన్నిటికీ తాజాకాలం రాస్తూ వచ్చింది. ఎందుకంటే కవిత తడి ఆరక ముందే భారత మీడియాలో సైన్యం కాలుస్తున్న కశ్మీరీల మరణాల వార్తలు – హృదయం లేని వార్తలు తాజాకలాలను కూడా కాలం చెల్లినవిగా మార్చినవి.

నేనూ ఈ కథనాన్ని ఈ కశ్మీరీ కవితతో ముగించాలనుకుంటున్నాను. ముగించాను కూడా.

కశ్మీరయినా, దండకారణ్యమైనా రాజ్య మృత్యుహేల ఇంతే. మృత్యు పదఘట్టనల కింద ప్రాణాలు కోల్పోయే మనుషుల సంఖ్య పెరుగుతూ పోవడం తప్ప మార్పేమి ఉంటుంది... అని.

ఎన్‌డిటివి నుంచి ఫోన్ – మృతుల సంఖ్య 33 అని. మూడు చోట్ల ఎన్‌కౌంటర్ల మృతుల సంఖ్య కలసినా – అంత కాదు. ఉదయమే ఫోన్‌లో అమెరికా నుంచి ఒక మిత్రుడు అంతే ఆవేదనతో ఈ మూడు ఎన్‌కౌంటర్ల గురించి తాను అన్ని తెలుగు పత్రికలు చదివి కలిపి లెక్కేసి చెప్పిన సంఖ్య కన్నా ఇది ఎక్కువ. అది 25, అంటే ఇంకా ఎనిమిది ఎక్కువ. ఆ సంఖ్య అక్కడ కూడా ఆగలేదు. మధ్యాహ్నం 3.30 గంటలకు అది నలభై (40)కి చేరుకున్నది. గాలింపు చర్యలు, ఎన్‌కౌంటర్లు కొనసాగుతూ ఉన్నాయి గనుక పెరుగనూవచ్చు.

ఎంతయితే ఏమిటి? సంఖ్యనే కదా. మావోయిస్టులైనా ఆదివాసులే కదా. ఆదివాసులైనా మావోయిస్టులే కదా. అడవి మనుషులకు, దేశద్రోహులకు దేశపటంలో చోటుందా? దేశభక్తుల పటంలో చోటుందా?

విలువయిన ప్రకృతి సంపదకు తప్ప, విలువలేని మానవ శ్రమకు తప్ప పాలకులకు, రాజ్యానికి, కంపెనీలకు మనుషుల, ఆదివాసీ మనుషుల ప్రాణాల పట్ల విలువ ఉందా? జాతి ఇక్కడికి మెకనాస్ గోల్డ్ అన్వేషణలో వస్తుంది. మనుషుల్ని చంపి అయినా అడ్డు తొలగించుకోవడానికి.

*(రచయిత విరసం వ్యవస్థాపక సభ్యులు)* వీ

కట్టబెట్టడానికి రూపొందించినదనడంలో సందేహం లేదు. ఇది జెనీవా ఒప్పందానికి విరుద్ధం. జెనీవా ఒప్పందం ప్రకారం యుద్ధాల ద్వారా ఆక్రమించిన భూభాగాలపై సార్వభౌమాధికారం ప్రకటించుకోవద్దు. 1967లో జరిగిన ఆరు రోజుల యుద్ధంలో ఇజ్రాయెల్ ఆక్రమించిన భూభాగాలను పాలస్తీనీయన్లకు వదిలివేయాలన్న ఐక్యరాజ్యసమితి తీర్మానాన్ని అమెరికా వీటోతో ఆగిపోయింది. ఇజ్రాయెల్ ఆక్రమించిన పాలస్తీనా, జోర్డాన్, సిరియా భూభాగాలు ఇప్పటికీ ఇజ్రాయెల్ ఆధీనంలోనే ఉన్నాయి. 1967లో కుదిరిన ఒప్పందం ప్రకారం తూర్పు జెరూసలెం రాజధానిగా అనాటికి ఉన్న సరిహద్దుల పరిధిలో స్వతంత్ర పాలస్తీనాను ఏర్పాటు చేసి ఇజ్రాయెల్ ఆక్రమణలు రద్దు చేయాల్సి ఉంది.

పాలస్తీనియులను వారి సొంత గడ్డపైనే శరణార్థులుగా మార్చి, వారి భూములను ఆక్రమించుకున్న యూదు దురహంకార ఇజ్రాయెల్ తాజాగా మరో దుర్మార్గమైన దాడికి తెగబడింది. ఇప్పటికే ఆక్రమించుకున్న పాలస్తీనాలోని ముఖ్యమైన వెస్ట్ బ్యాంక్ భూభాగాలను బలవంతంగా తనలో కలుపుకుంటానని ప్రకటించింది. అమెరికా అండచూసుకునే ఇజ్రాయెల్ ఇంతగా రెచ్చిపోతున్నది. 1917లో అమెరికా మద్దతుతో వచ్చిన 'బాల్ఫోర్ డిక్లరేషన్' ఆధారంగా 1948లో ఇజ్రాయెల్ ఏర్పడింది. పాలస్తీనాలో ఇజ్రాయెల్‌ను ఏర్పాటు చేసినప్పుడు 8 శాతం ప్రాంతానికి పరిమితమైన యూదులు, ఈ డెబ్భయ్యేళ్లలో 80 శాతం దాకా భూభాగాన్ని ఆక్రమించారు. అక్రమంగా ఆక్రమించుకున్న ఆ ప్రాంతాలపై తమ సార్వభౌమత్వాన్ని ప్రకటించేందుకు నెతన్యాహు ప్రభుత్వం 'బలవంతపు విలీనీకరణ'ను తెర పైకి తీసుకొచ్చింది. ట్రంప్ ప్రభుత్వ ఆమోదంతోనే నెతన్యాహు ఈ విలీన ప్రణాళికను తెర పైకి తెచ్చారు.

ఇజ్రాయెల్‌ను సార్వభౌమాధికార దేశంగా గుర్తిస్తూ, అది ఇప్పటి వరకూ ఏయేఏ ప్రాంతాలనైతే ఆక్రమించుకొని ఇజ్రాయెల్ భూభాగంగా చూపిస్తుందో దానినే అమెరికా గుర్తిస్తున్నది. ట్రంప్ ప్రణాళిక ప్రకారం జెరూసలేం నగరాన్ని విభజించకుండా ఇజ్రాయెల్‌కు కేటాయించటం జరుగుతుంది. పవిత్రమైన ఈ నగరాన్ని ఇరు దేశాలు కోరుకుంటున్నాయి. 1967లో ఈ నగరం ఇజ్రాయెల్ ఆక్రమణకు గురైంది. ఇది ఖచ్చితంగా పాలస్తీనాకు భవిష్యత్తులో రాజధానిగా వర్ధిస్తుందన్న భావనతో ఐక్యరాజ్య సమితి జెరూసలేంను స్వయం ప్రతిపత్తి గల నగరంగా గుర్తించింది. చారిత్రాత్మక పాలస్తీనా భూభాగంలో 15 శాతం మాత్రమే కేటాయించి మిగతా 85 శాతం భూభాగాన్ని ఇజ్రాయెల్ కైంకర్యం చేసుకొనేలా ట్రంప్ చేస్తున్నాడని పాలస్తీనా విమోచన పోరాట సమితి (పిఎల్ఓ) అభ్యంతరం తెలిపింది.

గత జనవరిలో ట్రంప్ ఏకపక్షంగా ప్రకటించిన 'డీల్ ఆఫ్ సెంచరీ' నెతన్యాహు గ్రేటర్ ఇజ్రాయిల్ ప్రణాళికకు ప్రేరణ. పాలస్తీనా భూభాగంలో నిర్మించిన సెటిల్మెంట్లను(నివాస కాలనీలను), మృత సముద్రాన్ని (డెడ్ సీ) అనుకుని 105 కి.మీ. పొడవునా గల జోర్డాన్ నదీ లోయ ప్రాంతాన్ని ఇజ్రాయెల్‌లో విలీనం చేసుకోవాలన్నది నెతన్యాహు పన్నాగం. అంతర్జాతీయంగా దీనికి తీవ్ర వ్యతిరేకత వస్తుండడంతో దీని అమలు బాధ్యతను స్థానిక కౌన్సిళ్లకు అప్పగించారు. ఈ విలీనాన్ని ఎట్టి పరిస్థితుల్లోను అనుమతించేది లేదని పాలస్తీనా అథారిటీ (పి.ఎ) చైర్మన్ మహ్మద్ అబ్బాస్ హెచ్చరించారు. గాజాపై పట్టు ఉన్న పోరాటవాద సంస్థ హమాస్ ఈ బలవంతపు విలీనీకరణను తీవ్రంగా వ్యతిరేకించింది. పాలస్తీనాలో పలుచోట్ల నిరసన ప్రదర్శనలు జరిగాయి.

పశ్చిమాసియా 'శాంతి ప్రణాళిక' (డీల్ ఆఫ్ సెంచరీ) ప్రకారం వెస్ట్ బ్యాంక్‌లోని 30 శాతం భూభాగాన్ని ఇజ్రాయెల్ అధికారికంగా కలుపుకుంటుంది. 1967 అలోన్ ప్రణాళికలో ప్రతిపాదించిన జోర్డాన్ లోయ అనుసంధానాన్ని 2019 సెప్టెంబర్‌లో నెతన్యాహు తన ఎన్నికల ప్రణాళికగా ప్రకటించాడు. ఇజ్రాయెల్ ప్రధాని నెతన్యాహు వెస్ట్ బ్యాంక్ యొక్క భూభాగాలను విలీనం చేసుకునే ప్రక్రియను జూలై 1 నుంచి ప్రారంభిస్తానని చెప్పారు. నెతన్యాహు ప్రకటనను పాలస్తీనియన్లు, అరబ్ లీగ్, సౌది, జోర్డాన్, టర్కీ, యుకె మరియు యుఎస్‌లు ఖండించాయి. పాలస్తీనా భూభాగంపై ఇజ్రాయెల్ పరిపాలన విధించే ఏ చర్య అయినా అంతర్జాతీయ చట్టాల ప్రకారం న్యాయ విరుద్ధం. వెస్ట్ బ్యాంక్ ఏరియా ఎ, బి, సి లుగా విభజింపబడింది. ఏరియా సి వెస్ట్ బ్యాంక్‌లో 60 శాతం వరకు ఉంటుంది. దీనిలో 220 స్థావరాలు (కాలనీసు) ఉన్నాయి. ఏప్రియల్‌లో పార్లమెంట్ ఎన్నికలు జరిగాయి. ఏ పార్టీకీ మెజారిటీ రానందున నెతన్యాహు ప్రధానిగా సంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. నెతన్యాహు బహుళ రంగాలలో అంతర్గత వ్యతిరేకతను ఎదుర్కొంటున్నాడు.

ట్రంప్ శాంతి ప్రణాళిక అంతర్జాతీయ న్యాయ చట్టాలకు వ్యతిరేకం. ఒకటి ఐ.రా.స భద్రత మండలి తీర్మాణం 242 ప్రకారం పాలస్తీనియన్ల భూభాగాన్ని ఇజ్రాయెల్ దురాక్రమించింది. రెండవది, ఓస్లో ఒప్పందంలో పేర్కొన్న రెండు దేశాల పరిష్కారాన్ని ఉల్లంఘిస్తుంది. మూడవది. ఒక విదేశీ శక్తి మరో దేశ ప్రజలపై నియంత్రణ, హక్కుల తిరస్కరణ ప్రజాస్వామ్య సూత్రాలకు విరుద్ధం. అయినా ఇజ్రాయెల్‌లోని పలుకుబడి కలిగిన రాజకీయ వర్గాలు, మరీ ముఖ్యంగా మితవాదులు ఈ విలీనాన్ని గట్టిగా సమర్థిస్తున్నారు. పాలస్తీనాలోని వెస్ట్ బ్యాంకు మొత్తాన్ని కలుపుకోవాలని వీరు చూస్తున్నారు. యూదుల సెటిల్మెంట్ కాలనీలన్నిటినీ ఇజ్రాయెల్ సార్వభౌమాధికారం కిందికి తీసుకొస్తూ ప్రకటన చేయాలని డిమాండ్ చేస్తున్నారు. ఈ మితవాదుల్లో ఎక్కువ మంది యూదు జాతి దురహంకారులు.

ఇజ్రాయెల్ వెస్ట్ బ్యాంక్ విలీన ప్రణాళిక జెనీవా తీర్మాణాన్ని బాహాటంగా అతిక్రమించడమేనని ప్రపంచ వ్యాప్తంగా పలువురు సామాజిక, రాజకీయ కార్యకర్తలు విమర్శించారు. జర్మనీలో నాజీ హిట్లర్ సాగించిన ఊచకోత లాంటివి పునరావృతం కాకుండా చూడాలని, 1967కి ముందు పాలస్తీనియులు నివసించిన వెస్ట్ బ్యాంక్, తూర్పు జెరూసలెంపై వారికి గల హక్కు ప్రశ్నించడానికి వీల్లేనిదని జెనీవా తీర్మాణం స్పష్టం చేస్తోంది. 'రెండు జాతులు-రెండు దేశాలు' అన్న సూత్రానికి ఇరు పక్షాలు కట్టుబడి ఉండాలని చెబుతున్న 1993 ఓస్లో ఒడంబడికను 2002 అరబ్ పీస్ ఇనిషీయోటివ్‌ను ఇజ్రాయెల్ గౌరవించాల్సి ఉంది. ప్రస్తుత ట్రంప్- నెతన్యాహుల ప్రణాళికతో పాలస్తీనా సమస్య మరింత క్లిష్టం కానుంది. పాలస్తీనా ఎప్పటికప్పుడు తన భూభాగాన్ని కోల్పోతూనే ఉంది.

ఓస్లో ఒప్పంద ప్రకారం ఐదేళ్ల కాలపరిమితితో పాలస్తీనా స్వయం పరిపాలనా మండలి ఏర్పడాలి. ఆ తర్వాత రెండు రాజ్యాల పరిష్కారం దిశగా చర్యలు తీసుకోవాలి. ఐక్యరాజ్య సమితి తీర్మాణాల ప్రకారం రెండు రాజ్యాలు ఏర్పడాలి. యుద్ధంలో ఇజ్రాయెల్ ఆక్రమించుకున్న భూభాగాల నుంచి సైన్యం వెనక్కు మరలాలి. కాని ఓస్లో ఒప్పందం అమలులోకి రాలేదు. ఇజ్రాయెల్ మొండితనమే ఒప్పందానికి అడ్డంకి అయ్యింది. ఇప్పుడు శాంతి పథకంలో అసలు రెండు రాజ్యాల పరిష్కారం అనేదే లేదు. వెస్ట్ బ్యాంక్‌లో ఉన్న భూభాగాలపై ఇజ్రాయెల్‌కు హక్కులు కట్టబెడుతుంది. వ్యూహాత్మక జోర్డాన్ వ్యాలీ కూడా ఇజ్రాయెల్‌కు

ధారాదత్తం చేయనుంది. ట్రంప్ ప్రణాళిక వెస్ట్ బ్యాంక్‌లో స్థిరపడ్డ ఇజ్రాయెల్ సెటిల్మెంట్లను కూడా గుర్తిస్తుంది. పాలస్తీనియుల స్వయం నిర్ణయాధికారానికి గ్యారంటీ ఇస్తున్న భద్రతా మండలి తీర్మాణాలు (నెం.242, నెం.33), ఐరాస నియమావళిని, అంతర్జాతీయ చట్టాలు, నియమ నిబంధనలను బాహాటంగా ఉల్లంఘిస్తున్నారు.

ఇజ్రాయెల్ దుర్మార్గాలకు వ్యతిరేకంగా భద్రతామండలిలో తీర్మాణం వచ్చిన ప్రతిసారి అమెరికా తన వీటో అధికారాన్ని ఉపయోగించి అడ్డుకుంటున్నది. చమురు వనరులు పుష్కలంగా ఉన్న పశ్చిమాసియాలో ఇరాన్‌ను దెబ్బతీయడం, ఇజ్రాయెల్-సౌదీ అరేబియా మధ్య దోస్తీ కుదర్చడం వంటి ఎత్తులతో అమెరికా ఈ ప్రాంతంలో తన భౌగోళిక, రాజకీయ, వ్యూహాత్మక ప్రయోజనాలను నెరవేర్చుకోవాలని చూస్తున్నది. ఈ ప్రాంతంలో ఇజ్రాయెల్‌ను బలీయమైన సైనిక శక్తిగా నిలపడం ద్వారా పశ్చిమాసియాపై తన ఆధిపత్యానికి ఎదురు లేకుండా చూసుకోవాలన్నది దాని వ్యూహం. ఈ విలీనీకరణ పర్యవసానాల గురించి మిలిటరీ అధికారులు హెచ్చరించినా వినకుండా నెతన్యాహు మొండిగా ముందుకెళ్తున్నారు. స్థానికేతరులేవరినీ జోర్డాన్ నదీ లోయ ప్రాంతంలోకి అనుమతించడం లేదు.

వెస్ట్ బ్యాంక్ పట్టణానికి-జోర్డాన్ రివర్ వ్యాలీకి మధ్య మార్గాన్ని దిగ్బంధనం చేయడం వంటి చర్యలకు ఇజ్రాయెల్ పాల్పడుతోంది. దీనికి హమాస్ నుంచి గట్టి ప్రతిఘటన ఎదురవుతున్నది. పాలస్తీనా నుంచి గెంటివేయబడిన వారిలో ఎక్కువ మంది పొరుగు దేశాలైన జోర్డాన్, ఈజిప్టుల్లో తలదాచుకుంటున్నారు. కాబట్టి ఈ రెండు దేశాలు ఇజ్రాయెల్ చర్యను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. పాలస్తీనీయులతో శాంతికి విఘాతం కలిగించే ఈ విలీన ప్రణాళికను వెంటనే విరమించుకోవాలని ఐక్యరాజ్య సమితి ప్రదాన కార్యదర్శి ఆంటోని గుటెరస్ కోరారు. ఇజ్రాయెల్ చర్య అక్రమమని ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల కమీషన్ ఛైర్‌పర్సన్ మిచెలీ బచెలెట్ వ్యాఖ్యానించారు. అరబ్ లీగ్, ఫ్రాన్స్, జర్మనీ, బ్రిటన్ తదితర యూరప్ దేశాలు వెస్ట్ బ్యాంక్, జోర్డాన్ రివర్ వ్యాలీ విలీనాన్ని గుర్తించబోమని ప్రకటించాయి.

ఇజ్రాయెల్ రాజధానిని టెల్ అలీవ్ నుండి వివాదస్పదమైన జెరూసలేంకు మార్చటం, ఆ వెంటనే అమెరికా రాయబార కార్యాలయాన్ని, ప్రపంచ దేశాలు వద్దన్నా, టెల్ అలీవ్ నుండి జేరూసలేంకు మార్చటం, ఇజ్రాయెల్ దేశం పాలస్తీనా భూభాగాన్ని యుద్దాల్లో ఆక్రమించిన వెస్ట్ బ్యాంక్, గాజా ప్రాంతాల్లో అక్రమమైన శాశ్వత నిర్మాణాలు చేపట్టడం దీనిని అమెరికా అధ్యక్షుడు ట్రంప్ గుర్తించటం, పశ్చిమాసియాలో 21వ శతాబ్దపు 'శాంతి ప్రణాళిక' అంటూ పాలస్తీనా అస్తిత్వాన్ని కాలరాసి ఇజ్రాయెల్‌కు మద్దతు ప్రకటించడం మార్చిలో జరిగిన ఎన్నికల్లో నెతన్యాహును గెలిపించాలన్నదే అసలు లక్ష్యం. పాలస్తీనా హక్కులను కాలరాసి ఐక్యరాజ్య సమితి నిర్ణయాలకు ప్రపంచ దేశాల నిర్ణయాలకు అభిమతాలకు విరుద్ధంగా ట్రంప్ ఇజ్రాయెల్‌ను వెనుకేసుకొస్తున్నాడు.

ఇజ్రాయెల్ వెస్ట్ బ్యాంక్‌లో 'సి' ఏరియా మొత్తాన్ని స్వాధీనం చేసుకుంది. ఇక్కడ వందలాది ఇజ్రాయెల్ స్థావరాలు ఉన్నాయి. సెటిలర్స్ ఇజ్రాయెల్ పౌరుల అన్ని హక్కులను అనుభవిస్తారు. వారు ఎన్నికల్లో ఓటు వేస్తారు. ఆరోగ్య బీమా, సామాజిక భద్రత కలిగి ఉంటారు. అవసరమైతే ఇజ్రాయెల్ సివిల్ కోర్టుల్లో వ్యాజ్యాలు వేసుకోవచ్చు. తాగునీరు, విద్యుత్ సరఫరాను పొందుతున్నారు. వీరికి ఇజ్రాయెల్ సైన్యం, పోలీసులు రక్షణ కల్పిస్తారు. వీరి స్థావరాలు భద్రతా కంచెలతో చుట్టబడి ఉన్నాయి. పాలస్తీనియన్లు కీలకమైన వ్యవసాయ భూమి, నీటి వనరులు కోల్పోతారు. పాలస్తీనా రైతులను, గొర్రెల కాపర్లను తరచు వేధిస్తారు. ఏరియా 'సి'లో నివసిస్తున్న లక్షలాది మంది పాలస్తీనియన్లకు ఏలాంటి హక్కులు లేవు. వీరి భూములు, ఇళ్లు ఇతరత్రా ఆస్తులు ఏ క్షణంలోనైనా గుంజుకునే అవకాశం ఉంది.

ఇజ్రాయెల్‌లో ఉన్నది సంకీర్ణ ప్రభుత్వం కాబట్టి నెతన్యాహూ అనుసంధాన ప్రణాళికను అమలు చేయడంలో ఆటంకాలు ఎదురవుతున్నాయి. మరొవైపు నవంబర్ 3న అమెరికాలో అధ్యక్ష ఎన్నికలు జరుగనున్నాయి. కరోనా మహమ్మారి విజృంభన, శ్వేత జాత్యహంకార వ్యతిరేక ఉద్యమం, ఆర్థిక సంక్షోభం వంటి సమస్యల వల్ల ట్రంప్ ప్రజాగ్రహాన్ని ఎదుర్కొంటున్నాడు. అందువలన ఈ ఎన్నికల్లో ట్రంప్ గెలిచే అవకాశాలు రోజురోజుకు సన్నగిల్లుతున్నాయి. జోబిడెన్ అధ్యక్షునిగా గెలిస్తే ట్రంప్ పశ్చిమాసియా శాంతి ప్రణాళికను తిరస్కరించే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. నెతన్యాహూ అనుసంధానం ప్రణాళిక జాప్యం కావడంతో అరబ్ లీగ్, ఇయు, అంతర్జాతీయ సమాజం నుండి వ్యతిరేకత పెరుగుతుంది. వెస్ట్ బ్యాంక్ దురాక్రమణ సరైందే అంటూ అమెరికా అధ్యక్షుడు ట్రంప్ చేసిన ప్రకటనను వందకు పైగా దేశాలు ఖండించాయి.

పాలస్తీనాలోని వెస్ట్ బ్యాంక్ భూభాగాలను ఆక్రమించుకునే ప్రణాళికకు ఇజ్రాయెల్ స్వస్తి పలకాలని, ఈ ప్రణాళిక అమలు జరిగితే రెండు దేశాల పరిష్కార సూత్రాన్ని తుంగలో తొక్కినట్టే అవుతుందని ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి అంటోనియా గుటేరస్ పేర్కొన్నారు. వెస్ట్‌బ్యాంక్, గోలన్‌హైట్స్ ప్రాంతాలను అమెరికా అండతో ఏకపక్షంగా, దౌర్జన్యంగా దురాక్రమించుకున్న ఇజ్రాయెల్ చర్యను ఖండిస్తూ, ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి తీర్మాణం చేసింది. పాలస్తీనాను తమ వలస కాలనీగా ఇజ్రాయెల్ పరిగణించడం తక్షణం నిలిపి వేయాలని భద్రతా మండలి తీర్మాణం కోరింది. రెండు స్వతంత్ర దేశాల ఏర్పాటు ఒక్కటే ఈ సమస్యకు పరిష్కారమని ఆ తీర్మాణం పేర్కొంది. ఇజ్రాయెల్, పాలస్తీనా దేశాలు ఏర్పడితేనే ఈ ప్రాంతంలో శాంతి నెలకొంటుందని ఐక్యరాజ్యసమితి పేర్కొన్నది.

రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో తమ జాతికంటూ ఒక దేశంలేని యూదులు అప్పటి పాలస్తీనాలో తలదాచుకోటానికి వచ్చి ఇప్పుడు హక్కులు లేని పాలస్తీనాను 15 శాతానికి కుదించింది. పాలస్తీనా ప్రజలకు తమ న్యాయమైన హక్కుల కోసం పోరాటాన్ని కొనసాగించటం మినహా మరో మార్గం లేదు. ఎలాంటి నియమాలు విధించకుండా గాజా నుండి పాలస్తీనా ప్రజలు రాకపోకలు సాఫీగా సాగించేందుకు వీలుగా ఇజ్రాయెల్ పాలకులు విధించిన దిగ్బంధాన్ని ఎత్తివేయాలని, 1948 నుండి వివిధ దఫాలుగా తమ స్వస్థలాల నుండి గెంటివేయబడిన పాలస్తీనా ప్రజలు తమ స్వస్థలాలకు, స్వగృహాలకు సంపూర్ణ హక్కులతో తిరిగి వెళ్లటానికి అనుమతించాలన్న డిమాండ్లతో ముందుకు సాగుతున్న పాలస్తీనా ప్రజల నిరసనోద్యమానికి న్యాయాన్ని, శాంతిని కాంక్షించే ప్రజలందరూ తమ మద్దతును, సంఘీభావాన్ని అందించాలి. తమ మాతృభూమిని తిరిగి పొందటం కోసం ఇజ్రాయెల్ పాలకులకు వ్యతిరేకంగా పాలస్తీనీయులు చేస్తున్న పోరాటం, సామ్రాజ్యవాద ఆధిపత్య రాజకీయాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటంతో అవిభాజ్యంగా ముడిపడి ఉందని గుర్తించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# ఇండో-చైనా సరిహద్దు ఘర్షణ మూలాలు

*భారత్ - చైనాల సరిహద్దు వివాదానికి బ్రిటీష్ కాలం నుంచే బీజాలు పడ్డాయని, చర్చల ద్వారానే సమస్యను పరిష్కరించుకోవాలని అంటున్నారు* **సంతోష్**

**భా**రత్–చైనాలు ఇరుగు పొరుగు దేశాలు, హిమాలయాలచే వేరు చేయబడ్డాయి. రెండూ దేశాలు చాల కాలం భూస్వామ్య, సామ్రాజ్యవాద దోపిడీ, పీడనలకు గురైన దేశాలు. భారత్ 1947 ఆగష్టు 15న, చైనా అక్టోబర్ 1949న స్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడ్డాయి. ఇరుదేశాల మధ్య దౌత్య సంబంధాలు 1950లో మొదలయ్యాయి. అయినా సరిహద్దు వివాదాలు ఇప్పటికీ అలాగే ఉన్నాయి. రెండూ అత్యధిక జనాభా గల దేశాలు వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశాలు. ఈ రెండు దేశాల మధ్య సాంస్కృతిక, ఆర్థిక సంబంధాలు పురాతన కాలం నాటివి. సిల్క్‌రోడ్ రెండింటి మధ్య ప్రధాన వాణిజ్య మార్గంగా ఉపయోగపడటమే కాక బౌద్ధం భారత్ నుండి తూర్పు ఆషియాకు వ్యాప్తి చెందడానికి దోహదపడింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత భారత ప్రధాని నెహ్రూ, చైనా ప్రధాని చౌఎన్‌లై సామ్రాజ్యవాద యుద్ధకూటముల్లో చేరకుండా అలీనోద్యమ నిర్మాణానికి చొరవ తీసుకున్నారు. అయితే అమెరికా అలీనోద్యమాన్ని చీల్చడానికి ఆరంభం నుండే కుట్రలు మొదలు పెట్టింది.

**సరిహద్దు వివాదాలకు మూలాలు**

1949 అక్టోబర్ 1న చైనా ప్రజా రిపబ్లిక్‌గా ఏర్పడినప్పుడే మావో జెడాంగ్ టిబెట్‌ను చైనాలో అంతర్భాగంగా ప్రకటించాడు. 1911లో క్వింగ్ రాజరికం కుప్పకూలినప్పుడు తనకు తాను స్వతంత్ర దేశంగా ప్రకటించుకున్న టిబెట్‌ను దాని ప్రమేయం లేకుండానే బ్రిటన్ 1914లో చైనాతో కుదిరిన సిమ్లా ఒప్పందం ద్వారా చైనాకు ధారాదత్తం చేసింది. అది తనదేనని చెప్పుకోవడానికి మూల కారణం సిమ్లా ఒప్పందమే. 1950లో చైనా పూర్తిగా టిబెట్‌ను ఆక్రమించింది. టిబెటన్ ప్రతినిధులు చైనా సార్వభౌమత్వాన్ని గుర్తించి 1951లో ఒక ఒప్పందంపై సంతకాలు చేశారు. 1959లో దలైలామా టిబెట్‌లో చేపట్టిన తిరుగుబాటును భారత్ బలపర్చింది. చైనా ఆ తిరుగుబాటును అణచివేసింది.

అమెరికా ప్రోత్సాహంతో దలైలామాలకు భారత్ రక్షణ కల్పించే చర్యలు మొదలు పెట్టింది. అమెరికా సలహాతో దలైలామాకు మతపెద్ద పేరుతో ఆశ్రయం కల్పించింది. ప్రవాస తిరుగుబాటు ప్రభుత్వం కొనసాగించడానికి అనుమతించింది. వారి అవసరాలు తీర్చడానికి భారత పాలకులు కావల్సిన సాయం అందించారు. ఇదంతా చైనాపై గుడ్డి వ్యతిరేకత అన్నది స్పష్టం. ఈ పరిణామాలు సరిహద్దు సమస్యలను ముందుకు తెచ్చాయి. చైనా అంతర్గత విషయాల్లో జోక్యం చేసుకోవడం వలన 1962 యుద్ధానికి కారణమైంది. ఇటీవలనే ఆర్ఎస్ఎస్ అధికార పత్రికలో టిబెట్ స్వాతంత్ర్యాన్ని గుర్తించాలని, దలైలామాకు భారతరత్న ఇవ్వాలని 'ఆర్గనైజర్' పత్రిక మాజీ సంపాదకుడు శేషాద్రిచారి ఒక వ్యాసంలో మోడీని కోరడం గమనార్హం.

ఇక తైవాన్ ఐక్యరాజ్యసమితి గుర్తింపు పొందని చైనాలోని అంతర్భాగ దేశం. అయితే తైవాన్ చైనా నుండి 1950లో స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. అమెరికా తైవాన్‌కు అతిముఖ్యమైన మిత్రదేశం. తైవాన్‌ను చైనా తనదేనని క్లెయిమ్ చేస్తోంది. చైనా పటంలో తైవాన్ చూపబడింది. ఉత్తరాఖండ్ నేపాల్‌తో సరిహద్దులను ఈస్టు ఇండియా కంపెనీ హయాంలో (1816) కుదిరిన సుగౌళి ఒప్పందం ద్వారా నిర్ణయించారు. కాళీ నదిని ఉభయ దేశాల సరిహద్దుగా నిర్ణయించారు. కాళీ నది లిపులేఖ్ కనుమలో మొదలవుతుందని భారత్ భావిస్తుంటే, అది లింపియాధురాలో ప్రారంభమవుతుందని నేపాల్ వాదిస్తోంది. దీనివల్ల ఉత్తరాఖండ్‌లో కొంతభాగంపై నేపాల్ హక్కులు కోరుతోంది. గత 20 ఏళ్లలో రెండుసార్లు చర్చలు జరిగినా సమస్య కొలిక్కి రాలేదు. తాజాగా ఇంతకాలం మన భూభాగంలో ఉన్న ఉత్తరాఖండ్ సరిహద్దులోని లిపులేఖ్, కాలాపానీ, లింపుయాధురాలతో కూడిన సరికొత్త మ్యాప్‌ను నేపాల్ పార్లమెంట్ ఆమోదించింది.

చైనాకూ భారతదేశానికి సరిహద్దు తగాదా కొత్తది కాదు. బ్రిటిష్ వలస పాలనాకాలం నాటి నుంచీ శతాబ్దానికి పైగా సాగుతున్న సమస్య ఇది. భారత ఉపఖండాన్ని తాము ప్రత్యక్షంగా పాలించే స్థితి రద్దయిపోయినా భారత్‌లో ఆరని చిచ్చురగిల్చి పోయారు. మెక్ మోహన్ రేఖ, డురాండ్ రేఖ, రాడ్ క్లిఫ్ రేఖ వంటి భారతదేశపు సరిహద్దు రేఖలన్నీ భారత ప్రజలకు, పొరుగు దేశాల ప్రజలకు, ఆ ప్రజా జీవితాలకు సంబంధం లేకుండా బ్రిటిష్ పాలకులు గీసినవే. బ్రిటిష్ అధికారి మెక్ మోహన్ 1914లో అప్పటి బ్రిటిష్ ఇండియాకూ, (ఈశాన్య భారత దేశానికి) టిబెట్‌కూ మధ్య సరిహద్దుగా గీసిన రేఖను చైనా ప్రభుత్వాలు ఏవీ గుర్తించలేదు. నిజానికి 1947కు ముందు ఇవాళ్టి భారతదేశం గాని, పాకిస్తాన్ గాని లేవు. 1959 తర్వాత టిబెట్ లేదు. 1971కి ముందు బంగ్లాదేశ్ లేదు. 1975 తర్వాత సిక్కింలేదు.

చైనా ప్రపంచంలోనే అత్యధికంగా 16 దేశాలతో 22 వేల కిలోమీటర్ల పొడవున సరిహద్దును పంచుకుంటుంది. ప్రతి సరిహద్దు ఏదో ఒక వివాదంతో మొదలై అధికంగా చర్చల ద్వారా సమస్యను పరిష్కరించుకుంది. భారత్–చైనా మధ్య వివాదం దాదాపు ఏడు దశాబ్దాల కింద మొదలైనప్పుడు ఎలా ఉందో, ఇప్పటికి అలాగే ఉంది. రెండు దేశాలు తమదని చెప్పుకునే వివాదాస్పద భూభాగంలో ఎలాంటి మార్పు లేదు. 1990 తర్వాత చైనాతో వాణిజ్య సంబంధాలు పెరిగాయి. దాదాపు

4 వేల కిలోమీటర్ల పొడవున్న భారత్-చైనా సరిహద్దును మూడు ప్రాంతాలుగా విభజించారు. 1. పడమరగా కశ్మీర్‌లోని సరిహద్దు ప్రాంతం. 2. మధ్యలో హిమాచల్ ప్రదేశ్, ఉత్తరప్రదేశ్ సరిహద్దు ప్రాంతం. 3. తూర్పున అరుణాచల్ ప్రదేశ్ సరిహద్దు ప్రాంతం. ముఖ్యంగా తూర్పు, పడమర సరిహద్దులలో వివాదం తీవ్ర స్థాయిలో కొనసాగుతుంది.

1947లో భారత్-పాకిస్తాన్‌లుగా దేశ విభజన జరిగినప్పుడు జమ్మూ-కశ్మీర్ సంస్థానపు ప్రజల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోకుండానే ఒకవైపు పాకిస్తాన్, మరోవైపు భారత్‌లు జమ్మూ-కశ్మీర్‌ను విలీనం చేసుకోవడానికి సైనిక చర్య వరకు వెళ్లాయి. ఐక్యరాజ్య సమితి సమక్షంలో యుద్ధ విరమణ జరిగి నియంత్రిత రేఖను నిర్ధారించుకున్నారు. ఫలితంగా పాక్ ఆక్రమిత కశ్మీర్‌లో గిల్గిట్, బల్టిస్థాన్ – అజాద్ కశ్మీర్‌లు (30 శాతం భూభాగం), భారత్ ఆధీనంలో జమ్మూ, కశ్మీర్ లోయ, లడ్డాఖ్, సియాచిన్ గ్లెసియర్‌లు ఉన్నాయి (55 శాతం భూభాగం), చైనా ఆధీనంలో ఆక్సాయిచిన్, కారకోరం పర్వత ప్రాంతాలు ఉన్నాయి(15 శాతం భూభాగం). జమ్మూ-కశ్మీర్ సంస్థానంలో 70 శాతం జనాభా ముస్లింలు ఉన్నారు. కనుక పాకిస్థాన్‌కే చెందాలనేది పాకిస్థాన్ వాదన- హిందు రాజు హరిసింగ్ భారత్‌లో విలీనానికి అంగీకరించాడు కనుక భారత్‌కే చెందాలనే వాదన ఉంది. ఈ రెండూ వాదనలు ప్రజల మనోభావాలను తెలుసుకోవడానికి సుముఖంగా లేవు. 1963లో పాకిస్తాన్ చైనాకు ఆక్సాయి చిన్ భూభాగాన్ని అప్పగించింది.

1949 అక్టోబర్ తర్వాత జన చైనాతో సరిహద్దు వివాదాలపై మనదేశం సమగ్రంగా చర్చించి ఉంటే ఇన్ని సమస్యలు వచ్చి ఉండేవి కాదు. భారత్ క్లెయిమ్ చేస్తున్న వివాదస్పద కశ్మీర్ ప్రాంతంలోని కొన్ని భాగాలను (ఆజాద్ కశ్మీర్, గిల్గిట్, బాల్టిస్తాన్) పాకిస్తాన్, చైనాలు క్లెయిమ్ చేస్తున్నాయి. భారత్-పాకిస్తాన్-చైనా రూపొందించి చూపిస్తున్న దేశ పటాలు వివాదాలకు కారణమవుతున్నాయి. అలాగే అరుణాచల్ ప్రదేశ్‌లో కూడ సరిహద్దుల పట్ల చైనా-భారత్‌ల మధ్య వివాదాలు ఉన్నాయి. 1954లో సరిహద్దుల్లోని ఆక్సాయ్ చిన్ ప్రాంతాన్ని భారత పటంలో ప్రచురించింది. చైనా ఈ ప్రాంతం గుండా ఒక రహదారిని (చైనా-పాకిస్తాన్ ఆర్థిక నడవా- సిపిఇసి) నిర్మించింది. చైనాలోని కష్గర్‌లో మొదలై పీఓకెలోని గిల్గిట్, బల్టిస్థాన్‌ల గుండా అరేబియా సముద్ర తీరం వరకు సాగే సిపెక్, చైనాకు ఆర్థికంగా అత్యంత ప్రాధాన్యమైనది. దీంతో సరిహద్దు ఘర్షణలు పెరిగాయి. 1959 చైనా ప్రధాని చౌ ఎన్ లై నెహ్రూకు లేఖ రాస్తూ చైనాలోని ఏ ప్రభుత్వం మెక్ మోహన్ రేఖను సరిహద్దుగా గుర్తించలేదని తెలిపాడు.

ఆగస్టు1947లో భారత్-పాకిస్తాన్ రెండూ దేశాలుగా విభజన జరిగి జమ్మూ-కశ్మీర్ బాధ్యతలు భారత ప్రభుత్వం స్వీకరించినప్పుడే భారత్ చైనా సరిహద్దులు స్పష్టంగా లేవు. బ్రిటిష్ వాళ్లు 1947లో అధికార మార్పిడి జరిగినప్పుడే భారతదేశ సరిహద్దులపై స్పష్టత నివ్వలేదు. గత ఏడు దశాబ్దాలుగా వాస్తవాధీన రేఖ (ఎల్ఎసి) వద్ద ఎప్పుడో ఒకప్పుడు గొడవలు జరుగుతూనే ఉన్నాయి. 1960,70 దశకాల్లో భారత్-చైనాల మధ్య సంబంధాలు క్షీణించాయి. 1980 తర్వాతనే రెండు దేశాలు స్నేహ సంబంధాల గురించి, సరిహద్దు వివాదాల గురించి ఒక మేరకు చర్చించుకున్నాయి. ఈ మేరకు 2004లోనూ, 2015లోనూ రెండు దేశాల మధ్య తాత్కాలిక ఒప్పందాలు కుదిరాయి. రెండు దేశాల మధ్య సరిహద్దు రేఖలు స్పష్టీకరించుకునేందుకు చర్చలు సాగాలని, వివాదాలు పరిష్కరించుకోవాలని మాత్రం ఒక అవగాహనకు వచ్చారు.

1960 తరువాత చైనా-పాకిస్తాన్ మధ్య సంబంధాలు మెరుగుపడ్డాయి. అమెరికా పాకిస్తాన్‌కు అండగా నిలిచింది. చైనాతో నెహ్రూ నాటి స్నేహ సంబంధాలు దెబ్బతిన్నాయి. స్టాలిన్ మరణాంతరం చైనా-సోవియట్ రష్యా మధ్య సంబంధాలు సిద్ధాంత విభేధాల కారణంగా దిగజారాయి. రష్యాతో భారత్ సంబంధాలు మెరుగుపడ్డాయి. 1967లో సిక్కిం సరిహద్దుల్లో చైనా-భారత్ దళాల మధ్య రెండు ఘర్షణలు జరిగాయి. మొదటి ఘర్షణను 'నాథులా' అని పిలుస్తారు. రెండవ సంఘటనను 'చోళా' సంఘటనగా పిలుస్తారు. చైనా భారత్‌ల మధ్య సరిహద్దు వివాదాల కారణంగా మూడుసార్లు సైనిక ఘర్షణలు జరిగాయి. 1962లో చైనా-భారత్ యుద్ధం. 1967లో చోళ యుద్ధం, 1975లో అరుణాచల్‌ప్రదేశ్‌లో పలువురు భారత సైనికులను చైనా మట్టుబెట్టింది. యుపిఎ హయాంలో ఏడెనిమిదేళ్ల క్రితం దౌలత్ బేగ్ ఓల్డీ వద్ద గొడవ జరిగింది.

1980 నుంచి ఇరుదేశాలు దౌత్య, ఆర్థిక సంబంధాలను పునర్నిర్మించాయి. 2008 నాటికి చైనా భారత్‌కు అతిపెద్ద వాణిజ్య భాగస్వామిగా మారింది. ఉమ్మడి ప్రయోజనమున్న వాణిజ్యం, వాతావరణ మార్పు, ప్రపంచ ఆర్థికం వంటి అంశాలపై అంతర్జాతీయ స్థాయిలో సహకరించుకున్నాయి. 2017లో డోక్లాం ఘర్షణ జరిగినా 2020 మే 15 దాకా వివాదరహితంగానే ఉన్నాయి. 3,488 కిలోమీటర్ల పొడవైన ఎల్ఎసిలో నెహ్రూ కాలంనుంచే కొన్ని ప్రాంతాలు వివాదాస్పదంగా ఉన్నాయి. మొన్న చైనా సైన్యం చొరబడేవరకూ గాల్వాన్ ప్రాంతం వివాదాస్పదమైనది కాదు. ఆ ప్రాంతంలో మన సరిహద్దు రహదారి సంస్థ(బిఆర్ఒ) దర్బుక్-షైలాక్-దౌలత్‌బేగ్ ఓల్డీ వరకూ నిర్మిస్తున్న రోడ్డుకు చైనా అభ్యంతరం చెబుతోంది. ఇప్పటికే మన దేశం షైలాక్ నదిపై 430 మీటర్ల పొడవైన వంతెన నిర్మాణం పూర్తి చేసింది. ఉత్తర సిక్కింలోని నకులా సెక్టార్ దగ్గర కూడా గత నెలలో చైనా సైనికులు ఘర్షణలకు దిగారు.

**భౌగోళిక రాజకీయాల ప్రభావం**

1976లో మావో మరణాంతరం సోషలిస్టు వ్యవస్థ నిర్మాణాన్ని అటుకెక్కించింది. 1990 నుంచి చైనా సోషల్ సామ్రాజ్యవాద దేశంగా మారింది. ఆసియా, ఆఫ్రికాలోని పలు దేశాలకు రుణాలు ఇస్తూ ఆ దేశాల ప్రభుత్వాలను తనకు అనుకూలంగా మార్చుకుంటోంది. ప్రధానంగా ఆసియా ఖండంలో విస్తరణ, ఆధిపత్యం కొరకు అది ఆరాట పడుతోంది. అలాగే భారత్ బిజెపి అధికారంలోకి వచ్చిన తరువాత అఖండ్ భారత్ కలలు గంటుంది. ఆక్రమిత కశ్మీర్‌ను తిరిగి స్వాధీనం చేసుకోవాలని ఉవ్విళ్లూరుతోంది. బంగ్లాదేశ్, నేపాల్ దేశాల పట్ల ఆధిపత్యం చలాయించాలని చూస్తోంది. అలీనోద్యమానికి తూట్లు పొడిచి ఇజ్రాయెల్, అమెరికాతో కలిసి పయనిస్తోంది. చైనాకు వ్యతిరేకంగా అమెరికా తీసుకునే ప్రతినిర్ణయంతో భారత్ ఏకీభావంతో కలిసి పయనిస్తోంది. ఫలితంగా అమెరికా-చైనాల ప్రపంచ ఆధిపత్య పోరు

ఆసియాలో చైనా–భారత్‌ల ఆధిపత్య పోరుగా పరిణమించింది.

ప్రపంచ దేశాలను తన ఆధిపత్యంలో ఉంచుకునే వ్యూహం అమెరికాది. ఆయా దేశాల సహజ వనరులపై, మార్కెట్‌పై గుత్తాధిపత్యం కోసం ఎంతకైనా తెగిస్తుంది. 'మీ ఇంటికొస్తే నాకేమి పెడ్తావు... మా ఇంటికొస్కే నాకేమి తెస్తావు' అన్న ధోరణీ అమెరికాది. ఆసియాలో తన ఆధిపత్యానికి అవరోధంగా ఉన్న చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను తన వ్యూహాత్మక భాగస్వామిగా నిలుపుకోవాలని అమెరికా భావిస్తోంది. అందులో భాగంగానే దక్షిణ చైనా, తూర్పు చైనా ప్రాదేశిక వివాదాలలో చైనా వైఖరిని భారత్ వ్యతిరేకిస్తున్నది. అమెరికా సామ్రాజ్యవాదం, చైనా సోషల్ సామ్రాజ్యవాదం రెండు విశ్వసించదగినవి మాత్రం కావు. రెండూ దోపిడీ, విస్తరణ, ఆధిపత్య కాంక్షతో తమ విధానాలను రూపొందించు కుంటాయి. ఇరు దేశాలకు కావల్సింది వాణిజ్య ప్రయోజనం, ప్రపంచ వనరులపై ఆధిపత్యం అన్నది అక్షర సత్యం. ఈ నేపథ్యంలో భారత్–చైనా సరిహద్దు వివాదాలను అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

చైనా–భారత్ మధ్య పెరుగుతున్న ఆర్థిక, వ్యూహాత్మక సమస్యలను అధిగమించడానికి అనేక అడ్డంకులు ఉన్నాయి. చైనాకు అనుకూలంగా భారత వాణిజ్యం భారీ అసమతుల్యతను ఎదుర్కొంటుంది. భారత్–చైనా వాణిజ్యం 85 బిలియన్ డాలర్లు కాగా భారత్‌కు వాణిజ్య లోటు 63 బిలియన్ డాలర్లు ఉంది. మరోవైపు మారుతున్న భౌగోళిక రాజకీయాల నేపథ్యంలో ఇరు దేశాల మధ్య అపనమ్మకం కూడ పెరుగుతుంది. పాకిస్తాన్‌తో చైనా వ్యూహాత్మక సంబంధాలు భారత్‌కు సమస్య కాగా, భారత్‌తో అమెరికా వ్యూహాత్మక సంబంధాలు చైనాకు సమస్యగా మారింది. దక్షిణ చైనా సముద్రంలో అమెరికాతో కలిసి సైనిక విన్యాసాలు జరుపడం చైనాకు ఆందోళనగా ఉంది. పాకిస్తాన్‌ను భారత్ శత్రు దేశంగా చూస్తుంటే, చైనా దానిని మిత్ర దేశంగా చూస్తోంది. అంతేగాక ఐక్యరాజ్యసమితి భద్రతా మండలిలో భారత్‌కు శాశ్వత సభ్యత్వం రాకుండా చైనా అడ్డుతగులుతోంది.

కశ్మీర్ స్వయం ప్రతిపత్తికి సంబంధించిన 370 అధికరణ రద్దు, కశ్మీర్, లద్దాఖ్‌గా విభజించి కేంద్ర పాలిత ప్రాంతాలుగా ప్రకటించడం, కరోనా వ్యాప్తికి చైనాను దోషిగా నిలబెట్టేందుకు అమెరికా చేస్తున్న యత్నాలకు భారత్ మద్దతు ఇవ్వడం, తైవాన్ ప్రధాని ప్రమాణ స్వీకారానికి రాజనాథ్ సింగ్ హాజరుకావడం, దక్షిణ చైనా సముద్రంలో చైనా ప్రాబల్యాన్ని అడ్డుకోవడానికి అమెరికా, ఆస్ట్రేలియా, జపాన్‌లతో భారత్ (క్వాడ్) జతకట్టడం వంటివి అన్నీ చైనా విస్తరణ వాదానికి, ఆధిపత్యానికి అటంకాలుగానే చైనా భావిస్తోంది. ట్రంప్ అమెరికా అధ్యక్షుడు అయ్యాక చైనాతో వైరం పెంచుకుంటున్నారు. చైనా కూడ సై అంటే సై అంటుంది. చైనా ప్రయోజనాలను దెబ్బతీసే అమెరికా వ్యూహంలో భారత్ భాగస్వామి కావడం దానికి అందోళన కలిగిస్తోంది. ఇవాళ చైనా ఆర్థికంగా ప్రపంచంలో 2వ స్థానంలో, సైనికంగా మూడవ స్థానంలో, ప్రపంచ ఉత్పత్తి హబ్‌గా ఎదిగింది. అగ్ర రాజ్యంగా గుర్తింపు పొందడానికి అమెరికాకే సవాలు విసురుతోంది. భారత్ చైనాల మధ్య ఉద్రిక్తలను రెచ్చగొట్టి ఆసియా ప్రాంతంలో అమెరికా తన వ్యూహాత్మక ప్రయోజనాలు నెరవేర్చుకోవాలని చూస్తోంది. భౌగోళిక రాజకీయాల్లో భాగంగానే ప్రాంతీయ ఉద్రిక్తతలు రెచ్చగొట్టడం, ఏ రెండు దేశాలు కలిసి సఖ్యంగా ఉండటం సామ్రాజ్యవాద అమెరికాకు ఇష్టం ఉండదు. దేశాల మధ్య, ప్రాంతాల మధ్య, జాతుల మధ్య, తెగల మధ్య యుద్ధాలు ఉంటేనే తన ఆయుధ వ్యాపారం సజావుగా నడుస్తోంది. భారత్ అమెరికాకు సన్నిహితుమవుతున్న కొద్ది ఇరుగు పొరుగు దేశాలతో భారత్ సంబంధాలు దెబ్బతింటున్నాయి. ఇవాళ అమెరికాకు భారత్ ఉపగ్రహంగా మారింది. అమెరికా అనుకూలతను, చైనా వ్యతిరేకతను నరనరానా జీర్ణించుకున్న శక్తులు చైనా వస్తువులను బహిష్కరించాలని సోషల్ మీడియాలో హల్‌చల్ చేస్తున్నాయి. ప్రభుత్వం కూడ చైనా యాప్‌లను, కాంట్రాక్టులను రద్దు చేసింది. ఇప్పటికిప్పుడు చైనా దిగుమతులు నిషేధిస్తే మన ఫార్మా, ఎలక్ట్రానిక్స్, ఆటో మోబైల్ పరిశ్రమ మూతపడుతుంది.

చైనా ఎదిగిన క్రమాన్ని, దాని శక్తి సామర్థ్యాలను గుర్తించ నిరాకరిస్తున్నారు. చైనా జిడిపి 15 ట్రిలియన్ డాలర్లు కాగా భారత్ జిడిపి 2.5 ట్రిలియన్ డాలర్లు మాత్రమే. మూడు దశాబ్దాల క్రితం చైనా జిడిపి భారత్ కంటే తక్కువ. పలు రంగాల్లో చైనా భారత్ కంటే ఎన్నో రేట్లు ముందుంది. వాస్తవాలు విస్మరించి డాంభికాలకు పోతే శృంగభంగం తప్ప మరేం దక్కదు. పోకిరీలు ఎవ్వరు యుద్ధంలో పాల్గొని త్యాగాలు చేసేవారు కాదన్నది నగ్న సత్యం. యుద్ధంలో మరణించేది పేద కుటుంబాల నుండి వచ్చిన వారేనన్నది గుర్తించాలి. ఈ ఉన్మాదం దేశభక్తి అసలే కాదు. దేశంలో ప్రజలు ఎన్నో సమస్యలతో సతమవు తున్నారు. వాటి పట్ల స్పందన ఉండదు. మోడీని కీర్తిస్తూ ప్రజలను పక్కదారి పట్టించే దుర్మార్గ క్రీడ సోషల్ మీడియాలో తీవ్రంగా నడుస్తోంది. నిజానికి యుద్ధం ఏ దేశానికి మేలు చేయదు. ప్రాణనష్టం, ఆస్తి నష్టం, ధరల పెరుగుదల, నిరుద్యోగం చవిచూడవలసి వస్తుంది.

**కీలకమైన గల్వాన్ లోయ వివాదం**

గడిచిన అయిదు దశాబ్దాలలో ఎన్నడూ లేని విధంగా లద్దాఖ్‌లోని గల్వాన్ లోయల్ భారత్, చైనా సైనికుల మధ్య జూన్ 15న జరిగిన ఘర్షణ ప్రాణ నష్టానికి దారితీసింది. రెండువైపులా ఒక్క తూటా పేలకపోయినా నెత్తురు చిందడం దిగ్భ్రాంతికరం. చైనా ఇంతకు తెగబడటానికి కారణాలేమిటనే ప్రశ్న అనివార్యంగా తలెత్తుతోంది. గల్వాన్ లోయలోని దౌలత్ బేగ్ ఓల్డీ (డిబిఒ) రోడ్డు దగ్గర 14వ పహారా ప్రాంతం ఇంతకాలం భారత్ అధీనంలో ఉన్నా, చైనా సైనికులు అందులోకి చొచ్చుకొచ్చారు. దీన్ని భారతీయ గస్తీ బృందం గమనించి అడ్డు చెప్పడంతో ఘర్షణ రేగింది. గల్వాన్ లోయ తమదేనని చైనా చాలాకాలంగా వాదిస్తూ వస్తున్నా... దానిపై ప్రత్యేక శ్రద్ధను చూపించలేదు. లేహ్‌ను కారకోరం పాస్‌ను కలిపే రహదారిపై నిఘా వేయాలంటే గల్వాన్ లోయ చాలా కీలకమైనది. దీనిపై చైనా గత ఏడాది నుంచే వాదన చేస్తోంది.

ఎల్ఏసి అనేది ఇదమిత్థంగా సాధికారంగా గుర్తించని సరిహద్దు రేఖ. ఇక్కడ రెండు దేశాల సైనికులు ఇవి తమ దేశానికి చెందిన ప్రదేశాలు అనుకునే చోట్ల గస్తీ తిరుగుతుంటారు. ముఖ్యంగా లద్దాఖ్ ప్రాంతంలో ఈ అస్పష్టత చాలా ఎక్కువ. ఎత్తైన పర్వతాల ద్వారా సాగే ఎల్ఏసీపై భారత్, చైనా సేనలు పహరా కాస్తుంటాయి. కొన్ని చోట్ల ఇండోటిబెటన్ సరిహద్దు భద్రతా దళం (ఐటిబిపి) గస్తీ తిరుగుతుంది. లద్దాఖ్ తూర్పు భాగంలోని పాంగ్యాంగ్ సరస్సు, ఎల్ఏసీ చెంతనే ఉన్న గల్వాన్ నదీలోయ

వివాదగ్రస్త ప్రాంతాలు. పాంగ్యాంగ్ సరస్సులో మూడింట రెండు వంతులు భారత్ ఆధీనంలో ఉంటే, మిగతాది చైనా అదుపులో ఉంది. వాస్తవాధీన రేఖ వెంబడి ఫింగర్ 4, ఫింగర్ 8 అనే భౌగోళిక ప్రదేశాలు ఉన్నాయి. పాంగ్యాంగ్ సరస్సులోని పర్వత శిఖరాలను ఫింగర్స్ అని పిలుస్తారు. వాటిలో ఫింగర్ 4ను చైనా ఎల్ఏసీగా పరిగణిస్తుంటే, భారత్ ఫింగర్ 8ని ఎల్ఏసీగా భావిస్తోంది. గల్వాన్ లోయలోని దుర్బోక్, శ్యోక్, డిబీఓ (దౌలత్ బేగ్ ఓల్డీ) రోడ్డు ప్రాంతంలో తాజా ఘర్షణలు జరిగాయి. ఈ రోడ్డుకు దగ్గర్లోని ఫింగర్ 4లో చైనా సైనికులు మోహరించడంతో డిబీఓ రోడ్డు భద్రత ప్రమాదంలో పడింది. భారత సైన్యానికి గల్వాన్ లోయ వ్యూహపరంగా ఎంతో కీలకమైనది. గల్వాన్ వెనుక భాగంలోనే ఆక్సాయ్‌చిన్ ఉంది కాబట్టి చైనాకూ ఈ లోయ అత్యంత ప్రాధాన్యమైనది. ప్రస్తుతం నేపాల్ కూడా చైనా ప్రాపకంలోకి వెళ్లింది. మరోవైపు కాలాపానీ, లిపులేక్ లింపుయాధూరా ప్రాంతాల విషయంలో నేపాల్, భారత్‌ల మధ్య అసాధారణ, అవాంఛనీయ వివాదం ఏర్పడింది.

ఇటీవల అమెరికా, చైనా, భారత్ ఆర్థిక వ్యవస్థలు కుంగిపోయాయి. కరోనా మరింతగా కుంగదీస్తోంది. ఈ దేశాల ప్రజలు అసమ్మతితో ఉన్నారు. మరోవైపు అంతర్జాతీయ భౌగోళిక-రాజకీయ సమీకరణల్లో కనీవినీ ఎరుగని మార్పులు సంభవించి, అనిశ్చిత వాతావరణం అలముకొంది. భద్రత, వాణిజ్యం, బహుళపక్ష ఒప్పందాలు, సహకారాల్లో స్థిరత్వం కనుమరుగవుతోంది. దీర్ఘకాలం నుంచి ఉనికిలో ఉన్న అంతర్జాతీయ సంస్థల మనుగడ సందేహంలో పడింది. ఈ ఒడిదుడుకులన్నీ కరోనా కల్లోలంతో మరింత తీవ్రరూపం దాల్చాయి. ఈ పరిస్థితిని తీసుకొచ్చిన ఘనత ముగ్గురు నాయకులకు దక్కుతుంది. ఒకరు అమెరికాకు 45వ అధ్యక్షుడిగా పదవీ స్వీకారం చేసిన డొనాల్డ్ ట్రంప్, రెండో వ్యక్తి- చైనా కమ్యూనిస్టు పార్టీ చక్రవర్తి షీ జిన్‌పింగ్, మూడో వ్యక్తి నరేంద్ర మోడీ. చిరకాలం నుంచి అమలులో ఉన్న సంస్థలు, భావనలను కూలదోసి తమదైన దృక్పథాన్ని నెగ్గించుకోవాలనే పంతం ముగ్గురి నాయకులకు ఉంది.

**ఒకవైపు చర్చలు, మరోవైపు మోహరింపులు**

తూర్పు లద్దాఖ్ సరిహద్దుల్లో రెండు మాసాలుగా (మే 5 నుంచి జూలై 5 వరకు) నెలకొన్న తీవ్ర ఉద్రిక్త పరిస్థితులు శాంతి దిశగా తొలి అడుగులు పడ్డాయి. మే 5న ఇరుదేశాల జవాన్లు గల్వాన్ లోయ పాంగాంగ్ సరస్సు వద్ద తీవ్ర స్థాయిలో ఘర్షణ పడ్డాయి. ఉద్రిక్తతలను తగ్గించడానికి ఇరు దేశాల కోర్ కమాండర్ల స్థాయి సైనికాధికారుల మధ్య జూన్ 6న తొలి సమావేశం జరిగింది. ఉద్రిక్తతలను చల్లార్చేందుకు జూన్ 22, 30 తేదీల్లో ఇరుదేశాల కోర్ కమాండర్ల మధ్య చర్చలు జరిగాయి. దశలవారీగా, వేగంగా ఉద్రిక్తతలను చల్లార్చడం ద్వారా సైనిక ప్రతిష్టంభనను తొలగించాలని ఆ బేటీల్లో నిర్ణయించారు. అయితే, భారత జాతీయ భద్రత సలహాదారు అజిత్ ధోవల్, చైనా విదేశాంగ మంత్రి వాంగ్ యి తో జూలై 5న ఫోన్ ద్వారా చర్చలు జరిపారు. బలగాల ఉపసంహరణను వేగవంతం చేసి, సాధ్యమైనంత త్వరగా పూర్తి చేయాలని ఈ చర్చల సందర్భంగా ఇరువురు నిర్ణయించారు. అయినా పురోగతి లేదు. సరిహద్దుల్లో శాంతి నెలకొనాలంటే ముందు బలగాల ఉపసంహరణ జరగాలని, అభిప్రాయ బేధాలు ఘర్షణలుగా మారకుండా సంయమనం పాటించాలని ఇరువురు అంగీకారానికి వచ్చారు.

చర్చల్లో కుదిరిన అవగాహన ప్రకారం పెట్రోలింగ్ పాయింట్ 14, 15, 17ల నుంచే కాకుండా, గొగ్రా, హాట్ స్ప్రింగ్స్ ప్రాంతాల నుంచి కూడా చైనా బలగాలు వెనక్కు వెళ్లాలి. కాని ఫింగర్-5 ప్రాంతం నుంచి వెనక్కి వెళ్లేందుకు చైనా దళాలు ఆసక్తి చూపడం లేదు. సిరిజాప్‌లోని చైనా పోస్టు నుంచి ఫింగర్-5 ప్రాంతంపై చైనా నిఘా సైనికులను మోహరించింది. ఘర్షణలు జరిగిన గోగ్రా పోస్టు, హాట్ స్ప్రింగ్స్‌లో ఆ దేశం బారీ నిర్మాణాలు కూడా చేపట్టింది. దీంతో భారత్ కూడా 40కి పైగా మిగ్-29కే ఫైటర్ జెట్‌లను సరిహద్దులో మోహరించింది. భారీ సంఖ్యలో సైనిక బలగాలను భారత్ అరుణాచల్ వైపు తరలిస్తోంది. ఇప్పటికే లద్దాఖ్‌లో లక్షమంది సైనికులు మోహరించి ఉన్నారు. సరిహద్దుల్లో ఎక్కువకాలం పాటు ఎక్కువ సంఖ్యలో బలగాలను మోహరించాలంటే దేశ ఖజానాపై భారీ భారం పడుతుంది.

**ముగింపు**

సామ్రాజ్యవాద యుగంలో వాణిజ్య ప్రయోజనాల కొరకు, ఆధిపత్యం కొరకు, దురాక్రమణ కొరకు యుద్ధాలు చూస్తూనే ఉన్నాం. యుద్ధాలు అంతర్జాతీయ ఆయుధ వ్యాపారులకు, సామ్రాజ్యవాద శక్తులకు (అమెరికా, ఫ్రాన్స్, రష్యా, ఇజ్రాయెల్) ఆయుధాలు అమ్ముకోవడానికి ఉపయోగ పడతాయి. అందువల్లనే లెనిన్ 'సామ్రాజ్యవాదం అంటేనే యుద్ధం' అన్నారు. ఇవాళ్టీ సరిహద్దు ఉద్రిక్తలకు విస్తరణవాదం, ఆధిపత్యవాదం, వాణిజ్య ప్రయోజనాలు ఉన్నాయనడంలో సందేహం లేదు. సహజంగా సరిహద్దు సమస్యలు, సరిహద్దు దేశాలతో యుద్ధాలు సంక్షోభ కాలంలోనే, అంతర్జాతీయంగా దేశీయంగా గడ్డు పరిస్థితులు ఎదుర్కొంటున్న సందర్భం లోనే వస్తాయి. ప్రజలు సమస్యలతో సతమతమవుతూ ప్రభుత్వాల పట్ల అసమ్మతితో ఉద్యమాలు చేస్తున్నప్పుడు, ఉద్యమాలను నీరు గార్చడానికి, సమస్యల పరిష్కారం నుండి పాలకులు వైదొలగడానికి యుద్ధం సాకుతో తీవ్ర జాతీయ వాదాన్ని రెచ్చగొట్టడం వెన్నతో పెట్టిన విద్య అన్నది అక్షర సత్యం.

యుద్ధం జరిగితే ఇరు పక్షాలకు ప్రాణనష్టం, ఆస్తినష్టం, ఆర్థికవ్యయం జరుగుతుంది. ప్రజల సమస్యలు మరింత జటిలమవుతాయి. దేశం రుణగ్రస్తమవుతుంది. నిత్యావసరాల ధరలు పెరుగుతాయి. నిరుద్యోగం ప్రబలుతుంది. ప్రజల ప్రాథమిక హక్కులు హరించబడుతాయి. రాజ్యం ఫాసిస్టు పాలన సాగిస్తుంది. సరిహద్దుల్లో ఉన్న దేశంలో సమస్యలొచ్చినప్పుడు సామరస్య పూర్వకంగా పరిష్కారం చేసుకోవాలి. అందుకు సైనికాధికారుల స్థాయిలో, దౌత్య స్థాయిలో, అధినేతల స్థాయిలో, అంతర్జాతీయ వేదికల ద్వారా చర్చలు కొనసాగించాలి. అయితే ఇలాంటి ఘర్షణల వాతావరణం వెనుక నేతలకు వేరే వ్యూహాలు కూడ ఉంటాయి. రెండు దేశాలూ తమ సరిహద్దు ప్రాంతాలకు వివిధ రకాల సైనిక మోహరింపులను తక్షణమే ఉపసంహరించుకోవాలి. స్వల్ప ఉద్రిక్తతలు పెను యుద్ధాలుగా మారకుండా, వివాదాలు విద్వేషాలుగా మారకుండా చూడాల్సిన బాధ్యత రెండూ దేశాల నేతల పైననే ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# చైనా సరుకుల ప్రపంచీకరణ

***పెట్టుబడిదారీ వ్యవస్థను మరింత బలోపేతం చేయడానికి, ప్రజలను ప్రపంచీకరణ మాయాజాలం నుంచి దృష్టి మరల్చడానికి దేశభక్తి పేరుతో కేంద్ర ప్రభుత్వం చైనా యాప్‌లను నిషేధించిందని అంటున్నారు కేశవ్***

ఇటీవల చైనా, భారత్‌ల మధ్య నెలకొన్న సరిహద్దు వివాదం నేపథ్యంలో భారతదేశం చైనా దేశానికి సంబంధించిన 59 యాప్‌లను నిషేధించింది. అందులో అత్యంత ప్రజాదరణ పొందిన టిక్ టాక్, కామ్ స్కానర్, యుసి బ్రౌజర్ లాంటివి కూడా ఉన్నాయి. మనకు తెలీకుండానే చైనీస్ యాప్‌లు మన చుట్టూ తిరుగుతున్నాయి. మన జీవితాలను ప్రభావితం చేస్తున్నాయి. కామ్ స్కానర్ లాంటి యాప్‌లు ఉపయోగించని బ్యాంకు ఉద్యోగులు, ప్రభుత్వోద్యోగులు కనిపించడం కష్టమే. వాస్తవ పరిస్థితులు ఇలా ఉంటే, భారత్ చైనా ఉద్రిక్తతల నడుమ భారతీయులు చైనా వస్తువుల్ని బహిష్కరించాలనీ, అలా బహిష్కరించడమే నిజమైన దేశభక్తికి నిదర్శనమనీ, అలా చైనా వస్తువులు వాడే భారతీయుడు దేశభక్తుడు కాడనీ వాట్సప్‌ల ద్వారా తప్పుడు ప్రచారం ప్రణాళికాబద్ధంగా కొనసాగుతోంది. ఈ ప్రచారం ఎవరో ఆవేశంతో చేస్తున్నారని కాదు. ఈ ప్రచారాలు చాలా ప్రణాళికాబద్ధంగా, అమెరికన్ పెట్టుబడులు మరింత అధిక స్థాయిలో చైనా పెట్టుబడులను వెనక్కి తోసేసి మార్గం సుగమం అయ్యేలా జరుగుతున్నాయి. మనం చైనా వస్తువులు బహిష్కరణలో 'దేశభక్తి' ని నిరూపించడంలో సోషల్ మీడియాలో బిజీగా మునిగి ఉంటే, అమెరికన్ కంపెనీలు దేశ స్వదేశీ కార్పొరేట్లతో చేతులు కలిపి రంగం సిద్ధం చేసుకొని 5జిలోకి మొబైల్ నెట్‌వర్క్‌ని మార్చేయడానికి రంగం సిద్ధం చేసుకుంటున్నాయి.

చైనా వస్తువులు, చైనా యాప్‌లు, చైనా హార్డ్‌వేర్, చైనా సాఫ్ట్‌వేర్, చైనా ఎమ్ఐ ఫోన్‌లు భారత్ మార్కెట్‌లోకి రావడం, విపరీతంగా వ్యాపారాన్ని చేసుకోవడం, దేశ యువతను మొబైల్ ఫోన్‌లలో ముంచెయ్యడం, భారతదేశం మార్కెట్‌లోకి జొరబడి వేల లక్షల కోట్లు వ్యాపారం చెయ్యడం, యువతని టిక్‌టాక్ మాయల్లో ముంచేసి నిష్క్రియాపరులుగా మార్చేయడం అనేది వ్యక్తిగతమా? వ్యక్తిగతమైన ఎంపికలోకి ఇది వస్తుందా! లేదా, పాలసీ నిర్ణయమా!

1990లలో ఆరంభమైన ప్రపంచీకరణ, స్వేచ్ఛా వాణిజ్య పవనాలకు 2014లో మోదీ ప్రభుత్వం మరింత వేగవంతం చెయ్యడమనే పాలసీ నిర్ణయాన్ని పక్కన పెట్టి, కేవలం చైనా వస్తువుల్ని వదిలిపెట్టేస్తే దేశం అభివృద్ధి అయిపోతున్నట్టు ఢంకా కొట్టడంలో అంతర్జాతీయ శక్తుల ప్రాబల్యం అర్థం చేసుకోకపోతే, చైనా వస్తువుల్ని వాడి ఇంకా తప్పు చేస్తున్నామనే భావన యువత మెదళ్ల నుండి బయటికి పోదు. చైనా వస్తువుల్ని వాడడం భారతీయుడి వ్యక్తిగత ఎంపిక కాదు. చైనా వస్తువుల్ని బాయ్ కట్ చెయ్యడం కూడా వ్యక్తిగత ఎంపిక కాదు. ఈ నేపథ్యంలో ప్రపంచీకరణ, నయా ఉదారవాదం, స్వేచ్ఛా వాణిజ్యం, అంతర్జాతీయంగా సామ్రాజ్యవాద దేశాల పన్నాగాలూ ఉన్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ఉంది. ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌ల జోక్యం ఉంది. దేశాన్ని పూర్తిగా సామ్రాజ్యవాదుల కోసం బహుళ జాతి సంస్థల కోసం తలుపులు తీసేసే ప్రజా వ్యతిరేక ఆర్థిక విధానం ఉంది.

**విరుచుకుపడిన చైనా సెల్‌ఫోన్లు**

మొబైల్ ఫోన్ రంగంలో టెక్నాలజీలో, యాప్‌లలో, హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్, ఇతర వినియోగదారుల సరుకులలో భారతదేశం చైనా దేశంతో 2014 నుండి మరింత బలీయంగా చెట్టపట్టాల్ వేసుకొని నడిచింది. ఇక్కడి కార్పొరేట్లకు బంగారు పంటలను అందించింది. మొబైల్ ఫోను మార్కెట్లని పరిశీలిస్తే ఒక అంచనా ప్రకారం, వైవో 21 శాతం రియల్ మి 13 శాతం, జియోమి 31. 2 శాతం, సామ్‌సంగ్ 15.6 శాతం మార్కెట్ ని ఆక్రమించి ఉన్నాయి. ఇందులో సామ్‌సంగ్ తప్ప అన్నీ చైనావే. (ఇండియన్ ఎక్స్‌ప్రెస్ 5 జూలై 2020).

ఇక భారతదేశం సొంత మొబైల్ ఫోన్ మార్కెట్ ఎంత ఉందో అర్థమవుతుంది. మొబైల్ రంగంలో చైనాకు మనం పలికిన స్వాగత గీతం వెనుక భారతదేశంలోని కార్పొరేట్లు అవసరాలకు ఎలా న్యాయం జరిగిందో, వారు మరింత కుబేరులవ్వడంలో వ్యవస్థ స్వేచ్ఛా వాణిజ్య విధానాలు ఎలా సహకరించాయో, దేశీయ టెలిఫోన్ రంగం ఎలా శిథిలమైందో మన పరిశీలనలో ముమ్ముందు మరింత స్పష్టం అవుతుంది. అయితే చైనా పెట్టుబడులు ఒక్క మొబైల్ రంగంలోనే కాదు. మొబైల్ రంగంతోపాటు విభిన్న రంగాల్లోనూ ఆక్రమించి ఉన్నాయి. చైనా పెట్టుబడులు ఓలా క్యాబ్స్‌లో 451 మిలియన్ డాలర్లు. స్విగ్గీ.కామ్‌లో 328 మిలియన్ డాలర్లు. పేటిఎం మాల్‌లో 222 మిలియన్ డాలర్లు. పాలిసీ బజార్‌లో 150 మిలియన్ డాలర్లు. డ్రీం11.కామ్‌లో 100 మలియన్ డాలర్లు. డెలివరీలో 49 మిలియన్ డాలర్లు. చివరికి బైజూస్ ఆన్‌లైన్ క్లాసెస్‌లలో 49 మిలియన్ డాలర్లు. బిగ్ బాస్కెట్‌లో 40 మిలియన్ డాలర్లు. ఇలా చైనా పెట్టుబడులు ఆక్రమించని రంగం కనిపించదు. ఇదంతా, వ్యక్తిగత ఎంపికలోకి రాదు కదా!

భారతీయ పౌరుడు తనకు తానే ఈ పెట్టుబడుల్ని ఆహ్వానించలేదు. ఇవి వెళ్లిపొమ్మంటే వెళ్లిపోవడానికి ఈ విశాల పెట్టుబడుల వెనుక భారతదేశం వ్యవస్థాగతంగా 1990ల నుండి అనుసరిస్తోన్న స్వేచ్ఛా వాణిజ్యం కారణం. 2014లో టెక్నాలజీ సోషల్ మీడియా విపరీతమైన బాజాభజంత్రీలతో వచ్చిన మోదీ ప్రభుత్వం టెక్నాలజీ రంగం ప్రపంచీకరణను తన మిత్ర కూటమికి అనుకూలంగా మరింత సులభం చేస్తూ వస్తోంది.

జియో ఉచిత ఇంటర్నెట్ సేవలకూ, చైనా నుండి విపరీతంగా చొచ్చుకు వచ్చిన మొబైల్ స్మార్ట్ ఫోన్లకి, అప్పుడప్పుడే ఊపందుకొంటున్న ఈ-కామర్స్ మార్కెట్‌కి చాలా దగ్గర సంబంధం ఉంది. ఒకరి అవసరం మరొకరికి ఉంది. వీరందరికీ అనుకూలమైన ప్రజా వ్యతిరేక పాలసీ అవసరం ఉంది. ఈ గొలుసు ప్రక్రియను అర్థం చేసుకోకుండా మన

యువతరం చైనా వస్తువుల్ని విడిచి పెట్టెయ్యాలని భ్రమల్లో ఉంటే, దాన్నే దేశభక్తిగా భ్రమపడితే వాస్తవాలు కనుమరుగవుతాయి. మనం ఎంచుకొన్న సరుకులకీ, మనమీద స్వారీ చేస్తున్న చైనా వస్తువులకీ, మధ్య ప్రపంచీకరణ వారధి ఉంది. వ్యక్తిగత యిష్టాయిష్టాలను కొనుగోలు అలవాట్లను మార్కెట్లో వస్తువుతో పాటు మనం కూడా సరుకులుగా మారిపోయేటంత పరిస్థితులను ఈ వ్యవస్థీకృత విధానాలే నిర్ణయిస్తాయి – మన 'బాయ్ కట్' నినాదాల ప్రమేయం లేకుండా !

**చైనా–జియో ఈ–కామర్స్‌ల మేలు కలయిక**

దాదాపుగా 65 దేశాలకు చైనా సరుకులు ఎగుమతి అవుతున్నాయని ఒక అంచనా. అమెరికాకు ధీటుగా సామ్రాజ్యవాద దేశాలకు తలనొప్పి వ్యవహారంలా నేడు చైనా మరో కొత్తరంగును పులుముకుంటోంది. ఇక భారతదేశం విషయానికొస్తే, జూలై 2014 నుండి చైనా మొబైల్ ఫోను మార్కెట్లోకి అడుగుపెట్టింది. 2014లో వచ్చిన మోదీ ప్రభుత్వం అండదండలతో 'జియో' ఉచిత ఇంటర్నెట్ కానుకలను అందించడం ఆరంభించింది. దేశంలోని అతి పెద్ద మొబైల్ ఫోన్ మార్కెట్‌ని కైవసం చేసుకోవాలన్న అతి పెద్ద ప్రణాళికతో ఆరంభమైన జియో ఉచిత సిమ్‌లకు, ఉచిత ఇంటర్నెట్ సేవలకు తోడుగా, భారతదేశంలో బలమైన మొబైల్ ఫోను మార్కెట్ కనిపించలేదు. ఇక తన సామ్రాజ్య విస్తరణకు అత్యంత సాన్నిహిత్యంగా కనిపించాయి చైనా నుండి విరుచుకుపడిన వివిధ రకాల హంగులు రంగుల, ముస్తాబులతో కూడిన స్మార్ట్ ఫోన్‌లే. మోదీ ప్రభుత్వం అండదండలతో, ఇంతింతై వటుడింతై విజృంభించింది. నెల మొత్తం ఒక జిబితో సర్దుకున్న యువతకు, రోజుకి ఒక జిబి ఉచిత కానుకలు లభించడంతో మొత్తం సామాజిక సాంస్కృతిక పరిస్థితులే మారిపోయాయి. ఫోన్లలో ఫీచర్లను కొంచెం కొంచెం మారుస్తూ, మరో ఫోను, మరో ఫోను, మరో ఫోను ఇలా భారతీయ యువత వేలం వెర్రిగా స్మార్ట్ ఫోన్లలో పడింది. వేల కోట్ల ధనం కార్పొరేట్ల చేతికి చైనా మొబైల్ కంపెనీలకూ చేరింది. భారతదేశంలో అప్పటికే వోడాఫోన్, ఎయిర్‌టెల్, ఐడియా లాంటి కంపెనీల వేటతో లేవలేకపోతున్న జాతీయ బిఎస్ఎన్ఎల్‌కి ఈ జియో వేటు ఊహించరాని దెబ్బ. కోలుకోలేనంత పెద్ద గాయాలు. శ్మశాన వాటికకు దగ్గరగా బిఎస్ఎన్ఎల్ ప్రయాణం అస్తవ్యస్తమైన బిఎస్ఎన్ఎల్ ఉద్యోగుల జీవితాలు ఒక్క బిఎస్ఎన్ఎల్ మాత్రమే కాదు. జియో దెబ్బకు వోడాఫోన్, ఎయిర్‌టెల్, ఐడియా లాంటి పెట్టుబడిదారులే గుక్కతిప్పుకోలేని పరిస్థితి. కోట్ల బకాయిల పేరు మీద సుప్రీం కోర్టులో కేసుల కొనసాగింపు. ఇందులోని ఉద్యోగుల అస్థిర జీవితాలు. దీనికి తోడు డిజిటల్ ఇండియా అంటూ అవతరించిన ఈ–కామర్స్ కంపెనీలు ఫ్లిప్‌కార్ట్, అమెజాన్, స్నాప్‌డీల్ లాంటివి ఈ మొబైల్‌ఫోన్ అమ్మకాలకు విపరీతంగా సహకరించాయి. వినియోగదారుడి చేతిలో మొబైల్ ఫోన్ పెట్టారు. ఈ మొబైల్ ఫోన్లోనే మార్కెట్టు పెట్టారు. ఇలా భారతదేశంలోని రిటైల్ మార్కెట్‌ను హతమార్చారు. ఇప్పుడు వినియోగదారుడు సరుకుల కొనుగోలుకు ఎక్కడికో మరో మార్కెట్‌కి వెళ్లవలసిన అవసరమే లేదు. మొబైల్ ఫోనులోనే ఆ మార్కెట్ ఏర్పాటు చేశారు. వినియోగదారుడికి ఆదాయం ఉన్నా, లేకపోయినా, తక్కువున్నా క్రెడిట్ కార్డుల ద్వారా అయినా సరే వ్యాపారం చేసుకున్నారు. ఫలితం అనుభవించారు. – చైనా, భారత్ పెట్టుబడిదారులు. ఒకరికొకరు చెట్టపట్టాల్ వేసుకొని, జేబులు ఖాళీ చేసుకున్నారు భారతదేశంలోని కోట్లకొలది జనాభా.

**బ్రెయిన్ వాషింగ్ సేవలో**

దీనికి తోడు మొబైల్ ఫోన్లకు, జియో ఉచిత ఇంటర్నెట్ రాకతో, వాట్సప్ సహకారంతో యువత మెదళ్లను వ్యవస్థకు అనుగుణంగా బ్రెయిన్ వాష్ చేసే ప్రక్రియ నడపడంలో నాయకులకు మరింత సులభమయింది. ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక విషయాలకు సంబంధించి, ఒక ప్రత్యేక మతస్తుల మీద యువత మెదళ్లలో వ్యతిరేక భావం నాటడం నుండి, బ్లాక్ మనీ, నోట్ల రద్దు మీద ప్రభుత్వానికి అనుకూలంగా ప్రజల మెదళ్లను మలచడం వరకు, ప్రజల్లో 'దేశభక్తి' ని తప్పుడు మార్గాల్లో నాటి తమ ప్రయోజనాలను కాపాడుకోవడం వరకు, ప్రత్యేక ప్రతిపక్ష నాయకులను 'వ్యక్తిత్వం' లేనివారుగా చిత్రీకరించి తమ స్థానాన్ని పదిలపర్చుకొని ప్రపంచీకరణను మరింత జోరుగా హుషారుగా గనుల మీదకూ, రైళ్లమీదకూ మళ్లించడం వరకు, ఒక్కో గనిని, బ్లాకుని తమ మిత్ర కూటమికి ధారాదత్తం చేసేసే వరకు ఈ వాట్సప్ విశ్వవిద్యాలయం సహకరించింది. ప్రజలను మరింత బానిసలుగా మారుస్తూ ప్రభుత్వ రంగ వైఫల్యానికి దారితీసే పరిస్థితులకు మార్గం సులభం చేసింది. పరిస్థితుల్ని ఈ స్థాయికి తీసుకొచ్చిన తర్వాత, మనం చైనా వస్తువుల్ని విస్మరించడంలో ప్రయోజనం ఏముంటుంది? అది, సాధ్యమెలా అవుతుంది? పాలసీలోనూ, విధానాలలోనూ, మార్పు రాకుండా ప్రజల ఎంపిక'లో మార్పు, ప్రజల ఇష్టాల్లో మార్పు దేశాన్ని ఎలా మారుస్తుంది? నిషేధమయింది 59 యాప్‌లు మాత్రమే. వేలకోట్ల పెట్టుబడులు విభిన్న రంగాల్లో చైనావి ఇంకా పెనవేసుకొని ఉన్నాయి.

**అమెరికన్ పెట్టుబడులకు ఎర్ర తివాచీ**

చైనా వస్తువుల్ని బహిష్కరించే నినాదం నేపథ్యంలో జియో, గూగుల్ మధ్య సయోధ్య వార్తల్లో కొచ్చింది. జియో 5జి టెక్నాలజీకి రంగం సిద్ధం చేస్తోంది. అందులో గూగుల్ ఒకటిన్నర లక్షల కోట్ల రూపాయలను పెట్టుబడిగా పెడుతోంది. (16జూలై 2020, హిందూ)

టెక్నాలజీలో చైనా దూకుడు మీద అమెరికాకు ఎప్పటి నుంచో నిరసన ఉంది. చైనా మీద బురద జల్లే ప్రయత్నాలు జాతీయంగానే కాదు, అంతర్జాతీయంగానూ ప్రణాళికాబద్ధంగా నడుస్తోంది. టెక్నాలజీ రంగం నుండి కరోనా వైరస్ వరకూ చైనా దేశాన్ని నెగెటివ్‌గా చూపించే ప్రక్రియ ప్రణాళికాబద్ధంగా కొనసాగుతోంది. అయితే చైనా అయినా, అమెరికా అయినా పెట్టుబడి విధానాల విషయానికొస్తే మనకు ఒక్కటే. చైనా అందించే మొబైల్లలో చైనా వ్యతిరేకతను ప్రచారం చెయ్యడంలో మనకు జరిగే ప్రయోజనాలు శూన్యం. పెట్టుబడులు చైనావి అయినా, అమెరికావి అయినా, మన దేశానివి అయినా, రూపం ఒక్కటే. స్వభావం ఒక్కటే. లాభాల పేర్లతో శ్రమ దోపిడీ ప్రక్రియను కొనసాగించడం, కాస్తో కూస్తో ప్రభుత్వం చేతుల్లో కొంతవరకైనా సుస్థిరంగా ఉన్న రంగాలను పెట్టుబడుల మాయలు చేయించి ప్రవేటీకరణం చెయ్యడం, వర్గ ప్రయోజనాలను నెరవేర్చుకోవడం తప్ప సాధారణ ప్రజలకు జరిగే ప్రయోజనం శూన్యం. చైనా సరుకులను బాయ్ కట్ చేస్తామన్నా, అమెరికా పెట్టుబడులను ఆహ్వానిద్దామన్నా ప్రభుత్వం ఎంచుకునే పాలసీ విధానాల మార్పే తప్ప ప్రజలకు ఒనగూడేదేమీ ఉండదు. 'మేక్ ఇన్ ఇండియా' ప్రాతిపదిక కింద దేశీయ పరిశ్రమలు అభివృద్ధి చేద్దామన్న నాయకుల నినాదాలు కటౌట్ల మీద ఉంటాయి. వాస్తవ రూపం దాల్చడంలో స్వేచ్ఛా వాణిజ్యం నయా ఉదారవాదం అంతర్జాతీయ ప్రయోజనాలు అడ్డు తగులుతాయి. ఇక చైనా విషయానికొస్తే, చైనాను

# అసలు లక్ష్యం చైనాయే..

***కరోనాను కట్టడి చేయడంలో విఫలమైన ట్రంప్ ఈ మహమ్మారికి కారణం చైనా అని , అది విస్తరించడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ కారణమని ప్రజల్ని నమ్మించే ప్రయత్నం చేస్తున్నారని అంటున్నారు సతీష్ బైరెడ్డి***

కరోనా కల్లోలం ప్రపంచ వ్యాప్తంగా వ్యక్తుల జీవితాలను ప్రభావితం చేయడమే కాకుండా అంతర్జాతీయ వ్యవస్థలను, దేశాల మధ్య సంబంధాలను కూడా తీవ్రంగా ప్రభావితం చేస్తున్నది. మానవ జాతి గతంలో ఏనాడు ఎరుగని పెను ఉత్పాతాన్ని అనుభవిస్తున్నది. ఎవరి సరిహద్దుల్ని వారు మూసేసుకుని 'హద్దు'ల్లో ఉంటున్నారు. అన్ని రంగాల్లోనూ పెను మార్పులు సంభవిస్తున్నాయి. అంతర్జాతీయ యవనిక మీద ఆధిపత్య పోరు కోవిడ్ సందర్భంలో కొత్త రూపు తీసుకుంటున్నది. గతించిన కాలంలో ప్రపంచం చవిచూసిన ప్రఛ్చన్న యుద్ధంలో ప్రధాన పాత్రధారులు అమెరికా, సోవియట్ రష్యాలు. రష్యా స్థానంలో చైనా వచ్చి చేరడంతో కొత్త ప్రఛ్చన్న యుద్ధ కాండ మొదలయింది. పాత ప్రఛ్చన్న యుద్ధానంతర చరిత్రలో ఏకధృవ ప్రపంచాన్ని తన విలువల పునాదిగా నిలబెట్టే పనికి పూనుకున్నది అమెరికా. ఆ క్రమంలోనే అనేక యుద్ధాలను సృష్టించి తను తీసిన గోతిలో తానే పడ్డట్టు చతికిలపడిన చరిత్రను కూడా మూటగట్టుకున్నది. కరోనా ను కట్టడి చేయలేక కకావికలం అవుతున్న అగ్రరాజ్యం 'దోషుల్ని' వెతికే పనిలో పడింది. కరోనా చుట్టుముట్టే నాటికే చైనాతో వ్యాపార యుద్ధంలో మునిగిపోయింది. ప్రపంచంలో ఏ రెండు దేశాల మధ్య లేనంత వాణిజ్య లావాదేవీలు ఈ రెండింటి మధ్య జరుగుతున్నాయి. ఏ రెండు దేశాల మధ్య లేనంత వైరమూ కూడా ఈ రెండు దేశాల మధ్యనే నెలకొన్నది. ఆయా దేశాల అంతర్గత రాజకీయ ప్రయోజనాలకు అనుగుణంగా వ్యాపార వ్యవహారాలు నిర్వహించబడుతున్నాయి. ప్రధానంగా అమెరికాలో ఇది మరీ ఎక్కువగా ఉన్నది. ట్రంపు పాలనా కాలంలో ఇది మరింత వికృతరూపం తీసుకున్నది.

ఇవాళ ప్రపంచాన్ని అతలాకుతలం చేస్తున్న కరోనా తొలిసారి కనిపించింది చైనాలోని వూహాన్ నగరంలో అయినప్పటికీ అమెరికా అనుభవిస్తున్నంత అతలాకుతలం మరే దేశం అనుభవించడం లేదు. మిలియన్ల కొద్దీ కేసులు లక్షల్లో మరణాలు. కంటికి కనిపించని ఈ వైరస్ చేస్తున్న విలయతాండవాన్ని అడ్డుకోలేక "అగ్రరాజ్య" బ్రాండ్ నేమ్ బీటలు వారే పరిస్థితిని అనుభవిస్తున్నది. అభివృద్ధి చెందిన దేశమైనా ప్రజల కళ్లలో కరోనా కలిగించిన దుఃఖాన్ని తూడ్చగలిగే స్థితిలో ఆ దేశ వైద్యరంగం లేదు. సన్నద్ధతారాహిత్యం, విధాన రాహిత్యం, నిర్లక్ష్య ధోరణి వెరసి నేటి దుఃఖ స్థితి, దుస్థితి. అంతర్జాతీయంగా పడిపోతున్న ప్రతిష్ఠ, అంతర్గతంగా కరోనాను కట్టడి చేయడంలో, ప్రజల ఆరోగ్యాన్ని కాపాడి విశ్వాసాన్ని కల్పించడంలో ఘోరంగా విఫలమయ్యారన్న అపవాదును ట్రంప్ మూటగట్టుకున్నాడు. అసలే ఎన్నికల సంవత్సరం, మళ్లీ ఎన్నిక కావాలన్న తహతహలో పాపాన్ని పరుల మీదకు నెట్టివేసి, తప్పు తనది కాదన్నట్టు తప్పుకునే పనిలో భాగంగానే ప్రపంచ ఆరోగ్య సంస్థ నుండి వైదొలుగుతున్నట్టు ప్రకటించడం జరిగింది. కరోనా సృష్టికర్త చైనానే అని పదే పదే నిందించాడు. తన సొంత మిలిటరీ ఇంటిలిజెన్స్ వ్యవస్థ, శాస్త్రవేత్తల బృందం ఈ ఆరోపణను కొట్టిపారేయడం గమనించదగినది.

ఐక్యరాజ్య సమితికి అనుబంధంగా ఏర్పడిన అనేక సంస్థల్లో భాగంగానే 1948 ఏప్రిల్ 7న ప్రపంచ ఆరోగ్య సంస్థ ఏర్పడింది. 72 ఏళ్లుగా ప్రపంచవ్యాప్తంగా అన్ని దేశాల్లో కూడా వైద్య పరమైన అనేక చర్యలను ఆయా దేశాల సహకారం, సమన్వయంతో చేపడుతున్నది. ప్రపంచ ప్రజలందరి ఆరోగ్యమే తన బాధ్యతగా కొనసాగుతున్నది. సభ్య

---

కూడా సోషలిస్టు దేశంగా అభివర్ణించే పరిస్థితి లేదు. చైనాలో అమెరికన్ బహుళజాతి కంపెనీలు మెల్లమెల్లగా ప్రవేశించి ఉన్నాయి. చికెన్ పరిశ్రమలో, మాంసం పరిశ్రమలో విపరీతంగా పెట్టుబడులు పెట్టి ఈ సరుకులను విశ్వవ్యాప్తం చెయ్యాలని చూస్తున్నాయి. అందుకోసం అగ్ర రాజ్యాల దేశాధినేతలనే ప్రభావితం చేయగలుగుతున్నాయి. – తమ వర్తకానికి మార్గం సుగమం చెయ్యడానికి !

కాబట్టి పెట్టుబడుల విస్తరణ విషయం వస్తే, చైనా అయినా, అమెరికా అయినా, ఇతర ఏ దేశాలైన ఒక్కటే. నయా వలసవాదం, స్వేచ్ఛా వాణిజ్యం పేరుతో పెట్టుబడిదారీ వ్యవస్థను బలోపేతం చెయ్యడమే. అడొచ్చిన కంఠాలను మూసెయ్యడమే! ప్రభుత్వం చేతుల్లో ఉన్న ఒక్కో రంగం ప్రైవేటు పెట్టుబడుల చేతుల్లోకి పోవడమే. అందులో బయటి పెట్టుబడులు నిరాటంకంగా పెరగడమే. ప్రపంచీకరణను ఈ కోణంలో అర్థం చేసుకోగలిగితే మనకు ఏ వస్తువులైనా, ఏ పెట్టుబడులైనా ఒక్కటే.

ఈ యాప్‌ల విషయానికొస్తే, అవి చైనావైనా, అమెరికావైనా, మరే దేశానివైనా భారతీయుల ప్రైవసీ అనేది ఈ కుబేరుల రిమోట్ కంట్రోలర్‌లోకి వెళ్లిపోతోంది. అవి ఎవరు, ఎప్పుడు, ఎలా ఉపయోగిస్తున్నారో, తమ ప్రయోజనాల కోసం మన ప్రైవసీని ఎలా వాడుకుంటున్నారో ఇంతవరకూ స్పష్టం కావడం లేదు. కొత్తరకం డిజిటల్ బానిసత్వం భవిష్యత్తులో ఆరంభమవుతుందేమో! చైనా సరుకుల బాయ్‌కాట్‌ల నినాదాల్లో పడి ప్రపంచీకరణ మాయాజాలాన్ని మరచిపోకుండా విదేశీ పెట్టుబడులను విపరీతంగా ఆహ్వానించే ప్రజా వ్యతిరేక విధానాల మీద దృష్టి సారించాల్సిన అవసరం ఉంది. ప్రజా ప్రభుత్వాలు ఏ వర్గ ప్రయోజనాలు కాపాడడంలో నిమగ్నమై ఉన్నాయో ఏ వర్గ ప్రయోజనాలను కాలితో తొక్కేస్తున్నారో తెలుసుకోవడం అవసరం.

*(రచయిత 'పగిలిన పాదాల నెత్తురులో – ప్రపంచీకరణ వ్యాసాలు' పుస్తకం రచించారు)* వీ

దేశాలు జిడిపి ప్రాతిపదికన ఈ సంస్థకు నిధులు సమకూరుస్తున్నాయి. ఈ సంస్థలో అనేక దేశాల నుండి వైద్య నిపుణులు తమ సేవలను అందిస్తున్నారు. ప్రపంచవ్యాప్తంగా అత్యున్నతమైన వైద్య ప్రమాణాలు నెలకొల్పడం, ఆయా దేశాలలో అక్కడి పరిస్థితులకు అనుగుణంగా వైద్య రంగానికి సంబంధించిన సలహాలు, సూచనలను అందిస్తుంది. ఏ దేశంలో నైనా ప్రత్యేక ఆరోగ్య సమస్యలు తలెత్తినా, యుద్ధ సమయంలోనూ, ఘర్షణలు ఉన్న ప్రాంతాల్లో తన యంత్రాంగాన్ని మోహరించి వైద్య సేవలను అందిస్తుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ సేవలు ప్రధానంగా ఆఫ్రికా దేశాల్లో బాగా విస్తరించి ఉన్నాయి. పశ్చిమ ఆఫ్రికాలో ఎబోలా ప్రబలినప్పుడు ముఖ్యంగా కాంగో, లైబీరియా , నైజీరియా లాంటి దేశాల్లో ప్రపంచ ఆరోగ్య సంస్థ తన యంత్రాంగాన్ని నిర్విరామంగా సేవలను అందించేలా సన్నద్ధం చేసింది. అయితే 2004లో "సార్స్" తలెత్తినపుడు సకాలంలో స్పందించలేదనే, సమన్వయం చేయలేదనే విమర్శలను ఎదుర్కొంది. అనేక లోపాలు తప్పులు తడబాట్లు ఉన్నప్పటికీ ప్రపంచ ఆరోగ్య సంస్థ అవసరం ఉన్నది అనే అభిప్రాయాన్ని ఎవరూ కాదనలేరు.

72 సంవత్సరాల అనుబంధాన్ని తెంచుకొని అమెరికా ఈ సంస్థను ఎందుకు లక్ష్యంగా చేసుకున్నదనేదే ప్రశ్న. ప్రపంచ ఆరోగ్య సంస్థతో తెగదెంపులు చేసుకుంటున్నామని ప్రకటించే నాటికే 450 మిలియన్ల డాలర్లను ఈ సంస్థకు సాలీనా అందిస్తూవస్తున్నది అమెరికా. ఈ మొత్తం ప్రపంచ ఆరోగ్య సంస్థ బడ్జెట్‌లో 15 శాతంగా ఉంది. ఈ సంస్థలో పనిచేసే అత్యున్నత వైద్యనిపుణులలో అమెరికా వాటా తక్కువేంకాదు. నిజానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ లాంటివి అమెరికాకు సులభతరమైన లక్ష్యమే. కానీ దాని వెనకాల అసలు టార్గెట్ అంతా చైనాయే. చైనా మీద చేయగలిగింది చేస్తూనే ఈ సంస్థను లక్ష్యంగా చేసుకున్నది అమెరికా. ఈ సందర్భంలోనే డోనాల్డ్ ట్రంప్ రక్షణాత్మక ఆర్థిక చర్యలు, జాతి వివక్షాపూరితమైన విధానాలను అర్థం చేసుకోవాలి. అమెరికా ఫస్ట్ అనే ఆకర్షణీయమైన నినాదం కూడా చైనానుద్దేశించి, రాజకీయ ప్రయోజనాలను ఆశించి చేసిందే. అమెరికా చైనా వ్యాపార వాణిజ్య కార్యకలాపాలల్లో సమతుల్యత లేదని అమెరికా ప్రయోజనాలను పణంగా పెట్టి చైనా మేలు పొందుతున్నదనే అభిప్రాయాన్ని అమెరికా ప్రజల్లో కలిగించడంలో ట్రంప్ కొంతమేరకు సఫలీకృతుడయ్యాడు. కరోనాను చైనా వైరస్ అని బాహాటంగా మాట్లాడడం నోటి దురుసు తనంగా కన్పించినా ఆ వైరస్‌ను సృష్టించి అమెరికా ఆర్థిక వ్యవస్థను ధ్వంసం చేసే కుట్రకు చైనా పాల్పడిందనే ఇంప్రెషన్‌ను సృష్టించే బలమైన ప్రణాళికనే ఉన్నదని అర్థం చేసుకోవాలి. మరి మధ్యలో ప్రపంచ ఆరోగ్య సంస్థ ఏం చేసిందనే ప్రశ్న తలెత్తుతుంది. కరోనాను పాండమిక్‌గా ప్రకటించడంలోనూ, దానిని కట్టడి చేయడంలోనూ, మిగతా దేశాలను అప్రమత్తం చేయడంలోనూ విఫలమైందనే ఆరోపణలు కాకుండా అసలు ప్రపంచ ఆరోగ్య సంస్థ చైనాకు తొత్తుగా మారి ఇతర దేశాల ప్రయోజనాలకూ భంగకరంగా ఉన్నదని ట్రంప్ బలంగా నమ్మడమే కాదు అమెరికా మొత్తాన్ని నమ్మమంటున్నాడు. మా దేశ ప్రజల పన్నులను ఆరోగ్య సంస్థకు అందిస్తే అది మా వైరి దేశానికి ఊడిగం చేస్తూ అమెరికా ఆరోగ్యాన్ని బలిపెట్టిందని డోనాల్డ్ ట్రంప్ వాదన. అంతకు మించి అన్ని అంతర్జాతీయ సంస్థల ద్వారా తన సామ్రాజ్యవాద ఎజెండాను ప్రపంచ వ్యాప్తంగా తీసుకెళ్లే అవకాశం అమెరికా కోల్పోయింది అని ఆ స్థానాన్ని చైనా ఆక్రమిస్తుందనే అక్కసు కూడా ట్రంప్ మాటల్లో ధ్వనిస్తుంది. అందుకేనేమో ప్రపంచ ఆరోగ్య సంస్థ చైనా నుండి "స్వాతంత్ర్యం" పొందాలని, స్వతంత్రంగా వ్యవహరించాలని, తక్షణమే తనను తాను సంస్కరించుకోవాలనే షరతులను విధించాడు.

1970ల లోనే చైనా అమెరికాను ఉద్దేశించి ఐక్యరాజ్యసమితి అన్ని సంస్థలను కూడా పాశ్చాత్య విలువలు ఉదారవాద సూత్రాలకు అనుగుణంగా రూపొందించుకొని తన ఆధిపత్యాన్ని ప్రదర్శిస్తుందని బాహాటంగానే నిరసించింది. కానీ ఇవ్వాళ చైనా కూడా అదే దారిలో నడుస్తున్నది. ఆరోగ్య సంస్థకి అందించే ఫండింగ్ నిలిపివేస్తున్నట్లు అమెరికా ప్రకటించిన వెంటనే తన ఫండింగ్‌ను పెంచుతున్నట్లు ప్రకటించింది చైనా. ఇప్పటికే ఐక్యరాజ్యసమితి శాంతి దళాల్లో తన వాటాను 80 శాతం ఆఫ్రికా దేశాల్లోనే మోహరించి తన మిలిటరీ ఉనికిని చాటుతున్నది చైనా. ఆఫ్రికా ఖండానికే చెందిన ఇథియోపియా దేశ మాజీ ఆరోగ్య మంత్రి అయిన డాక్టర్ టెడ్రోస్ ప్రపంచ ఆరోగ్య సంస్థ డైరెక్టర్ జనరల్‌గా ఎన్నిక కావడం వెనుకాల చైనా పాత్ర ఉన్నదని, ఆ దేశంలో చైనా పెట్టుబడులు పెట్టిందని అందుకే ఆయన చైనాకు అనుకూలంగా వ్యవహరిస్తున్నడేమో అనే అంశాలు తెరపైకి వచ్చాయి.

మొత్తంగా రెండు దేశాల మధ్య ఏర్పడుతున్న ప్రచ్ఛన్న యుద్ధ వాతావరణంలో ప్రపంచవ్యాప్తంగా ఎంతో కొంత వైద్య సేవలు అందించడంలో, వైద్యపరమైన మౌలిక సదుపాయాలను పెంచడంలో ఆయా దేశాలకు సలహాలను, సూచనలను అందిస్తూ, వైద్య పరిశోధనలను చేపట్టడంలో ఆయా దేశాలను సమన్వయ పరిచే సంస్థ బలపడం గర్హించదగినది. కరోనా సృష్టించిన ఆరోగ్య సంక్షోభాన్ని అధిగమించలేని తనం, నిర్లక్ష్యపూరిత ధోరణి ప్రదర్శిస్తున్న సందర్భంలోనే నల్లజాతి వ్యక్తి జార్జ్ ఫ్లాయిడ్ పోలీసుల చేతిలో హత్యకు గురవడం, అమెరికా అంతటా నల్లజాతి తెల్లజాతి ప్రజల ఆందోళనలతో ట్రంప్ మరింత అభద్రతలోకి జారుకున్నాడు. పీఠం చేజారి పోతుందేమో అనే భయమే ఆయనతో అనేక అసంబద్ధ నిర్ణయాలు తీసుకునేలా పురిగొల్పుతుంది. ఈ అననుకూలమైన పరిస్థితి నుంచి ప్రజల దృష్టిని మళ్లించడానికి ప్రపంచ ఆరోగ్య సంస్థ నుండి వైదొలుగుతున్నట్లు ప్రకటించాడు డోనాల్డ్ ట్రంప్. నిజానికి ఈ సంస్థ తన సభ్యదేశాలను ఆదేశించే అధికారం ఉన్న సంస్థ కాదు సలహాలు, సూచనలు కరోనా లాంటి ఆపద కాలంలో అనేక మార్గదర్శకాలను రూపొందించి ఆయా దేశాలకు అందిస్తుంది. వాటిని అమలు చేయాలనే అనివార్యత కూడా ఆయా దేశాలకు ఏమీ లేదు. కానీ ఇవ్వాళ ప్రపంచ ఆరోగ్య సంస్థ ఏం చెబుతుందో అని ప్రపంచమంతా ఎదురు చూసే స్థాయికి వచ్చింది అంటే దాని విశ్వసనీయత, విషయ నిపుణత ఎంత ఉందో అర్థం అవుతున్నది. సంస్థతో ఎన్ని దేశాలకు ఎన్ని విభేదాలు, అసంతృప్తి ఉన్నప్పటికిని కరోనా విపత్తును ఎదుర్కోవడంలో ఆయా దేశాలు సంస్థ సమన్వయం, సహకారం, మార్గనిర్దేశం కోసం చూస్తున్నాయనేది వర్తమాన వాస్తవం. ఇలాంటి సంస్థను ఆయా దేశాల ఆధిపత్య ఎజెండాలకు, ప్రయోజనాలకు అనుగుణంగా కాకుండా ప్రపంచ మానవాళి ఆరోగ్యం, సంక్షేమం దృష్ట్యా మరింత బలోపేతం, సమ్మిళితం చేయడం ద్వారా భవిష్యత్తులో కరోనా లాంటి ప్రమాదం అంతకుమించిన విపత్తును ఎదుర్కొనే శక్తి ప్రపంచానికి వస్తుంది. వీ

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

# డేవిడ్ హార్వే: పెట్టుబడి - 7 ప్రధాన వైరుధ్యాలు

***పెట్టుబడిదారీ వ్యవస్థ తనలోని పదిహేడు అంతర్ వైరుధ్యాల వల్ల పతనం దిశగా పయనిస్తుందని డేవిడ్ హార్వే చేసిన విశ్లేషణలోని ఏడు ప్రాథమిక వైరుధ్యాలను వివరిస్తున్నారు రమేష్ పట్నాయక్***

*(...గత సంచిక తరువాయి భాగం)*

**ఏడు ప్రాథమిక వైరుధ్యాలపై సంగ్రహ వ్యాఖ్య**

డేవిడ్ హార్వే పెట్టుబడి వ్యవస్థలో ఏడు ప్రాథమిక వైరుధ్యాలు గురించి చేసిన విశ్లేషణను మనం గత విభాగాలలో పరిచయం చేసుకున్నాం. ఈ విభాగంలో సదరు ఏడు వైరుధ్యాల గురించి సంక్షిప్తంగా చెప్పుకుందాం. డేవిడ్ హార్వే పెట్టుబడిదారీ వ్యవస్థలో ఏఏ వైరుధ్యాలను ప్రాథమిక వైరుధ్యాలుగా చూపాడో వాటిని మనం అంగీకరించినా ఆయన చూపిన పరిష్కారాలు మనకు ఆమోద యోగ్యం కావనిపిస్తుంది. గత విభాగాలలో ఆ విషయాలను వివరంగా పేర్కొన్నాం. ఈ సంగ్రహ వ్యాఖ్యలో మనకు ఆమోదం ఉన్న విషయాల మేరకే పరిమితం అవుదాం. ఈ ముగింపు విభాగంలో క్లుప్తంగా ఒకే చోట సదరు వైరుధ్యాలను పునఃచరణ చేసుకోవడం ప్రయోజనకరంగా ఉండవచ్చు.

**1. ఉపయోగపు విలువ – మారకపు విలువల మధ్య వైరుధ్యం**

వస్తువులకు పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉపయోగపు విలువ, మారకపు విలువ ఉంటాయని మనకు తెలుసు. అలాగే, ఉపయోగపు విలువ లేనిదే మారకపు విలువ ఉండదు. కాని వైపరీత్యమేమంటే ఉపయోగపు విలువపై ఆధారపడి ఉనికిలోనికి వచ్చిన మారకపు విలువ ఉపయోగపు విలువకు వ్యతిరేకంగా నిలబడడం పెట్టుబడిదారీ వ్యవస్థలో చూస్తాం. రియల్టర్లు మార్కెట్‌లో అమ్మకం కొరకు సమాజంలో ఉపయోగపు విలువగా ఉన్న గృహాలను నిర్మించారు, గృహ వసతి బూమ్‌లో ఉన్నప్పుడు ఒక వినియోగ దారుడు బ్యాంకులో అప్పుచేసి ఒక ఇంటిని అధిక ధరకు ఉపయోగ విలువగా రియల్టర్ నుంచి కొనుగోలు చేశాడు. బుడగ పేలింది. ఇంటి ధర పడిపోయింది. ఇల్లు బ్యాంకు వాడికి అప్పజెప్పినా అప్పు తీరలేదు. ఇల్లు కోల్పోయి అప్పు మిగిలిన వ్యక్తి విషయం అలా ఉంచినా ఇల్లు బ్యాంకు చేతిలో సరుకుగా పడి ఉంది. దానిని కొనే నాథుడు లేడు. అంటే ఒక ఉపయోగపు విలువ పై ఆధారపడి వచ్చిన మారకపు విలువ ఉపయోగపు విలువనే బంధీచేసింది. ఈ విధంగా ఉపయోగపు విలువ, మారకపు విలువ వైరుధ్యంలో ఉండడాన్ని డేవిడ్ హార్వే వివరిస్తాడు. ఈ వైరుధ్యమే 1986లో యు.ఎస్‌లో పొదుపు, అప్పుల వైరుధ్యంగా, 1990లో జపాన్‌లో భూమి మార్కెట్ సంక్షోభంగా, 1992లో స్కాండినేవియన్ దేశాలలో ఆస్తుల మార్కెట్ పతనంగా వ్యక్తమయిందని, ఈ వైరుధ్యం పెట్టబడిదారీ వ్యవస్థ లక్షణమని, ఇతర వైరుధ్యాలతో కలిసి ఈ వైరుధ్యం పెట్టుబడి వ్యవస్థకే ఎసరు పెడుతుందని డేవిడ్ హార్వే వివరిస్తాడు.

**2. శ్రమ సామాజిక విలువ – డబ్బుచే దాని వ్యక్తీకరణల మధ్య వైరుధ్యం**

సామాజిక శ్రమ విభజనలో భాగంగా తయారయి మార్కెట్‌లో అమ్మకానికి పెట్టిన వస్తువునే సరుకు అంటామని, దీనికి ఉపయోగపు విలువ, మారకపు విలువ ఉంటాయని, ముందు వస్తు మారకపు పద్ధతి ఉండేదని దాని స్థానంలో బంగారం డబ్బుగా మారకపు మాధ్యమంగా వచ్చిందని మనకు తెలుసు. వస్తు మార్పిడి కాలంలో మార్పిడి పొందిన రెండు వస్తువులకు ఉపయోగపు విలువ, మారకపు విలువ ఉందేది. బంగారం మారకపు మాధ్యమంగా వచ్చినప్పుడు పరిస్థితి మారింది. బంగారానికి మారకపు విలువ ఉందిగాని ఉపయోగపు విలువ లేదు, రెండు ఉపయోగ విలువల మధ్య ఉపయోగ విలువ లేని బంగారం మారకపు మాధ్యమంగా రావడం ఒక సంక్షోభం. ఇది డబ్బు పోగుపడడానికి దారితీసింది. అయితే బంగారానికి ఉపయోగపు విలువ లేకపోయినా అదికూడా మానవ శ్రమతో తయారవుతుంది. అది ఏఏ సరుకులతో మారకం పొందుతుందో ఆయా సరుకులలో ఎంత శ్రమ ఉందో బంగారంలో కూడా అంతే శ్రమ ఉంది. అంటే బంగారానికి కూడా అంతే సామాజిక విలువ ఉంది. అందుకే దానికి రాజ్యం అధికార ముద్రతో సంబంధం లేకుండా స్వతఃసిద్ధమైన విలువ ఉంది. బంగారం స్థానంలో కాగితపు నోట్లు వచ్చినప్పుడు వాటికి స్వంత విలువ లేదు. వాటికి రాజముద్ర ద్వారా మాత్రమే విలువ ఉంటుంది. నోటులో ఉండే మానవ శ్రమ చాలా స్వల్పం. ప్రభుత్వం ఆదేశానుసారం నోట్లు ముద్రిత మవుతున్నాయి. గత విభాగాలలో మీరు వివరాలు చూసి ఉంటారు. అంటే రెండు శ్రమ ఫలిత ఉపయోగ విలువల మధ్య ఒక శ్రమ రహిత అంటే స్వతహాగా ఎటువంటి విలువ లేని కాగితం మారకపు మాధ్యమంగా వచ్చి కూర్చుంది. నోట్ల వ్యవస్థ వచ్చిన తరువాత డబ్బు ఒక చిహ్నం మాత్రమే అని అయితే డబ్బును అప్పు ఇస్తే వడ్డీ వస్తుందని అలాగే పెట్టుబడిగా పెడితే లాభం వస్తుందని, అంటే ఒక చిహ్నం విలువను సృష్టించినట్లు కనిపిస్తుందని డేవిడ్ హార్వే వివరిస్తాడు.

ఒకప్పుడు బంగారం అయినా ఇప్పుడు నోట్లు అయినా మనం దానిని డబ్బు అంటాం. ఈ డబ్బు మూడు అవసరాల కొరకు వచ్చింది. ఎ) మారకపు మాధ్యమంగా, బి) అన్ని సరుకుల విలువలను కొలిచే ఒక కొలబద్దగా, విలువను నిల్వగా ఉంచడానికి, స్థలాంతరంలో, కాలాంతరంలో వాడడానికి డబ్బు పుట్టుకొచ్చింది. అయితే నిజానికి ఇప్పుడు ఆ అవసరాలను అది తీరుస్తుందా అన్నదే ప్రశ్న. మోనోపలి ధరల వలన సరుకులను అధిక ధరలకు కొనవలసి రావడం వలన సమాన విలువల మధ్య మారకంగా, విలువ కొలతగా దాని లక్షణం

సంక్షోభంలో పడిపోయింది. ప్రభుత్వాలు అదనంగా డబ్బు ముద్రించినప్పుడు, ప్రధానంగా అదనంగా ముద్రించిన డబ్బు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఉపయోగించనప్పుడు డబ్బు విలువ సార్వత్రికంగా పడిపోతుంది. మరొక్క విషయం: వస్తు విలువల ఉత్పత్తితో సంబంధం లేకుండా పైగా వస్తు విలువల విధ్వంసంతో కూడా డబ్బు పెరిగిన ఉదాహరణలు పేర్కొని హార్వే డబ్బు తన లక్షణాలను కోల్పోవడమే కాక తద్వ్యతిరేక లక్షణాలను కూడా సంతరించుకోవడాన్ని విమర్శనాత్మకంగా ఎత్తి చూపాడు. డబ్బు ఎందుకైతే పుట్టిందో అందుకు ఉపయోగపడక పోవడం, తద్వ్యతిరేక లక్షణాలను సంతరించుకోవడం వ్యవస్థకు ఒక పెద్ద సంక్షోభాన్ని తీసుకురాగలదని హార్వే వివరిస్తాడు.

### 3. వ్యక్తిగత ఆస్తి, పెట్టుబడిదారీ రాజ్యం

పెట్టుబడిదారీ వ్యవస్థ ఒక వ్యక్తిగత ఆస్తి వ్యవస్థ. ఇక్కడ వైరుధ్యం ఏమంటే వ్యక్తి ఆస్తిని, 'ఏదైతే అత్యధికులకు నిరాకరించబడిందో ఆ కారణంగా కొద్ది మందికి దఖలు పడిందో' ఆ వ్యక్తిగత ఆస్తి హక్కును, రాజ్యం కాపాడాలి. అయితే వ్యక్తిగత ఆస్తిని నిర్వచించడం, దానికి చట్టబద్ధ రూపం ఇవ్వడం, దానిని సామాజిక నియమంగా మార్చడం అందుకై అణచివేతను నిర్వహించడం, అందుకై పన్నులు వసూలుచేయడం అంతా సకల ప్రజల భాగస్వామ్యంతో మాత్రమే రాజ్యం చేయగలుగుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే కొద్దిమంది చేతిలో పెట్టుబడిగా మారిపోయిన ఆస్తిని నిరాస్తిపరులతో కూడుకున్న సమిష్టిపై ఆధారపడి రాజ్యం కాపాడవలసి ఉంటుంది. పెట్టుబడిదారీ వ్యవస్థకు ఈ వైరుధ్యం చివరకు పుట్టి ముంచుతుంది అంటాడు హార్వే. ప్రజలందరి రాజ్యం పెట్టుబడిదారుల ప్రైవేటు ఆస్తిని ప్రజలకు వ్యతిరేకంగా కాపాడవలసి ఉంటుందని, ఇది వైరుధ్యమని అంటాడు.

రాజ్యం ప్రజలందరిది అనుకోవడంలోనే సమస్య ఉంది. రాజ్యం బానిస వ్యవస్థలో కమ్యూనిటికీ ప్రాతినిథ్యం వహించిందని, కమ్యూనిటీ సహకారంతోనే బానిస యజమాని బానిసను అణచిపెట్టి ఉంచాడని, భూస్వామ్య వ్యవస్థలో రాజ్యానికి వివిధ ఎస్టేట్‌ల నుండి సాపేక్షమైన స్వేచ్ఛ ఉండిందని అయితే పెట్టుబడిదారీ వ్యవస్థలో రాజ్యం అటువంటి స్వేచ్ఛను కోల్పోయిందని, అది పాలక పెట్టబడిదారీ వర్గ సామాన్య ప్రయోజనాలను కాపాడే ఒక కమిటీగా దిగజార్చబడిందని మార్క్స్ విశ్లేషించి చూపాడు. సమిష్టి తరపున పనిచేస్తున్నాను అని చెప్పుకునే రాజ్యం, ఎటువంటి పక్షపాతం లేకుండా న్యాయ పాలన చేస్తానని చెప్పుకునే రాజ్యం, ఆ పేరుతో ప్రకృతి వనరులపై, ఉత్పాదక వనరులపై చివరికి మానవులందరిపై అధికారం చలాయించే రాజ్యం వస్తుగతంగా సమిష్టి సాధనం కాకపోవడంలోనే వైరుధ్యం ఉంది. ఈ అసలు విషయాన్ని డేవిడ్ హార్వే లేవనెత్తలేదు. డేవిడ్ హార్వే రాజ్యం ప్రజలందరిది కాని పెట్టుబడిదారీ వర్గం తరపున పనిచేస్తుందని అంటాడు. ఏది ఏమైనా సమిష్టితో పోషించబడుతున్న రాజ్యం సమిష్టికి వ్యతిరేకంగా వ్యష్టి ఆస్తిని (పెట్టుబడిని) కాపాడడంలో వైరుధ్యం ఉంటుందని హార్వే చెప్పిన విషయం వాస్తవమే. ఆ కారణంగానే సమష్టి రాజ్యాధికారంపై ముందువెనుకలుగా తిరగబడుతుంది. మొదటిలో ఆస్తి సమిష్టిదిగా చేయబడుతుంది తదనంతరం ఆస్తి అనే భావనే లుప్తం అవుతుంది.

### ప్రజాస్వామ్యం

అయితే డేవిడ్ హార్వే ఇదే సందర్భంలో చాలా ప్రధాన విషయం ఒకటి చెప్పాడు. డేవిడ్ హార్వే ప్రజాస్వామ్యానికి పెట్టుబడిదారీ వ్యవస్థకు 'సహజమైన సంబంధం' ఏమీ లేదంటాడు. 'ఏదేశంలోనైనా ప్రజాస్వామిక హక్కులు ఏమేరకైనా ఉన్నాయంటే దానికి కారణం ఆయాదేశాలలో జరిగే రాజకీయ పోరాటాలేనని' హార్వే అంటాడు. ఐరోపాలో, యు.ఎస్‌లో 8 గంటల పనిదినం గాని లేదా మహిళలకు ఓటు హక్కుగాని ఆయా వర్గాల పోరాటాల ద్వారానే వచ్చాయి కాని బూర్జువాలు ఉదారంగా ఈ హక్కులు కల్పించలేదనేది వాస్తవం.

పెట్టుబడిదారీ వ్యవస్థ దానికదే ఎక్కడా ప్రజాస్వామిక హక్కులు కల్పించలేదు. మన దేశంలో ప్రజాస్వామిక హక్కులు లేవు కాబట్టి ఇది పెట్టుబడిదారీ వ్యవస్థ కాదనే ఎం.ఎల్ పార్టీల నాయకత్వాలు ఈ విషయాన్ని గమనం లోనికి తీసుకుంటే మంచిది. ఇక పాఠకుడు గ్రహించాల్సిన మరొక విషయం ఏమంటే పెట్టుబడిదారీ వ్యవస్థలో రాజకీయ పోరాటాలు లేకుండా ప్రజాస్వామిక హక్కులు రావనేది ఎంత వాస్తవమో అలాగే పెట్టుబడిదారీ పూర్వ వ్యవస్థలలో ఎన్ని రాజకీయ పోరాటాలు చేసినా ప్రజాస్వామిక హక్కులు వచ్చి ఉండేవి కావనేది కూడా అంతే వాస్తవం. ఒక్క మాటలో చెప్పాలంటే పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజాస్వామ్య హక్కులకు ఒక అవకాశం ఉంటుంది. రాజకీయ పోరాటాల ద్వారానే వాటి వాస్తవీకరణ సాధ్యం అవుతుంది. పాలక వర్గ ప్రజాయోజనం దృష్ట్యా రాజ్యం ఈ ప్రజాస్వామిక హక్కులకు అనేక పరిమితులు కల్పిస్తుంది. ఒక్కొక్కసారి పూర్తిగా రద్దుచేయడమేగాక, అది ఒక ఫాసిస్టు రూపాన్ని కూడా సంతరించుకుంటుంది.

### రాజ్యాధికారాన్ని కాంట్రాక్టుకు ఇవ్వడం

పెట్టుబడిదారీ రాజ్యం గురించి హార్వే మరొక ప్రధానమైన విషయం చెప్తాడు. వివిధ దేశాలలో సెంట్రల్ బ్యాంకులకు స్వతంత్ర ప్రతిపత్తి ఉంది. ఈ గొప్ప మాటకు అర్థం ఏమంటే ఈ సెంట్రల్ బ్యాంకులు ప్రభుత్వాలు చెప్పిన మాట విననవసరం లేదు. అయితే ఈ సెంట్రల్ బ్యాంకులు అత్యధిక సందర్భాలలో వాణిజ్య బ్యాంకులకు అనుకూలమైన నిర్ణయాలను మాత్రమే తీసుకుంటాయన్నది తెలిసిన విషయమే. 2008 సంక్షోభం సందర్భంగా అమెరికన్ ఫెడరల్ బ్యాంకు వాణిజ్య బ్యాంకులకు ప్రజాధనాన్ని ఎత్తిపోసిన విషయం తెలిసిందే. సెంట్రల్ బ్యాంకు ప్రభుత్వం మాట విననవసరం లేకపోవడాన్నే డేవిడ్ హార్వే రాజ్యాధికారాన్ని కాంట్రాక్టుకు ఇవ్వడం అంటాడు. అయితే ఈ సమస్యలకు డేవిడ్ హార్వే సూచించిన పరిష్కారాలను (సంస్కరణలను) మనం విభాగం 3లో తిరస్కరించాం. ఇక్కడ తిరిగి దానిని పేర్కొన వలసిన అవసరం లేదు.

### 4. అందరికీ చెందిన సామాజిక సంపద – వ్యక్తిగత హరణం

ఈ వైరుధ్యాన్ని వివరిస్తూ డేవిడ్ హార్వే పెట్టుబడిదారీ వ్యవస్థలో చట్టబద్ధమైన దోపిడీయే కాక చట్టవిరుద్ధమైన దోపిడీ కూడా ప్రధానంగానే ఉంటుందని, చట్ట వ్యతిరేకంగా జరుగుతున్న పెట్టుబడిదారీ దోపిడీని పరిగణించకుండా పెట్టుబడిదారీ వ్యవస్థను అర్థం చేసుకోలేమని, చట్టబద్ధ, చట్టవ్యతిరేక దోపిడీల మధ్య ఒక సజీవమైన సంబంధం ఉంటుందని

వివరిస్తాడు. ఇంగ్లండ్‌లో సమూహ భూములు ఆవృతం చేయబడి విభజించబడి అమ్మకానికి పెట్టబడ్డాయని, అమెరికాను కనుగొన్న తరవాత అక్కడ బంగారం వెండి దొంగిలించబడిందని లేదా గుంజుకోబడిందని, విదేశాల వాణిజ్య పడవలు రాజ్యం మద్దతుతో దోపిడీకి గురిచేయ బడ్డాయని, భూముల ఆక్రమణ, రైతుల విస్తాపన, దొంగతనం, దోపిడీ, మోసం, కుయుక్తి వంటి విధానాలు పెట్టుబడి పుట్టుకకు కారణం మాత్రమే కాదని ఈ నాటికీ ఈ దుర్మార్గమైన మార్గాలు కొనసాగుతున్నాయని వివరించాడు. ఈనాడు భారత దేశంలో నాన్ పెర్ఫార్మింగ్ అసెట్స్ రద్దు పేరుతో కార్పొరేటు శక్తులకు లక్షల కోట్లు ప్రజాధనాన్ని ప్రభుత్వం దారాదత్తం చేస్తున్న విషయం, వేల ఎకరాల భూములు అభివృద్ధి పేరుతో వారికి కట్టబెడుతున్న విషయం మనందరికీ తెలిసిందే. కార్పొరేటు, రాజ్యం మధ్య అపవిత్రమైన సంబంధం భూమి, నీరు, ప్రకృతి వనరుల నుండి ప్రజలను విస్తాపన చేస్తూండడం వలన ప్రపంచ వ్యాప్తంగా నేడు అలజడి పరిస్థితి నెలకొని ఉందని డేవిడ్ హార్వే వివరిస్తాడు. ఈ విధంగా అందరికీ చెందిన సామాజిక సంపద వ్యక్తిగత హరణానికి లోనవుతుందంటాడు.

డేవిడ్ హార్వే కార్ల్ పోల్యానిని ఉటంకిస్తూ పెట్టుబడిదారులు తమ కార్యకలాపాలను సాగించడానికి శ్రమ, భూమి, ధనాన్ని సరుకులుగా పరిగణించవలసి ఉంటుందని అయితే అవి స్వతహాగా సరుకులు కానందున తీవ్రమైన వైరుధ్యానికి దారి పడుతుందని అంటాడు. శ్రమ శక్తి ఇతర సరుకుల లాంటిది కాదు అది సజీవమైన శ్రామికుని అంటిపెట్టుకుని ఉంటుంది. దానిని ఇతర సరుకుల వలే ఎత్తి పెట్టలేం, నిలువ ఉంచలేం, రవాణా చేయలేం. ఇక భూమి విషయానికి వస్తే భూమి మానవ శ్రమతో ఉత్పత్తి అయినది కాదు. కాని దానిని కూడా పెట్టుబడి సరుకుగా పరిగణిస్తుంది. అలాగే డబ్బుకు మారకపు విలువేగాని ఉపయోగపు విలువ లేదు. అన్ని సరుకులకు ఉపయోగపు విలువ ఉంటుంది. కాని ఉపయోగపు విలువ లేని డబ్బును పెట్టుబడి సరుకుగా భావిస్తుంది.

శ్రమ, భూమి, ధనం ఎక్కడైతే సరుకులుగా మార్చబడతాయో అక్కడ సూర్యుని కింద ఉన్న ప్రతీదీ కూడా సరుకుగా భావించబడు తుందంటాడు హార్వే. పెట్టుబడి నిర్మించే మొత్తం రాజకీయ, ఆర్థిక కట్టడానికి భూమి, శ్రమ, పెట్టుబడి సరుకులుగా మార్చబడడం, ప్రైవేటీకరించబడడం పునాదిగా ఉంటుందని, అది చట్టవ్యతిరేక కార్యకలాపాలకు అనివార్యంగా ఆశ్రయం ఇస్తుందంటాడు డేవిడ్ హార్వే.

**5. పెట్టుబడి, శ్రమల మధ్య వైరుధ్యం**

పెట్టుబడి శ్రమల వైరుధ్యం గురించి పాఠకుడికి తెలుసు. అంతేకాక విభాగం ఐదులో మనం కొన్ని వివరాలు చూసాము. డేవిడ్ హార్వే ప్రతిపాదిస్తున్న విషయాలలో ప్రధానమైన దేమంటే శ్రమ దోపిడీని అరికట్టినంత మాత్రాన సమస్య పరిష్కారం కాదని, డబ్బుకు సామాజిక శ్రమ ఉత్పాదితాలను స్వాయత్తం చేసుకునే శక్తిని తొలగించకపోతే అంటే ఉపయోగపు విలువ, మారకపు విలువల వైరుధ్యాన్ని తొలగించక పోయినట్లైతే పెట్టుబడి ÷ శ్రమ అనే వైరుధ్యం తిరిగి తలెత్తుతుందని ఈ వైరుధ్యాలు పరస్పరం పునరుద్ధరించుకోగలవని రచయిత అంటాడు. అది వాస్తవమే. అయితే శ్రమ దోపిడీ అంతం కావాలంటే కార్మిక వర్గ రాజ్యం ఏర్పడాలి. కార్మిక వర్గ రాజ్యంలో వేయబడిన పన్నులు దోపిడీ అని నిర్వచించబడకపోతే శ్రమ దోపిడీ త్వరగా అంతం చేయబడుతుంది. శ్రమకు తగ్గ వేతనం అనే సామ్యవాద సిద్ధాంతం అమలు జరుగుతుంది. కాని వస్తు సేవలు మారకపు విలువ నుంచి విముక్తి పొందాలంటే సమసమాజం ఏర్పడాలి. ప్రతి ఒక్కరు తమ శక్తి మేరకు, ప్రతి ఒక్కరికి వారి అవసరం మేరకు అనే నియమం ఉనికి లోనికి రావాలి. ఇందుకు ఉత్పత్తి శక్తులు బాగా అభివృద్ధిచెందాలి. ఈ వైరుధ్యాలు పరస్పరాధారంగా అభివృద్ధి చెందుతాయనే హార్వే ప్రతిపాదనను అంగీకరిస్తూనే అన్నింటిని ఒకేసారి పరిష్కరించడం సాధ్యం కాదనే విషయాన్ని హార్వే గుర్తించలేదని కనీసం ఆ విషయాన్ని ప్రత్యేకంగా పరిశీలించలేదని ఇక్కడ మనం నమోదుచేద్దాం.

డేవిడ్ హార్వే పెట్టుబడి, శ్రమ మధ్య ఉన్న వైరుధ్యం ఇతర వైరుధ్యాలకు మూలం అనే అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తాడు. అది అన్నింటికంటే ప్రధానమైనదే కాని దాని పరిష్కారాన్ని విడిగా సాధించలేమని అంటాడు. పెట్టుబడి, శ్రమ వైరుధ్యం ప్రధానమైనదే అయినా అది జాతి (రేస్), ఎత్నిసిటీ, లింగపరమైన, మతపరమైన వివక్షల ద్వారానే ప్రదర్శిత మవుతుందని వాటితో ముడిపడి ఉంటుందని రెండింటిని వేరువేరుగా చూడలేమని హార్వే అంటాడు. వర్గ పోరాటాలను వివక్షలకు వ్యతిరేక పోరాటాలను జమిలిగా నిర్వహించవలసి ఉంటుందంటాడు. అంతవరకు బాగానే ఉంది. అయితే వర్గ దోపిడీని కొనసాగించడానికే పెట్టుబడి సామాజిక అణచివేతలను సాధనంగా వాడుకుంటుందన్న అవగాహన లేకపోతే రెండింటిని ఒక్కగాటనే కడితే అంతా గందరగోళంగానే ఉంటుంది. అయితే ఏదేని దేశంలో ఒకానొక చారిత్రక పరిస్థితిలో ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో పెట్టుబడికి ఒక పాత్ర ఉన్నప్పుడు అంటే దానికి కొంత స్పేస్ ఉన్నప్పుడు లేదా పెట్టుబడి ఒకానొక స్టేబిలైజేషన్ దశలో ఉన్నప్పుడు వర్గపోరాటానికి తక్కువ అవకాశాలు, సామాజిక పోరాటాలకు ఎక్కువ అవకాశాలు ఉండే స్థితి ఉండవచ్చు. పెట్టుబడి అందరికీ తిండీ, బట్ట, వసతి వంటి కనీస అవసరాలు తీర్చే పరిస్థితులలో మరిన్ని ఆర్థిక పోరాటాలకంటే సామాజిక అణచివేతలకు వ్యతిరేక పోరాటాలు ప్రాధాన్యత వహించవచ్చు. ఈ విధంగా స్థలకాలాలను బట్టి రెండు పోరాటాల ప్రాధాన్యతలలో తారతమ్యాలు ఉండవచ్చు. అయినా అన్ని అసమానతలు పుట్టడానికి పెరగడానికి, కొనసాగడానికి వర్గ అసమానతలే కారణం అనే అవగాహన ఉండాలి. డేవిడ్ హార్వే రచనలో ఇటువంటి అవగాహన ఎక్కడా కనపడదు.

**6. పెట్టుబడి ఒక ప్రక్రియనా లేకా ఒకానొక ఘటక స్థితియా**

పెట్టుబడి ధన రూపంలో ప్రారంభం అయి, ఉత్పత్తి కారకాలుగా మారి ఉత్పత్తి ప్రక్రియలో వివిధ రూపాలు పొందుతూ తయారైన సరుకులుగా మారి తిరిగి ధనంగా, కొంత ఎక్కువ ధనంగా మారుతుంది. దీనినే మనం మనీ – కమోడిటీ – మనీ (ఎం – సి – ఎం) గా చెప్తాం. మరల ఈ డబ్బు ఉత్పత్తి కారకాలుగా మారాలి. ఈ చలనం కొనసాగుతూ ఉండాలి. ఎక్కడైనా ఆగిపోతే పెట్టుబడి మృత పెట్టుబడి అవుతుంది అన్న విషయం మనకు తెలిసిందే. అంతేకాదు టర్నోవర్ కాలం ఎంత తక్కువగా ఉంటే లాభం రేటు అంత ఎక్కువగా ఉంటుందని కూడా

మనకు తెలుసు. ఒక పరిశ్రమ మూడు షిఫ్టులు పనిచేస్తే టర్నోవర్ కాలం మూడు రెట్లు పెరుగుతుంది. టర్నోవర్ కాలాన్ని తగ్గించడాన్నే పెట్టుబడి వేగం పెంచడంగా కూడా చెప్పవచ్చు. అయితే పెట్టుబడిలో క్యాపిటల్ ఇన్‌టెన్సిఫికేషన్ పెరుగుతుందని ఫలితంగా స్థిర, టర్నోవర్ పెట్టుబడిలో స్థిర పెట్టుబడి శాతం పెరుగుతూ లాభాల రేటు పడిపోతుందని చెప్తాడు.

పెట్టుబడిలో స్థిర పెట్టుబడి పెరగడమే కాక స్థిర పెట్టుబడిలో స్థావర పెట్టుబడి పెరగడం కూడా ఒక పెద్ద వైరుధ్యాన్ని సృష్టిస్తుందని అంటాడు. పరిశ్రమ పెట్టిన కొంత కాలం తరువాత ఆ భౌగోళిక ప్రాంతం లాభదాయకంగా లేకపోతే పరిశ్రమను మార్చవలసి వస్తే స్థావర పెట్టుబడిని వదులు కోవలసి వస్తుందని, కొన్ని మార్లు పరిశ్రమ ఆధునీకరణలో భాగంగా పనిచేస్తున్న యంత్రాలను కూడా తొలగించవలసి వస్తుందని ఇదంతా పెట్టుబడిని చలన స్థితినుంచి కదలిక లేని స్థితికి నెట్టివేయడంగానే పరిగణించవచ్చని అంటాడు. స్థావర పెట్టుబడి పెద్ద ఎత్తున విధ్యంసం జరిగిన డెట్రాయిట్ నగరాన్ని ఉదాహరణగా చూపిస్తాడు. అంతేకాదు, కాలం ముందుకు పోతున్నకొద్దీ స్థావర పెట్టుబడి శాతం పెరుగుతుందని కూడా చూపిస్తాడు. పెట్టుబడికి చలనం కావాలి కాని అందుకు విరుద్ధంగా స్థావరత్వం పెరుగుతుంది అంటాడు. ఈ వైరుధ్యాన్ని పెట్టుబడి వ్యవస్థ నిలువరించుకోవడం కష్టం అంటాడు.

పారిశ్రామిక వేత్తకు అప్పు ఇచ్చే ఫైనాన్సియర్లు, సరుకులు అమ్మిపెట్టే అమజాన్ వంటి కంపెనీలు లాభాలలో అధికాధిక వాటా తన్నుకుపోతున్నాయని డేవిడ్ హార్వే వాపోతాడు. ఈ విషయాన్ని విభాగం 6లో వివరంగా పరిశీలించాం. ఇక డేవిడ్ హార్వే ఇచ్చే పరిష్కారాలు మనకు పరిష్కారాలుగా కనిపించలేదని కూడా మనం 6వ భాగంలో వివరించుకున్నాం. ఏది ఏమైనా స్థిర, టర్నోవర్ పెట్టుబడిలో స్థిర పెట్టుబడి శాతం పెరగడం అందులోనూ స్థావర పెట్టుబడి శాతం పెరగడం పెట్టుబడికి ఒక తీవ్రమైన సమస్యగా పరిణమిస్తుందన్న విషయం అంగీకరించవలసిందే.

**7. లాభం ఉత్పత్తి, దాని వాస్తవీకరణ**

వివిధ అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకు విదేశీ మార్కెట్లు పరిమితంగా ఉన్న స్థితి, ఇంకా అమెరికా విషయం తీసుకుంటే దాని ఎగుమతుల కంటే దిగుమతులు ఎక్కువగా ఉన్నాయి. ఎగుమతి అవకాశాలు లేనప్పుడు ఒక దేశంలో పెట్టుబడిదారీ వర్గం తాను ఉత్పత్తి చేసిన సరుకులను తమ దేశ ప్రజలకే అమ్ముకోవాలి. ఈ పరిస్థితులలోనే రియలైజేషన్ సమస్య వస్తుంది.

అమెరికా వంటి అభివృద్ధి చెందిన దేశాలలో పెట్టుబడిదారులు, ప్రభుత్వ ఉద్యోగులు, కార్మికుల మాత్రమే ఉంటారు. పెట్టుబడిదారులు ఉపయోగించే క్యాపిటల్ గూడ్స్, లగ్జరీ గూడ్స్ మొత్తం ఉత్పత్తి అయిన సరుకులలో తక్కువగానే ఉంటాయి. ప్రభుత్వ ఉద్యోగుల కొనుగోలు శక్తి పెంచాలంటే జీతాలు పెంచాలి. అందుకు పన్నులు పెంచాలి అంటే కార్పొరేటు లాభాలపైన అయినా కోత పెట్టాలి లేదా కార్మికుల కొనుగోలు శక్తిపైన అయినా కోత పెట్టాలి. కాబట్టి ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు పెంచడం సరుకులు అమ్ముకోలేని సమస్యకు పరిష్కారం కాదు. మిగిలింది కార్మిక వర్గమే. పెట్టుబడిదారులు తమ ఉత్పత్తులను తమ దేశ ప్రజలకు అందునా కార్మికులకు మాత్రమే అమ్ముకోవాలి. ఇదే వారికి వచ్చినపెద్ద కష్టం. ఈ సమస్యను డేవిడ్ హార్వే వివరిస్తాడు.

డేవిడ్ హార్వే చెక్‌పోస్టు 1, చెక్ పోస్టు 2 అన్న భావనలను ఇక్కడ ప్రతిపాదించాడు. అదనపు విలువ, సరుకు ఉత్పత్తి అయ్యేది పరిశ్రమలో దీనినే చెక్ పోస్టు 1 అని, సరుకు అమ్ముడు పోయి అదనపు విలువ లాభంగా చేతికి వచ్చే మార్కెట్‌ను చెక్‌పోస్టు 2 అని డేవిడ్ హార్వే అంటాడు. లాభానికి అదనపు విలువయే ఆధారం. కార్మికుల వేతనాలు తగ్గిస్తే చెక్‌పోస్టు 1 వద్ద అనుకూల పరిస్థితి ఉంటుంది. కాని వేతనాలు తగ్గడం వలన కార్మికుల కొనుగోలు శక్తి తగ్గుతుంది. వారు చెక్ పోస్టు 2 వద్ద సరుకులు కొనలేరు. అంటే సరుకు అమ్ముడు పోదు, అదనపు విలువ లాభంగా మారదు. సరుకు అమ్ముడు పోవాలంటే కార్మికుల వేతనాలు పెంచాలి. కార్మికుల వేతనాలు పెంచితే లాభాలు సహజంగానే పడిపోతాయి. పరిశ్రమలో లాభం ఉత్పత్తి అవుతుంది కాగా, మార్కెట్‌లో అది వాస్తవీకరణ పొందుతుంది. లాభం ఉత్పత్తిపై దృష్టి పెడితే వాస్తవీకరణకు ఆటంకం ఏర్పడుతుంది. వాస్తవీరకణ సాధించాలంటే లాభం ఉత్పత్తినే తగ్గించుకోవలసి వస్తుంది. దీనినే లాభం ఉత్పత్తి, వాస్తవీకరణలకు మధ్య ఉన్న వైరుధ్యపూరిత ఐక్యత అని హార్వే అంటాడు. మనం దీనిని వైరుధ్యం అంటాం. దీనికి విప్లవం పరిష్కారం అంటాం. కాని డేవిడ్ హార్వే దీనిని ఐక్యత అంటాడు. ఐక్యతకు వైరుధ్యాన్ని విశేషణంగా చేరుస్తాడు. హార్వే తరువాత అడుగులను చూద్దాం.

'ఉత్పత్తికి, దాని వాస్తవీకరణకు మధ్య ఉన్న వైరుధ్యపూరితమైన ఐక్యత కార్మికుల తలరాతకు ఎంత వరకు వర్తిస్తుందో పెట్టుబడికీ అంతవరకూ వర్తిస్తుందంటాడు హార్వే. అలాగే, ఈ పరిస్థితి నుంచి చేయదగ్గ తార్కికమైన నిర్ధారణ ఏమంటే జీవితం, కార్యాచరణల వ్యాప్తంగా వర్గ వైరుధ్య, వర్గ పోరాటాల మధ్య ఆవశ్యకంగా ఒకానొక వైరుధ్యపూరితమైన ఐక్యత ఉందని నిర్ధారణ చేస్తాడు.

ఈ మాటను పైపైన చూసినప్పుడు ఒక గతితార్కిక వ్యక్తీకరణగా కనిపిస్తుంది. కాని ఎంతమాత్రం కాదు. ఈ మాటను మనం ఏడవ అధ్యాయంలో వివరంగా పరిశీలించాము. క్లుప్తంగా చెప్పుకోవాలంటే, మనం ఎక్కడైతే ఆవశ్యకమైన వైరుధ్యాన్ని చూస్తున్నామో హార్వే అక్కడ ఆవశ్యకమైన ఐక్యత చూస్తున్నాడు. మనమెక్కడైతే పెట్టుబడి, శ్రమల తెగతెంపులు చూస్తున్నామో హార్వే అక్కడ రెండు వర్గాలకు ఒకే తల రాత రాస్తున్నాడు.

హార్వేని అంగీకరించడం కష్టం. హార్వే రచనను పరిచయం చేయడం కూడా అధికాధికంగా అసాధ్యమవుతున్నది. కాబట్టే మిగిలిన పది వైరుధ్యాలను పరిచయం చేసే పనిని నేను విరమించుకున్నాను. ఇక, డేవిడ్ హార్వే అనేక ప్రశ్నలు లేవనెత్తాడు. నేను కూడా వాటిని ముందు ఉన్న ఏడు విభాగాలలో వివరించడానికి ప్రయత్నించాను. ఈ ఏడు విభాగాలలో చర్చ సారాంశాన్ని ఈ చివరి సంగ్రహ వ్యాఖ్యలో వ్రాద్దామని ప్రారంభించినా అలా సాధ్యపడలేదు. ఈ సంగ్రహ వ్యాఖ్య మొదటి ఏడు విభాగాలకు ప్రత్యామ్నాయం కాజాలదు.

*(అయిపోయింది)*

*(కన్వీనర్, ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

# డిసెంబ్రిస్ట్ సైనిక తిరుగుబాటు పరిణామాలు - 6

***జారిజం మీద 1825 డిసెంబర్‌లో జరిగిన తిరుగుబాటు రెండు వందల సంవత్సరాల తర్వాత కూడా ప్రభావం చూపుతున్నదంటున్నారు* ఎన్.వి.యస్. నాగభూషణ్**

*(గత సంచిక తరువాయి)*

**2) రక్షక సంఘం (యూనియన్ సాల్వేషన్)**

1816 ఫిబ్రవరి 9న (పాత కేలండర్ ప్రకారం) అలెగ్జాండర్ మురావియేవ్, నికితా మురావియేవ్, రాకుమారుడు సెర్గీ(త్రు చెత్స్కోయ్, ఇవాన్ యాకూష్కిన్, మత్వేయ్ మురావియేవ్, అపోస్తోల్, సెర్గీ మురావియేవ్, అపోస్తోల్ అనేవారు, 'రక్షక సంఘం' అనే పేరుతో మొట్ట మొదటి రహస్య రాజకీయ సంస్థను ఏర్పాటు చేశారు. ఈ సొసైటీకి మరో పేరు కూడా ఉంది. దాని పేరు 'పితృభూమి నిజమైన విధేయత కలిగిన పుత్రుల సొసైటీ' అని. ఈ సంఘం స్థాపకులంతా గార్డు ఆఫీసర్లు, ఉన్నత ప్రభువర్గం వారు. ఈ సంస్థ సభ్యులంతా అప్పటి నుండి క్రమం తప్పకుండా మురావియేవ్ ఇంట్లో కలుసుకోవడం మొదలెట్టారు. ఈ అధికారులు మొత్తం ఆరుగురిలోనూ నలుగురు సెమినోవ్‌స్కీ రెజిమెంటుకు చెందినవారే కావడం గమనార్హం! కొత్త యువ అధికారులు మరింత వచ్చి చేరుతుండడంతో అనతి కాలంలోనే సొసైటీ పెద్దగా ఎదగసాగింది. డిసెంబ్రిస్టు ఉద్యమం మొత్తానికీ సైద్ధాంతికంగా, క్రియాశీలంగా గొప్ప కృషిచేసి, ఉద్యమం అంతటికీ నాయకత్వ పాత్ర వహించిన పావెల్ పెస్తెల్ ఇలా కొత్తగా వచ్చిన వారిలో ఒకడు. త్వరగానే పెస్తెల్ ఈ గ్రూపుకి నాయకుడయ్యాడు. ఈ గ్రూపు ఆ రోజు ఏ లక్ష్యాలను పెట్టుకుందో వాటిని తెలిపే గట్టి ఆధారాలు లభించలేదు గానీ, వాటిలో రాజ్యాంగానికి సంబంధించిన అంశం ఏదీ ఉన్నదనేందుకు ఏ తార్కాణమూ దొరకలేదు.

ఈ సంఘం సభ్యులు కలిసినప్పుడల్లా సొసైటీ లక్ష్యాలుగా నైతిక, విద్యా పరమైన వాటిని ఎన్నుకోవడంలో ఏకీభావం చూపారు గానీ, కొద్ది కాలంలోనే యూనియన్ రెండు శిబిరాలుగా విడిపోవడానికి కారణం రాజకీయ కార్యక్రమమే అని చెప్పాలి. చాలా మంది సభ్యులు ప్రాధాన్యతనిచ్చింది ఉదారవాదానికి. చాలా మంది సభ్యులు రాజ్యాంగాన్ని కావాలని కోరారు గానీ, ఆ రాజ్యాంగం అంతగా విప్లవాంశ కలిగినది కాక, మధ్యస్థంగా ఉండేది, అదీగాక ఆ రాజ్యాంగం, రాజరిక సహితమైనదానినే, దీన్ని కూడా విప్లవ పద్ధతుల ద్వారా సాధించడం గాక, శాంతియుత చట్టబద్ధమైన పద్ధతుల ద్వారానే సాధించేదిగా ఉండాలని. అయితే మైనారిటీ సభ్యులు పెస్తెల్ నాయకత్వంలో విప్లవ పద్ధతులు కావాలని కోరారు. అయితే తమ సంస్థ చిన్నదైనందున, సంస్థ అంతర్గతంగా ఒక మైనారిటీ గ్రూపును కొనసాగిస్తూ మనుగడ సాగించడం వీలుకాదని భావించడంతో 1817 అంత్యకాలంలోనే యూనియన్‌ని రద్దు చేశారు. అయితే సంఘాన్ని తిరిగి పనిచేయించడానికి గట్టి ప్రయత్నం జరిగింది. చివరికి ఒక కార్యక్రమ ప్రణాళిక కోసం ఒక ప్రత్యేక కమిటీని ఎన్నుకొని, దానికి తాము కోరుకునే కార్యాచరణ ప్రణాళిక రచించడానికి అధికారాన్ని ఇచ్చారు. 1817 ఫిబ్రవరిలో ఆ ప్రత్యేక కమిటీ ప్రణాళిక రచనను పూర్తి చేసింది.

అయితే ఇందులో విప్లవ పద్ధతి అధికంగా ఉండడంతో ఒక గ్రూపు 'యాకూష్కిన్' నాయకత్వంలో ఈ కార్యక్రమ ప్రణాళికను తిరస్కరిస్తూ అటు మరీ తీవ్రవాదంగానూ, ఇటు మరీ మితవాదంగానూ కాకుండా, మధ్యస్థంగా ఉండే పద్ధతి అనుసరించాలనీ, ప్రజల మీద ప్రభావాన్ని నెరపుతూ పనిచేయాలనీ, అంతేతప్ప ఇలా విప్లవ పద్ధతిలో ఉండకూడదని వాదించింది. దీంతో ఈ సంఘం వారు ఒక 'మాదిరి' (మోడల్) కోసం జర్మనీలో గల ఒక మిత్రుని సహాయంతో ప్రష్యన్ విప్లవ సంస్థ అయిన 'తుగెన్డ్‌బండ్' ప్రణాళికను తెప్పించుకుని దాన్ని అధ్యయనం చేశారు. అటు తర్వాత ఆ ప్రణాళికకు కొన్ని మార్పులూ, చేర్పులూ చేసి 'సంక్షేమ సంఘం ప్రణాళిక' అని పేరు పెట్టారు. ఇది ఆకుపచ్చ రంగులో బైండు చేసి ఉండడం వల్ల దీన్ని 'ఆకుపచ్చ పుస్తకం' అనే పేరు కూడా ఉంది. ఈ ఆకుపచ్చ పుస్తకాన్ని సొసైటీ ఎప్పుడైతే తన నిబంధనల పత్రంగా ప్రకటించుకున్నదో అప్పట్నుంచీ ఈ సంఘం పేరు 'సంక్షేమ సంఘం'గా మారిపోయింది.

(నెపోలియన్ ప్రష్యాను 'జేనా-ఔర్‌స్టెడ్' యుద్ధంలో ఓడించాక, 1808లో ప్రష్యాలో స్థాపించబడిన విప్లవ సంస్థకు 'తుగెడ్ బండ్' అని పేరు పెట్టుకుని కార్యకలాపాలు సాగించారు. దీనికే 'నీతిపరుల సంఘం' అనే పేరు కూడా ఉంది. ప్రష్యన్‌లలో వారి జాతీయ తత్వాన్నీ, దేశభక్తినీ ప్రేరేపించేందుకు గాను 'కోనింగ్ బర్గ్'లో ఒక అర్థ - మాసోనిక్ లాడ్జి తరహాలో ఈ రహస్య విప్లవ సంస్థను ఏర్పరుచుకున్నారు - రచ.)

**3) సంక్షేమ సంఘం (యూనియన్ ఆఫ్ వెల్ఫేర్)**

కొత్త నిబంధనలు రాయడం పూర్తయ్యాక (గ్రీన్ బుక్) రక్షక సంఘాన్ని (యూనియన్ ఆఫ్ సెల్వేషన్) వదిలేసిన ఎక్కువ మంది సభ్యులు, 1818లో 'సంక్షేమ సంఘం' (యూనియన్ ఆఫ్ వెల్ఫేర్)ను ఏర్పాటు చేసుకున్నారు. ఇది 1821 దాకా పనిచేసింది. మొదట్లో ఇది మధ్యస్థమైన నైతిక, సాంఘిక లక్ష్యాలనే కలిగి ఉండేది. అవి దయాభావం, విద్య, సాయం, దేశ ఆర్థికం, బానిసలకు స్వేచ్ఛనివ్వడం విషయంలో ఈ ప్రణాళిక తన సభ్యులకు నిర్దేశించేది ఏమంటే, బానిసల యెడ దయగా ఉండమనడం వరకే. ఈ మొత్తం సమస్యను అది వ్యక్తిగత ఇష్టా ఇష్టాలకే వదిలేసింది. ఆనాటి ఈ గ్రంథాన్ని చదివినవారికి, ఆ ఆకుపచ్చ గ్రంథం యెడ ఒక

సాధారణమైన అభిప్రాయమే కలుగుతుంది, సాంప్రదాయికమైన సామాజిక దృష్టిని మాత్రమే ఆ గ్రంథం కలిగి ఉన్నదన్న భావం. దీని దృష్టి అతి సంకుచిత మైనదే. అదే సమయంలో మరొక అభిప్రాయం కూడా కొందరు వ్యక్తం చేస్తున్నారు. అదేమిటంటే, ఈ గ్రంథం సంక్షేమ సంఘం లక్ష్యాలలో ఒక చిన్న భాగం మాత్రమే అని. దాని సభ్యులు దాని రెండో భాగాన్ని కూడా రాయడానికి ప్రణాళిక వేసుకున్నారనీ, అందులో వారి రాజకీయ లక్ష్యాలు బహిర్గతమవుతాయనీ ఆ కొందరి వాదన. వారి వాదన సంగతి ఎలా ఉన్నా గానీ, వారనుకునే ఆ రెండో భాగం మాత్రం ఎక్కడా లభ్యం కానందున, ఆ రెండో భాగాన్ని వారసులు రాశారా అనే సందేహం వస్తోంది. ఒకవేళ గనుక ఏదైనా రెండో భాగం పేర రాసినా గానీ అది చిత్తు ప్రతిగానే ఉండి ఉంటుందని కూడా అనుకోవచ్చు.

వాస్తవాలు ఎలా ఉన్నప్పటికీ, ఆకుపచ్చ గ్రంథంలో రాజకీయ స్వభావంపై ఎలాంటి అంశాలూ లేవు. అయితే ఆ సంఘం ఉద్దేశించిన ప్రధాన ప్రయోజనం అందిరికీ తెలిసిందే. నిరంకుశాధికారాన్ని అడ్డుకోవాలనే! అలాగే బానిసలకు స్వేచ్ఛ కల్పించాలనే. రాజకీయ, సామాజిక, ఆర్థిక, న్యాయ సంస్కరణలు అమలు చేయాలనే. సంక్షేమ సంఘం అనేక శాఖలు కలిగి ఉంది – సెయింట్ పీటర్స్ బర్గ్, మాస్కో తుల్‌చిన్, కిషినెవ్ (ఇది మాల్దోవ రాజధాని), తాంబొవ్, నీఝ్ని – నొవొగొరోద్, ఇంకా ఇతర ప్రాంతీయ నగరాలు, రష్యన్ సామ్రాజ్యంలో గల వాటిలో. ఉదార, మానవతా పరమైన లక్ష్యాలు కలిగి ఉన్నందుకు ఈ సంఘం అందుకు అనుగుణంగా ఆలోచించే వారిని పెద్ద సంఖ్యలో ఆకర్షించగలిగింది. ఆ సంఖ్య సుమారు 200 మంది దాకా ఉండవచ్చు. వీరిలో అధిక సంఖ్యాకులు ప్రభు వంశాల వారూ లేదా ఉన్నత స్థాయి సామాజిక స్థితిగలవారూ.

**4) ఉత్తరాది, దక్షిణాది సొసైటీల ఎదుగుదల**

బాగా ఆలోచించి, కుదించి, అందరికీ ఆమోదకరంగా ఉన్న లక్ష్యాలలో ఒకటైన రాజ్యాంగ సంస్థలో త్వరలోనే సైద్ధాంతిక పోరాటానికి తెరతీసింది. ఉత్తరాది ప్రాంతాల్లో మెజారిటీ సభ్యులు ఆకుపచ్చ పుస్తకంలోని లక్ష్యాల పట్ల, సిద్ధాంతాల పట్ల సంతృప్తిగానే ఉన్నారు. అయినప్పటికీ దక్షిణాదిలో మాత్రం పరిస్థితి పూర్తి భిన్నంగా ఉంది. 1818లో పెస్తెల్ సొసైటీ సైన్యంలోకి తీసుకోబడ్డాడు. ఆ సొసైటీ 'తుల్‌చిన్'లో ఉన్నది. ప్రస్తుతం ఈ తుల్‌చిన్ ఉక్రేన్‌లో దక్షిణ ప్రాంతం అయిన 'విన్నిట్సియా'లో ఉంది. (సొసైటీలోకి ఎవరినిబడితే వారిని, వచ్చిన వారందరినీ చేర్చుకోరు. వారిని సంస్థ బాధ్యుడైన వ్యక్తి, ఇతర ఏ ఒక్క సంస్థ స్థానిక సభ్యుని చేతనైనా సిఫార్సు చేయబడినప్పుడు, లక్ష్యాలకనుగుణంగా నిబంధనలను అంగీకరించినప్పుడు అతణ్ణి పరీక్షించి మరీ చేర్చుకుంటాడు – రచ.) పెస్తెల్ సంస్థలో చేరిన దాదిగా – దక్షిణాది విభాగాన్ని నిర్వహించడం మొదలెట్టాడు. తన విప్లవాత్మక భావాలు ఎలా ఉన్నప్పటికీ, పెస్తెల్ ఆకుపచ్చ గ్రంథంలోని పద్ధతుల్ని స్వీకరిస్తూనే, వాస్తవానుగుణమైన విధానాలతో, కొన్ని విషయాలలో అమాయకంగా ఉండే అంశాల పట్ల జాగ్రత్తలు తీసుకునేవాడు. ఉదాహరణకు సంఘ సభ్యుల్ని నిరంకుశ ప్రభుత్వం నిర్బంధించినప్పుడు ఏం చేయాలన్న విషయంలో సంఘం అప్పటివరకూ ఎలాంటి సూచన చెప్పలేదు.

కొద్ది కాలంలోనే ఉత్తరాది సొసైటీలో పలువురు ముఖ్యమైన సభ్యుల్ని సొసైటీ కోల్పోయింది. దాంతో అలెగ్జాండర్ మురావియేవ్ సంఘాన్ని నిలిపివేశాడు. రాకుమారుడు సెర్గీత్రుబెత్స్కోయ్ తన జబ్బు నయం చేయించుకోవడం కోసం విదేశాలకు వెళ్లాడు. అప్పటికే కొంతమందిని సొసైటీ కోల్పోవడం సంఘాన్ని బలహీనం చేసింది. (వారిని ఎలా కోల్పోయిందీ వివరాలు లభ్యం కాలేదు. వారిని ప్రభుత్వం అరెస్టు చేసి చంపేసిందా, లేక వారు సంఘంలో పనిచేయడం కష్టంగా భావించి సంఘానికి దూరంగా ఉన్నారా అనే వివరాలు తెలీడం లేదు. సంఘం నుండి పలువురు తప్పుకున్న వివరాలు కొన్ని లభ్యమవుతున్నాయి గానీ, అరెస్టుల సంగతి గానీ, అరెస్టు అయిన వారిని ఏం చేశారన్న వివరాలు గానీ లభ్యం కావడం లేదు – రచ.) దాంతో మిగిలిన సభ్యులకు యూనియన్‌ని నిర్వహించే నైపుణ్యాలు కొరవడి, ప్రగతి సాధించడం అనేది అసాధ్యంగా మారింది. అలాగే సంఘం ఇతర శాఖలైన నీఝ్ని – నొవొగొరోద్, తాంబోవ్, స్మోలెన్స్, పొల్తావాలపై పై విధంగానే దాడులు జరిగి, పైలాంటి ఆందోళనకర పరిస్థితులే ఏర్పడ్డాయి.

ఇలాంటి సమయంలో పావెల్ పెస్తెల్ లోతుగా, జాగ్రత్తగా సెయింట్ పీటర్స్ బర్గ్ భౌతిక పరిస్థితుల్ని పరిశీలించి, ఆ నగరమే తిరుగుబాటు జరగడానికి అత్యంత అనుకూల భౌగోళిక స్థితివున్న చోటుగా గుర్తించాడు. అంచేత అక్కడున్న ఉత్తరాది సొసైటీలో సంభవించిన నష్టం వల్ల, అప్పటి దాకా వివిధ కార్యక్రమాల ద్వారా సాధించిందంతా బలహీనమైపోయే ప్రమాదముందని విచారించాడు. ఈ ప్రమాదకరమైన అంశాన్ని గుర్తించడంతో అతడు 1819లో సెయింట్ పీటర్స్ బర్గ్ నగరాన్ని సందర్శించాడు. అయినప్పటికీ అతడు స్థానిక నాయకుల చేత మరింత తీవ్ర విప్లవకరమైన రాజకీయ కార్యక్రమాన్నీ, చర్యల్నీ అంగీకరింప చేయడంలో అశక్తుడయ్యాడు.

అంతర్గత విభేదాలను పరిష్కరించుకునేందుకూ, ప్రభుత్వ ఒత్తిడిని నిరోధించేందుకు తీసుకోవలసిన చర్యల గురించి చర్చించేందుకూ, సంఘం అన్ని శాఖలతోనూ కలిసి ఒక సాధారణ మహా సభను నిర్వహించ తలపెట్టింది. దాంతో మాస్కో బృందం చొరవ తీసుకొని, మహా సభను నిర్వహించేందుకు ముందుకొచ్చి 1821 జనవరిలో మాస్కోలోని ఫాన్ విజన్ ఇంటి వద్దకు చేరారు.

అయితే మహాసభ సంగతిని సంస్థ సభ్యుడే అయిన మిహాయిల్ గ్రిబోవ్‌స్కీ అనే అతడు ద్రోహిగా మారి, ప్రభుత్వానికి సమాచారం అందించడంతో ప్రభుత్వం అప్రమత్తమైంది. ఈ విషయమంతా తెలిసిన సంస్థ ప్రతినిధుల స్నేహితులు సమావేశ స్థలం వద్దకు హెచ్చరికను పంపించి, సంస్థ సభ్యుల ప్రతిచర్యనూ ప్రభుత్వం గమనిస్తూనే ఉన్నదని తెలిపారు. దాంతో ఆ మరుసటి రోజున ప్రతినిధులు ఒక ఉత్తిత్తి తీర్మానాన్ని ప్రభుత్వం కళ్లు కప్పేందుకు, సంస్థకు భారంగా ఉన్న సభ్యుల్ని కూడా తప్పుదారి పట్టించేందుకూ, సంస్థను రద్దు చేస్తున్నట్లు తెలిపే తీర్మానాన్ని ఆమోదించారు.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రష్యన్ విప్లవాల, లెనిన్ జీవిత చరిత్ర పరిశోధకుడు, సాహిత్యకారుడు, విమర్శకుడు)*

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 120 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| మార్క్స్ రాసిన పెట్టుబడి | డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ | 200 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |
| మానని గాయాలు | తెలంగాణ విద్యావంతుల వేదిక | 100 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |
| శాస్త్రీయ విద్యా విధానం | ఆకుల భూమయ్య | 30 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| జెండర్ కులం | ఉమా చక్రవర్తి | 150 |
| బొజ్జా తారకం నీలిజెండా వ్యాసాలు | హెచ్.బి.టి | 250 |
| ఇది రిజర్వేషన్ల దేశం | బొజ్జా తారకం | 150 |
| అంటరాని తనం ఇంకానా? | బొజ్జా తారకం | 50 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |
| వెలివాడల వెతలు | కుల నిర్మూలన ప్రచురణ | 100 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| గోదావరి వచ్చినపుడు | ఆర్. ఉమామహేశ్వరి | 280 |
| హైదరాబాద్ స్వాతంత్ర్య సంరంభం | ఎన్. వేణుగోపాల్ | 25 |
| పద్య సాహిత్యం:సంఘ చరిత్ర | బూదరాజు రామకృష్ణ | 25 |
| నగరంలో కర్ఫ్యూ | మలుపు ప్రచురణ | 75 |
| నరమేధాలూ నియోగాలూ | బి. విజయభారతి | 250 |
| జీనా హైతో మర్‌నా సీకో | కాత్యాయని | 100 |
| పరిమళించిన మానవత్వం | ప్రొ. జి. హరగోపాల్ | 120 |
| సన్నిహితుల జ్ఞాపకాలలో అంబేద్కర్ | హెచ్‌బిటి | 200 |
| మా జ్ఞాపకాల్లో కెవిఆర్ | వకుళాభరణం లలిత | 80 |
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| టిపు సుల్తాన్ | యార్లగడ్డ నిర్మల | 150 |
| నా మాటే తుపాకి తూటా | విమల, కాత్యాయని | 120 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ ఫూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |
| కశ్మీర్‌లో నిషిద్ధ రాత్రి | బషారత్ పీర్ | 170 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం–1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| సహచరులు | వరవరరావు | 100 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| తత్వశాస్త్ర దారిద్ర్యం | కార్ల్ మార్క్స్ | 150 |
| తలకిందుల లోకం | మనీషా సేథి | 150 |
| ప్రశ్నలు అలాగే ఉన్నాయి | ఎం. రాఘవాచారి | 150 |
| సముద్ర స్వరం | పాలమూరు అధ్యయన వేదిక | 150 |
| వ్యక్తిత్వమే కవిత్వం | మలుపు ప్రచురణ | 100 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం–విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |
| భీమా కోరేగాం 12 – వివి | స్వేచ్ఛా సాహితి ప్రచురణ | 50 |
| యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం | ఎస్.అలెక్సీయెచ్ | 100 |
| రగుతులున్న అడవి | నందినీ సుందర్ | 290 |

## కథ – నవల

| | | |
|---|---|---|
| మేరువు | విరసం ప్రచురణ | 90 |
| మానధనులు | హూవర్డ్ ఫాస్ట్ | 150 |
| దండకారణ్య కథలు (2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు – రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నిషిధ | నల్లూరి రుక్మిణి | 180 |
| మాటిగరి | గుగి వా థియోంగో | 120 |
| మట్టికాళ్ల మహారాక్షసి | గుగి వా థియోంగో | 200 |
| బంది | గుగి వా థియోంగో | 200 |
| నేను చావును నిరాకరిస్తున్నాను | జి.ఎన్. సాయిబాబా | 125 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 226 - August 2020 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/07/2020 ● Postal Regn. No. HD/1100/2020-22



If undelivered please return to:
**VEEKSHANAM**
Mytri Residency, 3-6-394, St. No. 3,
Himayatnagar, Hyderabad - 500 029.
Phone: 040 66843495

To:
Mr./Mrs.________________

Date of Posting : 29th, 30th

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao